"భాగవతామృతాన్ని జీవితాంతం పానం చేయండి."

శ్రీగణేశాయ నమః - శ్రీ శారదాంబాయై నమః - శ్రీకృష్ణపరమాత్మనే నమః

# శ్రీమద్భాగవత మహాపురాణము

## అష్టమ, నవమ స్కంధాలు

చతుర్ధ సంపుటము.




అనువాదకుడు, ప్రకాశకుడు :

పురాణపండ రాధాకృష్ణమూర్తి

భాగవత మందిరం - రాజమండ్రి-4.


శ్రీ శ్రీ శ్రీ ఓం నారాయణ్‌జీ మహరాజ్‌వారి ఆశీస్సులతో.

బ్రహ్మశ్రీ జటావల్లభుల కృష్ణ సోమయాజులుగారు &

శ్రీయుత ఇ. అహోబలరావు గార్ల సంపూర్ణ ప్రోత్సాహంతో.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## అష్టమ, నవమ స్కంధాలు

## చతుర్థ సంపుటము.



ప్రథమ ప్రచురణ :
ది. 17-2-93
మహా శివరాత్రి



మూల్యము :
**రూ. 25-00**



ముద్రణా నిర్వహణ :
భరద్వాజా బైండింగ్ వర్క్స్
రా జ మం డ్రి - 4.



ప్ర తు ల కు :
ాణపండ రాధాకృష్ణమూర్తి
సూర్యహోటల్ ప్రక్కన
) టాకీస్ రోడ్ - రాజమండ్రి-4.



ఫోన్ : **7 6 3 5 6**



# మంగళాశీస్సు

శ్రీమతి బొప్పన ఝాన్సీలక్ష్మి

శ్రీ బొప్పన శేషగిరిరావు

దంపతులు

# ధర్మో రక్షతి రక్షితః

అనంతశక్తి సంపన్నుడూ, అపారకరుణా వరుణాలయుడు అయిన పరమాత్మ లీలలు
ాలే కాదు అనూహ్యాలు కూడ. ఆ దేవదేవుడు ఎప్పుడు ఎవరిద్వారా ఏమి చేయిస్తాడో
ంచజాలము కదా ! జన్మజన్మాంతరాలలో విశేష పుణ్యం చేసుకున్నవారు మాత్రమే
మందికి సహకరించే శాశ్వత పవిత్ర సద్గ్రంధరత్నాల ప్రచురణ ప్రచారాలకు భూరి
లు అందజేయగలుగుతారు. లక్షలాది రూపాయల వ్యయంతో మేము ప్రచురిస్తున్న
తిలకమైన భాగవత మహాపురాణ ప్రచురణ విశేష ప్రచారాలకు పదివేల రూపా
విరాళాన్ని శ్రద్ధ భక్తులతో నిండు హృదయంతో అందజేసిన ధన్యాత్ములూ, ధీ,ధీర,
పన్నులూ, సజ్జనకీర్తిపాత్రులూ అయిన శ్రీమతి బొప్పన ఝాన్సీ లక్ష్మి & శ్రీయుత
ు శేషగిరిరావు దంపతులకు వారి ఇష్ట దేవతలైన శ్రీ బాలాత్రిపురసుందరీ దేవియూ,
త్యనారాయణ స్వామీ - ఈ పుణ్యాత్ములకూ, వీరి కుటుంబ పరివారానికీ యిట్టి ధర్మ
ు అనంతంగా చేసే ఆసక్తినీ శక్తినీ ప్రసాదించి సర్వకాల సర్వావస్థలయందూ
ంచును గాక ! వీరి మార్గం వీరి బంధుమిత్రాదులందరికీ ఆదర్శమగును గాక ! వీరి
వులైన శ్రీనివాసరావు, శ్రీధరరావు అవశ్యం ఉన్నత విద్యలో నిరంతరాభివృద్ధిని
అనంతైశ్వర్య దీర్ఘాయురారోగ్యంతో విరాజిల్లాలని కోరుతూ మంగళాశీస్సులను అంద
ము.

ంద్ర డి 4
వరాత్రి 9

పురాణపండ రాధాకృష్ణమూర్తి
భాగవత మందిరము.

---

మద్రాస్ - శ్రీ శ్రీ శ్రీ ఓం నారాయణ్‌జీ మహరాజ్‌వారి ఆశీస్సులతో.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## అష్టమ, నవమ స్కంధాలు

## విషయానుక్రమణిక

## అష్టమ స్కంధం

ష్ణ పరమాత్మనే నమః.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-1

## మన్వంతర వర్ణన.

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని అర్థిస్తూ – "మునీంద్రా! గతంలో నేను స్వాయంభువ వంశ విశేష విస్తారాలను విని ఉన్నాను. అతని కన్యల వల్లనే మరీచ్యాది ప్రజా పతులు ంశాన్ని వర్ధిల్ల జేసుకున్నారు. ఇప్పుడు మీరు మిగిలిన మనువుల వంశ విస్తార విశేషాలను ంచండి. ఏయే మన్వంతరాలలో జ్ఞానులూ మహనీయులూ అయినవారు పరమాత్మ యొక్క ృతార లీలలను, గాథలను కీర్తించినారో సవిస్తరంగా చెప్పండి. ఆయా పావన గాథలను త శ్రద్ధాసక్తులతో మేము ఆలకించ గోరుతున్నాము. జరిగిపోయిన మన్వంతరాలలో భగ ు ప్రదర్శించిన దివ్య లీలాభి వర్ణన చెయ్యండి. వర్తమాన, భవిష్యత్ మన్వంతర లీలలను వర్ణించి చెప్పండి. అని కోరగా ఆ మహారాజుకు శుకమహర్షి సమాధానం చెబుతూన్నాడు.

'రాజా! ఈ కల్పంలో స్వాయంభువాది మన్వంతరాలు ఆరు గడచిపోయాయి. ఆదితో ల ఉత్పత్తి గాథలను నీకు చెప్పాను కదా! స్వాయంభువ మను కన్య అయిన ఆకూతి ిగవానుడు యజ్ఞ పురుష రూపాన ప్రభవించాడు. కపిలావతార లీలా గాథలను కూడ నీకు ంలోనే చెప్పాను. ఆకూతి గర్భాన యజ్ఞపురుషుడు ప్రభవించి చేసిన విశేషాద్భుతాలను అభి ు ఆలకించు.

సర్వాభీష్టాలనూ, విషయ వాసనా సర్వస్వాన్నీ భోగ భాగ్యాదులనూ అన్నిటినీ పరిత్య ర్ధాంగి యైన శతరూపను వెంటబెట్టుకుని స్వాయంభువ మనువు తపస్సార్థం కాననాలకు యాడు. ఆ దంపతులు సునందా నదీ తీరంలో ఏకపాదం మీద నిలచి నూరు సంవత్సరాల ర్యంతం మహత్తరమైన తపస్సును చేశారు. తపస్సమయంలో వారు నిత్యం పరమాత్మను ంగా సంస్తుతించేవారు :–

ఏ చైతన్యవంతుని సంస్పర్శ మాత్రంచే యీ విశ్వం చైతన్యాన్ని పొందు తూన్నదో? యీ విశ్వం ఎవనికి చైతన్యాన్ని ప్రసాదించ జాలదో? యావద్విశ్వమూ నిద్రించే సమ గానూ, ప్రళయ కాలంలోనూ కూడ ఎవడు జాగ్రదవస్థలోనే ఉంటాడో? ఎవణ్ణి యీ విశ్వం ంచలేదో? అట్టి జగత్ జ్ఞాత అయినవాడే పరమాత్మ. చరాచర జీవకోటి సమే యావత్ ప్రపంచమూ ఆతనియందే లీనమై ఉంది. కనుక ఏ వస్తువు మీదా మోహం దానిని త్యజించి జీవితాన్ని గడపాలి. తృష్ణను సర్వదా త్యజించాలి. ఈ ప్రాపంచిక ాదులు ఎందుకు? సర్వసాక్షి అయిన పరమాత్మను బుద్ధి వృత్తులు కానీ నేత్రాది ఇంద్రి కానీ దర్శించ జాలవు. ఆ దేవ దేవుని జ్ఞానశక్తి అఖండమై వర్ణనాతీత మయింది. సర్వ హృదయాంతర్యామియై స్వప్రకాశ స్వరూపుడై సంగ రహితుడైన ఆ దేవ దేవునే శరణు . ఆది మధ్యాంతాలు లేనివాడు, స్వపర భేదాలలోనూ, బాహ్యాభ్యంతరాలలోనూ ఎవడు కబిడీకృతుడై ఉన్నాడో? ఆ దేవ దేవుని శక్తియే జగత్తు యొక్క శక్తి, అనంతుడూ, స్వరూపుడూ, విశ్వ రూపుడూ కూడ ఆ పరమాత్మయే. అనంత నామాలతో భాసిల్లే సర్వ శక్తిమంతుడై, అజన్ముడై, పురాణ పురుషుడై, స్వమాయా శక్తితో జగదుత్పత్త్యాదు గహించి నిజ విద్యా శక్తి ద్వారా దానిని పరిత్యజించి నిష్క్రియుడై సత్య స్వరూపుడై ుతూ ఉంటాడు నైష్కర్మ్య స్థితి అంటే బ్రహ్మాత్మైక్య స్థితికోసం ఆదిలో కర్మయోగాన్ని వించిన ముముక్షువులు క్రమంగా కర్మదూరు లవుతారు. సర్వ శక్తి సంపన్నుడైన పర కూడ కర్మ లాచరిస్తూంటాడు. ఆత్మ లాభం వల్ల పూర్ణ కాముడు కావడం వల్ల కర్మల ఆసక్తి కలిగి మాత్రం సంచరించడు. అందులకే భగవంతుని అనుసరించి ఆసక్తి రహి కర్మ లాచరించేవారు ముక్తు లవుతారు. జ్ఞాన స్వరూపుడైన పరమాత్మ యందు లేశ హంకారం కూడ ఉండదు. పరిపూర్ణు డవడం వల్ల ఆతనికి దేనియందూ అభిలాష ఉండదు. ప్రేరణ లేకుండానే ఆ భగవానుడు స్వేచ్ఛగా కర్మలు ఆచరిస్తాడు. తన ఆచరణల ద్వారా మానవులకు ఉపదేశాలు యిస్తాడు. సర్వ ధర్మ ప్రవర్తకుడూ, జీవన దాతా కూడా ఆ వుడే. ఆతనినే నేను శరణు కోరుతూన్నాను.'

శుకమహర్షి : 'పరీక్షిన్నరపాలా! ఒకానొక సమయంలో స్వాయంభువ మనువు ఏకాగ్ర తో మన్త్రమయమై, ఉపనిషత్ సారస్వ రూపమైన ఈ శ్రుతి పారాయణ చేస్తూండగా -

్య రహితంగా నదిలో పడి ఉన్న అతణ్ణి తిలకించి రాక్షసులు అతణ్ణి భక్షించాలని అతనిపై . సర్వాంతర్యామియైన యజ్ఞ భగవానుడు తన కుమారులైన యామనామక దేవతలతో డకు వచ్చి దురాత్ములైన ఆ రాక్షసుల నందరినీ అంతం చేసి ఇంద్ర పదవీ ప్రతిష్ఠితుడై లోకాన్ని శాసించ సాగాడు.

రాజా! స్వారోచిష మనువు రెండవ మనువుగా కీర్తి పొందాడు. అగ్ని పుత్రుడైన ద్యుమంత, సుషేణ, రోచిష్మంత, ఆదిగా గలవారు పుత్రులు. అతని కాలంలోని ంద్రుని పేరు రోచనుడు, ప్రధాన దేవతా గణంగా తూషితాదులు ఖ్యాతి గాంచారు. వేద ైన ఊర్జ స్తంభాదులు ఆ మన్వంతరలో సప్త ఋషులుగా వ్యవహరించారు. వేద శిరుడను పత్ని తుషిత గర్భం నుండి ప్రాదుర్భవించిన భగవానుడు విభునామ ప్రసిద్ధు డయ్యాడు. ంతం నైష్ఠిక బ్రహ్మచారిగా ఉండిపోయిన అతని ఆచరణ ద్వారా నీతిని గ్రహించాలి. ల మంది బ్రహ్మచర్య పాలకులైన ఋషులు అతని నీతిని స్వీకరించాలని వ్రత నిష్ఠ ్రరు. ప్రియ వ్రత చక్రవర్తి నందనుడైన ఉత్తముడు తృతీయ మనువుగా ఖ్యాతి ఈ. పవన, సృంజయ, యజ్ఞ హోత్రాదులు అతని కుమారులు. ఆ మన్మంతరంలో వశిష్ఠ ైన ప్రమదాదులు ఏడ్గురూ సప్తర్షులైనారు. సత్య, వేదశ్రుత, భద్రనామక దేవతలు గణ స్థానాన్ని అలంకరించినారు. ఆ మన్వంతరంలో 'సత్యజిత్తు' అనే పేరుతో డు పాలన చేశాడు. ధర్ముని అర్ధాంగి అయిన సూనృత గర్భం నుండి — భగవానుడు సేన నామంతో ప్రజావళిని అనుగ్రహించాడు. అతనితో సత్య వ్రత దేవతా గణం కూడ ంచింది. నాటి మహేంద్రుని నామం సత్యజిత్తు. అతనికి సఖుడై ప్రాదుర్భవించిన భగ , దురాత్ములు, అసత్య పరాయణులూ దుర్మార్గులూ అయిన దేవ ద్రోహులనూ, యక్ష భూత గణాలనూ అంతం చేశాడు.

'పరీక్షిన్నరపాలా! ఉత్తమ మను సోదరుడైన తామసు డనేవాడు చతుర్ధ మనువైనాడు. కుమారులుగా పృథు, ఖ్యాతి, నర, కేతువులు ఖ్యాతి గాంచగా, సత్యక, హరి వీరనాయకులు లో ప్రముఖ గణ స్థానంలో విరాజిల్లినారు. సప్త ఋషులుగా జ్యోతిర్ధామాదులూ, నందనుడైన వైధృతి నామంతో అమరులు ప్రకాశించారు. కాల మహిమ వలన నష్ట మైన శృతులను వారు స్వశక్తితో సంరక్షించడం వల్ల వారు వైధృతి నామంతో వ్యవహా

ద్దారు. ఈ మన్వంతర వేళలోనే మేధా ఋషీంద్రుని అర్ధాంగి గర్భం నుండి భగవానుడు
ాపాన ప్రాదుర్భవించాడు. ఈ కాలంలోనే అతడు మొసలి బారి నుండి గజేంద్రుని
ించాడు.'

అని శుకమునీంద్రుడు పలుకగా విన్న పరీక్షిన్నరపాలుడు. – 'మునీంద్రా! గజేంద్రుని బారి నుండి ఎలా రక్షించాడు? పుణ్య ప్రదమై, శ్రవణ యోగ్యమై, శుభ, మంగళదాయక మహనీయులచే గానం చేయబడిన హరి గాథలను నేను వివరంగా ఆలకించ గోరుచున్నాను. చెప్పండి.' అని కోరాడు,

# మద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–2

## గజేంద్రమోక్ష కథారంభము.

శుకమహర్షి – 'పరీక్షిన్నరేంద్రా! క్షీర సముద్రంలో పది యోజనాల ఎత్తూ, అంతే ప్పు అంతే పొడవు గల త్రికూట నామక పర్వతం ఉంది. దాని శిఖరాలు సువర్ణ, రజత, మయాలై సాగరాన్నీ, దిశాకాశాదులను భాసమానం చేస్తూన్నాయి. ఇంకా మిగిలిన శిఖ రత్న, ధాతు మయాలై వివిధ వర్ణాలతో సమస్త దిశలనూ భాసిల జేస్తూన్నాయి. అక్కడ జాతులకు చెందిన తరు, లతా గుల్మాదులు విశేషంగా ఉన్నాయి. నిర్ఝరిణులు ఝర్ఝర ధ్వను ప్రవహిస్తూన్నాయి. సర్వ దిశల నుండీ సాగర తరంగాలు ఆ పర్వత సమీపానికి వచ్చి ఆ రాజు యొక్క చరణాలను ప్రక్షాళనం చేస్తూన్నాయా? అన్నట్లు తాకి మరలిపోతూ . హరిత, మరకత వర్ణాలు కల పాషాణాలు ఆ హరి ప్రాంత ప్రదేశాలను శ్యామ భాసిల జేస్తూన్నాయి. ఆ గిరి గుహలలో సిద్ధ, గంధర్వ చారణ, విద్యాధర, నాగ, , అప్సర గణాలు నిరంతరం విహరిస్తూంటాయి. ఆ దేవ గణాల సంగీత ధ్వనులు ఆ హలలో ప్రతిధ్వనిస్తూండగా విని మృగరాజులు అన్య సింహ గర్జనలనుకుని ఆ ధ్వనిని

రించే స్థాయిలో గర్జిస్తూ ఉంటాయి. ఆ మహా గిరిపై వివిధ జాతులకు సంబంధించి మృగాలు హాలుగా వచ్చి సంచరిస్తూంటాయి. అనేకానేక తరు సమూహాలతో అక్కడి ఉద్యాన వనాలు మైన పక్షుల మధుర నాదాలతో శ్రవణాహ్లాదకరంగా ఉన్నాయి. అక్కడే నదులూ అనేకంగా రాలూ కూడ ఉన్నాయి. ఆ సరోవర నదీ జలాలు నిర్మలంగా మధురాతి మధురంగా యి. ఆ జల తీరాల యందలి పులిన తలాలు మణుల వలె ప్రకాశిస్తూ యి. ఆ జలాశయాలలో అమరకాంతలు ఆనందంగా స్నానాలు చేస్తూ జల క్రీడలలో ప్నలు కావడం వల్ల ఆ జలం సుగంధ భరితంగా ఉంది. కావున వాటి మీది నుండి ప్రవ వాయువులు కూడ సుగంధ భరితాలై ఉన్నాయి. తత్కారణం వల్ల ఆ సుగంధాన్ని వెంట ని ఆ వాయువులు దశదిశలలోని వాతావరణాన్ని సుగంధ భరితం చేస్తూన్నాయి. అక్కడే ప్మడూ, పరమాత్మ సేవకుడూ అయిన వరుణుని ఉద్యాన వనం ఉంది. ఆ వనంలో ఫల రితాలైన వృక్షాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. మందార, పారిజాత పాటలా శోక, చూత, ప్రియాలు, పనస, ఆమ్ర, ఆమ్రాతక, నారికేళ, క్రముక, ఖర్జూర, బీజ పూరక, క, సాల, తాల, తమాల, రసన, అర్జున, అరిష్ట, ఔదుంబర, ప్లక్ష, వటి, కించుక, చందన ంద కోవిదార, సరల, సురదార, ద్రాక్ష, కదళీ, జంబు, బదరీ, అభయ, ఆముక, బిల్వ జంబీ, భల్లాతకాది వృక్షాలు ఎన్నో ఉన్నాయి. వాటిని పెనవేసుకుని లతలుపై ప్రకాశిస్తూ ).

ఆ సుందరోద్యాన వనంలో సువర్ణకాంతులు గల పద్మాలు వికసించి ఉన్నాయి. కుముద, కల్హార, శత పత్రాది పుష్పజాతులు ఆ సరోవరానికి నూతన శోభను కలుగజేస్తూన్నాయి. పక్షి జాతులు మనోహరంగా కలరవాలు చేస్తూన్నాయి. మదమత్త భ్రమరాలు చేసే నాదాలు త ప్రతి ధ్వనిస్తూన్నాయి. జల కుక్కుట, కోయిష్టికాది జల విహంగాలు కూస్తూ వున్నాయి. కారండవ, సారసాది పక్షిజాతులు సమూహాలుగా విహరిస్తూ ఉన్నాయి.మత్స్య, కూర్మాదులు అటూ చరించడం వల్ల కమలాలు చరిస్తూ ఉంటే ఆ పుష్పపరాగం సరోవరంపై పడి సుగం వెదజల్లుతూ ఉంది. కదంబ, వేతస, నల నీప, వంజులకాది వృక్షాలు నల్దిశలా వ్యాప్తమై యి. కుంద, కురవక, అశోక, శిరీష, కుటజ, వన మల్లిక, కుబ్జక, స్వర్ణయిద్ధి, నాగ, గ, జాతి, మల్లిక, శతపత్ర, మాధవీ, జాలకాదులు—పుష్పగుచ్ఛాలతో భాసిల్లుతూ ఉన్నాయి.

ఋతువులలోనూ, ఫల పుష్ప సంభరిత తరు సమూహ సంభరితమై, ఆవృతమైన ఆ సరో
ిత్య నూత్నమై అత్యంత సుందరంగా భాసిల్లుతూన్నది.

ఆ పర్వత మందలి ఘోరారణ్యంలో అనేక గజాయూధాలకు నాథుడు ఓ గజేంద్రుడు నివ
్నాడు. అమిత బల పరాక్రమ సంపన్నాలైన గజయూధాలకు అతడు ప్రభువు; ఓనాడు ఆ
దుడు తన విశాల పరివారంతో కంటకాకీర్ణమైన కీచక, వేణు, వేత్రాది విశాలాలైన పొద
ల్చి పెకలించి వేస్తూ స్వేచ్ఛగా పరిభ్రమిస్తూన్నాడు. ఆ గజేంద్రుని మదగంధాన్ని వాసన
ంత మాత్రానికే సింహ వ్యాఘ్ర సర్ప, ఖడ్గమృగ, శరభ, చమరాది క్రూర మృగాలు
భయంతో పారిపోతున్నాయి. వృక, వరాహ, మహిష, భల్లూక, గోపుచ్ఛ, సాలావృక,
ట, హరిణ, శశాదులూ గజేంద్రుని కరుణ వల్ల భయరహితంగా సంచరిస్తూన్నాయి. ఆ
త్త గజేంద్రుని వెనుక విలాసంగా గున్న ఏనుగులు పురోగమిస్తూన్నాయి. ఓ పర్వ
ఉండే ఏనుగుల మంద ఆ గజేంద్రుని చుట్టు ముట్టి నడుస్తూన్నది. అలా ఆ గజ
ు స్వేచ్ఛగా సంచరిస్తూంటే ఆ త్రికూటాద్రియే చలించి పోతూన్నది, గజేంద్రుని గండ
నుండి బిందు రూపంలో స్రవించే మదాన్ని పానం చెయ్య భ్రమర సముదాయం అక్కడే
మిస్తూన్నది. అది గ్రీష్మ ఋతువు, చండ కిరణుడు ప్రచండంగా ఉన్నాడు. దాహ పీడి
గజేంద్రుడు పరివారంతో సహా పద్మ సుగంధ సహాయంతో ఆ సరోవరం చేరాడు. ఆ
ు జలాలు అత్యంత నిర్మలంగా అమృత సమ మధురంగా ఉన్నాయి. అరుణ వర్ణాలైన
కేసరాలతో నిండిన జలాలను పానం చేసి తొండంతో జలాలను తీసి స్నానం ఆరంభిం
ఆ గజేంద్రుడు. మోహ గ్రస్త గృహస్థునిలా తాను స్నాన మాచరించుటయే గాక గజేం
, మిగిలిన గజముల చేతా, గున్న ఏనుగుల చేతా కూడ స్నానం చేయిస్తూన్నాడు. వాటి
ో తన తుండాన్ని పెట్టి వాటిచే జల పానం చేయిస్తూన్నాడు. మాయా మోహంలో చిక్కి
తడు రాబోయే ప్రమాదాన్ని గుర్తించ జాలకున్నాడు.

నరేంద్రా! మదోన్మత్తుడై ఆ గజరాజు విహరించే సమయంలో ప్రారబ్ధ ప్రేరితయై మహా
ంపన్నమైన మకరం ఒకటి క్రోధంతో దాని పాదం పట్టుకుంది. హఠాత్తుగా సంభవించిన
పద నుండి బయట పడాలని గజేంద్రుడు గిజ గిజ లాడాడు. తన శక్తినంతా వినియోగించి
ర మకరి బారి నుండి విడిపించు కోవాలని ప్రయత్నించాడు. కానీ సఫలం కాలేదు. మిగిలిన

లూ, గున్న ఏనుగులూ కూడ తమ రాజు మకరి బారి పడ్డాడని విలపించాయి. మథన
౦. వైకల్యాన ఘీంకరించాయి. అందులో శక్తి సంపన్నాలైన అనేక ఏనుగులు గజేంద్రు
హాకరించి పైకి లాగాలని ప్రయత్నించి కూడ విఫలమై పోయాయి. కరి మకరులు రెండూ
క్తులతో యుద్ధం చేస్తూనే ఉన్నాయి. ఓసారి గజేంద్రుడు స్వశక్తితో మొసలిని గట్టుకు
హంటే, మరోసారి ఆ మకరి తన శక్తి నంతా వినియోగించి గజేంద్రుని లోపలకు లాగి
న్నది. ఈ విధంగా ఆ రెండింటి యుద్ధము వెయ్యి సంవత్సరాలు కొనసాగింది. కానీ రెండూ
గానే ఉండి పోయాయి. అది చూసి అమరులు సయితం ఆశ్చర్య చకితులై పోయారు. ట్ట
మొసలి బలం అధికంగా కాగా మాటి మాటికీ అది గజేంద్రుని లోపలికి లాగి వేధించ
దాని శరీరం శిథిలమై పోయింది. మానసికోత్సాహం నాశనమై పోయింది. శక్తి శూన్యమై
ంది. ఆ గ్రాహానికి స్థావ బలం అధికమై పోయింది. గజేంద్రుడు ప్రాణ సంకటంలో చిక్కు
పద నుండి బయటపడడానికి స్వశక్తి చాలక-విశేష సమయం యోచించి తత్కష్టాన్నుండి
పడడానికి ఉపాయాన్ని అన్వేషించ సాగాడు. భగవంతుడే మకరి రూప పాశాన్ని నా
పయోగించాడు. తత్ పాశ బంధితుడనై నేను ప్రాణ సంకటంలో పడ్డాను. నేను కానీ
సమాన శక్తి కల అన్య గజము కానీ నన్ను యీ ఆపద నుండి తప్పించ జాలకుంటే —
డ ఏన్గులు ఎలా విడిపించ కలవు? అన్య సహాయం నాకేదీ లేదు. శక్తి శూన్యుడనైన నేను
తునే శరణు పొందాలి. మహా బలవంతమైన కాలం సర్ప సమ ప్రచండ వేగంతో నోరు
జీవరాసి నంతటనీ కబళించి వేయ మహావేగంతో పరుగులు తీస్తున్నది. దానికి భీతి చెంది తనను
చే వారిని పరమాత్మ రక్షిస్తాడు. మృత్యువు కూడ పరమాత్మకు భీతి చెంది తన హద్దుల
ంచరిస్తుంది. సర్వాశ్రయుడైన ఆ భగవంతునే నేను శరణు పొందెదను గాక!

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–3

## గజేంద్రుడు శ్రీహరిని ప్రార్థించగా ఆ దేవ దేవుడు అతణ్ణి రక్షించుట :

శుక మహర్షి – "రాజా! గజేంద్రుడు ఉపర్యుక్త రీతిని నిశ్చయించుకుని మనస్సు శుంలో ఏకాగ్రం చేసి పురాతన జన్మ ప్రాప్తమైన స్తోత్రం ద్వారా పరమాత్మను స్తుతించ :—

ఈ విశ్వానికి మూల కారణమైన వాడెవ్వడో! సర్వ జీవుల హృదయాంతర్యామి రూపాన ంచు నట్టి వాడెవడో? చరాచర విశ్వ సర్వస్వానికీ ఏకమాత్ర ప్రభువైన వాడెవడో? ల్ల విశ్వమంతా చైతన్యవంత మగుచున్నదో? ఆ శ్రీహరికి ప్రణమిల్లి ప్రేమతో ధ్యాని ను. ఈ విశ్వమంతా ఆ భగవంతుని యందే ఉంది. అతని వల్లనే ప్రతీత మవుతూ వున్నది అతడే జగత్తంతా వ్యాపించి ఉంటాడు. జగద్రూపంలో స్వయంగా తానే ప్రకటిత మవు డు. సర్వం తానై కూడ–యీ విశ్వమూ, విశ్వకారణమైన ప్రకృతీ, యీ రెంటికీ పర ాడుగా తానే ఉన్నాడు. స్వయం ప్రకాశ, స్వయం సిద్ధ, సత్యాత్మకుడైన ఆ దేవ దేవునే రణు వేడుతూన్నాను. ఆ హరి మాయ వల్లనే యీ గగత్తు అంతా అతని యందే అధ్యస్త ాన్నది. ఒకచో ప్రతీత మవుతుంది. వేరొకచో కాదు. కానీ ఆ దేవుని దృష్టి మాత్రం– సర్వత్రా ఏక మాత్రంగానే ఉంటుంది. సృష్టి ప్రళయాలకు రెంటికీ సాక్షి మాత్రుడుగా ాను డుంటాడు. సర్వానికీ, తనకూ కూడ తానే మూలమై ఉండే ఆ పరమాత్మకు అన్య మన్న దేదీ లేదు. సర్వ కార్యకారణాతీతుడైన ఆ శ్రీహరి నన్ను కాపాడును గాక! ప్రళయ ోకాలూ, లోకపాలురూ, సర్వ కారణాలూ కూడ సంపూర్ణంగా నాశనమై పోతాయి. తత్ప కేవలం ఘనాంధకారమే వ్యాపించి వుంటుంది. కానీ ఆ స్వయం జ్యోతి స్వరూపుడు ళయాంధకారం లోపంగా భాసిల్లుతూనే ఉంటాడు. ఆ ప్రభువే నన్ను కాపాడును గాక!

తుని లీలా రహస్యాలను గ్రహించడం చాలా కష్టం. ఆతడు నటుని రీతిని అనే కానేక ధరిస్తూ ఉంటాడు. అతని యదార్ధ రూపాన్ని అమరులే గ్రహించ జాలకుంటే సామాన్య ఈ విషయం వేరుగా వర్ణించాలా? స్తుతి పాత్రుడైన ఆ సర్వశక్తి సంపన్నుడే నన్ను ను గాక!

పరమేశ్వరుని దివ్యమంగళ సుందర విగ్రహ సందర్శనాభిలాషతో మహాత్ముల సంసార న భోగాలను అన్నింటినీ పరిత్యజించి అడవులకు పోయి అఖండ భావంతో అలౌకిక చర్యాది వ్రతావలంబులై ధ్యానిస్తూ వుండే వారు నిజాత్మయే సర్వ హృదయాలలో కం చూసి స్వాభావికంగా మంచినే కోరుతూ ఉంటారు. ఆ మునులయొక్క సర్వ స్వరూ భగవానుడే నాకు సహాయకు డగును గాక! నా గతి కూడ ఆతడే. జన్మ కర్మలూ. పాలూ లేని శ్రీహరి యందు గుణ దోషాది కల్పనలకు స్థాన మెక్కడ? అయినా జగత్ ంహారాదుల నిమిత్తం ఆయా సమయాలలో భగవానుడు కూడ స్వమాయ ద్వారా గుణా కరిస్తూ ఉంటాడు. అనంత శక్తియుతుడైన ఆ పరమాత్మకు నేను ప్రణమిల్లు తూన్నాను. ాతుడే అయినా అనేక రూపాలు కలవానిలా నటన చేస్తూంటాడు. అతని కర్మలు అత్యం దాయకాలై ఉంటాయి. అట్టి శ్రీహరి చరణ కమలాలకు నేను ప్రణమిల్లు తూన్నాను. శ స్వరూపుడు, కర్మసాక్షీ, మనోవాగతీతుడూ, దేనికీ అందని వాడూ అయిన ఆ దేవ ప్రణమిల్లు తూన్నాను. ధీశాలురు కర్మ సన్యాసం చెయ్యక కర్మ సమర్పణ ద్వారా తరంగులై పొందే పరమాత్మ, విముక్తుడై పరమానంద మయుడై, జ్ఞాన స్వరూపుడై ముక్తిని ప్రసాదించగల సర్వ శక్తి సంపన్నునకు నేను వందనం చేస్తూన్నాను. సత్త్వ ూగుణ ధర్మాలను స్వీకరించి శాంత ఘోర మూఢావస్థలను దాల్చి భేదం లేని వాడై సర్వ , జ్ఞానానంద ఘనుడై భాసిల్లు నట్టి వానికి నేను వందనం చేస్తూన్నాను. దేవా! సర్వా సర్వ సాక్షివై క్షేత్రజ్ఞుడవైన నీ కిదే నా నమస్కారము ఆత్మ కారణుడవు, సర్వ ారణుడవు పురుష రూపుడవు, మూల ప్రకృతి స్వరూపుడవు అయిన నీ కిదే మాటి ప్రణామం చేస్తూన్నాను. సర్వేంద్రియ విషయ ద్రష్టవూ, ప్రతీతమయ్యే సర్వ వస్తు ఆధార భూతుడవూ, అహంకారాది ఛాయా రూపాలైన అసత్పదార్థాల ద్వారా భవదీయ స్తిత్వం ప్రకటింపబడుతూ ఉంటుంది. సర్వ వస్తువుల సత్తా రూపంలోనూ నువ్వే

తూ ఉంటావు. అట్టి నీకు వందనాలు. సర్వానికీ మూల కారణం నువ్వే. అన్య కి రణ
వేరే ఏదీ లేదు. సర్వ కారణుడవైన నీలో పరిణామ, వికారా లన్న వేవీ లేవు. అందు
హర్షులు నిన్ను అద్భుత కారణు నిగా గ్రహించ గలిగారు. అట్టి నీకు పదే పదే ప్రణ
న్నాను. చిన్న పెద్ద భేద రహితంగా సమస్త నదులకూ సాగరమే ఎలా ఆశ్రయమో?
వేదశాస్త్ర సర్వస్వానికీ నువ్వే పరమాశ్రయుడవు. మోక్ష ప్రదాతవైన నిన్నే సజ్జనులు
స్తూ ఉంటారు. అట్టి నీకు నా ప్రణామాలు. అగ్ని అరణిలో గుప్తంగా ఉన్నట్లే నువ్వు
గుణాదుల ద్వారా జ్ఞానాన్ని కప్పి ఉంచుతావు. గుణ సంక్షోభం వల్ల తద్గుణాల ద్వారానే
రగతులకు చెందిన సృష్టి రచనా సంకల్పం నీలో ప్రభవిస్తూ ఉంటుంది. కర్మ సన్యాసం
లేదా సర్వ కర్మ సమర్పణ ద్వారా విరాగులై ఆత్మ తత్త్వాన్ని భావించునట్టివాడు వేద
తీతంగా నిన్ను సందర్శించ గలుగుతారు. అట్టి వారిలో ఆత్మ రూపంతో తేజరిల్లే నీకు
లు. దయగలవాడు బంధన బంధితమైన పశు బంధనాన్ని ఖండించి వేసినట్లే నువ్వు శరణా
న నావంటి వాని బంధనాన్ని ఛేదించి వేస్తావు. కరుణా సాగరా! భక్తులను అనుగ్ర
ంలో నువ్వెంత మాత్రం విలంబం చెయ్యవు. అట్టి నీ శ్రీ చరణ కమలాలకు ప్రణ
ఉన్నాను. అంతర్యామి రూపంలోనూ, సర్వ హృదయాంతరాళాలలోను నువ్వే లభ్య
న్నావు. సర్వైశ్వర్య పూర్ణుడవై అనంతుడవైన నీకు నా ప్రణామాలు, దేహ, గేహ,
త్ర సంపదాదులయందును, స్వపరివారమందునూ ఆసక్తి కలవారు గుణాసక్త రహితుడ
న్ను పొందజాలరు. జీవన్ముక్తులు సర్వదా నిన్నే ధ్యానిస్తూ ఉంటారు, సర్వైశ్వర్య పరి
వై జ్ఞాన స్వరూపుడవైన దేవా! నీకు ప్రణమిల్లుతూన్నాను. ధర్మార్థ కామ మోక్షాసక్తు
ు నిన్నే శరణువేడి అభీష్టాలను పొందుతూ ఉన్నారు. అట్టి భక్తులకు పరమాత్మ సమస్త
మా ప్రసాదించి సారూప్యంతో అవినాశనమైన పార్షద సిద్ధిని కూడ ప్రసాదిస్తూన్నాడు.
శ్వరునకు నేను ప్రణమిల్లుతూ ఉన్నాను. హరి భక్తులు మోక్షాసక్తిని సయితం త్యజించి
శ్రీహరి లీలా గుణ గానంతో ఆనందిస్తూ ఉంటారు. అవినాశి, సర్వ శక్తి సంపన్నుడు,
స్వరూపుడు, ఇంద్రియాతీతుడు, సూక్ష్మాతి సూక్ష్ముడూ, అతి సన్నిహితంగానూ,
త దూరంగానూ గోచరించునట్టివాడూ, అధ్యాత్మ జ్ఞాన, భక్తి యోగాల ద్వారా ప్రాప్తించు

షూ, ఆది పురుషుడై, అనంతుడై, పరిపూర్ణుడై, పరబ్రహ్మమైన పరమాత్మను నేను స్తూన్నాను.

ఏ దేవదేవుని కళాంశ మాత్రంచే అగణిత నామ రూపాది భేదాలతో బ్రహ్మాది దేవతలూ, స్త్రీలూ, చరాచర ప్రపంచాదులూ సృజించబడ్డాయో? ప్రజ్వలితాగ్ని నుండి విస్ఫు ప్రస్ఫుటించే టట్లూ, భాస్కరునివల్ల బహిర్గతమైన కిరణ జాలం మరల ఆతనిలో లీనమై ట్లు స్వప్రకాశ స్వరూపుడైన పరమాత్మయందే మనో బుద్ధీంద్రియ శరీరాదులు గుణ రూపంలో ప్రాదుర్భవిస్తూ లయమవుతూ ఉంటాయి. సురాసుర పశుపక్ష్యాదులూ స్త్రీ నపుంసకాది భేదాలూ ఆతనియందు లేనే లేవు. సాధారణ, అసాధారణ జీవులకన్న గా, గుణ కర్మ కార్య కారణాదు లేవీ అతనియందు లేవు. 'ఇది కాదు, ఇది కాదు' నేతి) అని నిషేధించి సర్వమూ నిషేధింపబడగా శేషించిన వస్తువే పరమాత్మ. అట్టి పర నన్ను సంరక్షించే నిమిత్తం ప్రత్యక్ష మగును గాక!

ఈ శరీరం బాహ్యాభ్యంతరాలలో అజ్ఞానావరణతో ఆవరింపబడి ఉంటుంది. దీనితో పొందే ప్రయోజనం ఏమీ లేదు. అందువల్ల బ్రతకాలన్న కోరిక లేదు. ఆత్మ ప్రకాశాన్ని ఆవరిం జ్ఞానావరణ నుండి తప్పించుకోవాలనియే ఉంది. అది నా వల్ల అయ్యేది కాదు. అజ్ఞానం కావాలంటే దైవ కృప, తత్త్వ జ్ఞానాలు ఉండాలి. అందుకే నేను భగవంతుణ్ణి శరణు వేడు ను. విశ్వ రూపుడు, విశ్వ దూరుడూ, విశ్వ రచయిత, అంతరాత్మ రూపంలో విశ్వ ఉంటూ విశ్వరూప సామగ్రి ద్వారా క్రీడించు వాడూ, అయిన అజుడూ, పరమ పద పుడూ అయిన బ్రహ్మకు నేను ప్రణమిల్లు తూన్నాను. యోగులు యోగం ద్వారా కర్మ, సన, కర్మ ఫలం—వీటన్నిటినీ దగ్ధం చేసి నిజ యోగ శుద్ధ హృదయంలో ఏ యోగేశ్వ సాక్షాత్కరింప జేసుకుంటూన్నారో? ఆ సర్వేశ్వరునకు నమస్కరిస్తూన్నాను. దేవా! భవదీయ మైన సత్వ రజస్తమో గుణ వేగాన్ని సహించడం అసాధ్య విషయమే. సర్వేంద్రియాల, యొక్క విషయ రూపంలో నువ్వే ప్రతీత మవుతూ ఉంటావు. కనుకనే ఇంద్రియ నిన్ను పొందే మార్గాన్ని పొందజాలరు. నీ శక్తి అపారమైనది. శరణాగత వత్సలా! నేక వందనాలు సమర్పించు కుంటూన్నాను. అహంకారం కారణంగా నీ మాయ ఆత్మ

పాన్ని ఆవరించి వేస్తూన్నది. కనుకనే స్వస్వరూపాన్ని దర్శించజాలక జీవుడు యాతనలు గాన్నాడు. అపార మహిమాన్వితా! సర్వ శక్తి సంపన్నా। మాధుర్య నిధీ। నిన్నే నేను వేడుతూన్నాను.'

గజేంద్రుడు ఆ విధంగా ప్రార్థించగా సర్వ దేవ స్వరూపుడూ, సర్వాత్ముడూ అయిన నారాయణుడు ప్రకటించబడ్డాడు. గజేంద్రుని అవస్థను తిలకించి ఆ కరుణా సముద్రుడు స్తుతికి మహానందం చెందాడు. గరుడారూఢుడై ఆ చక్రధారి గజేంద్రుడు తీవ్ర వేదనకు వుతూన్న ప్రదేశానికి విజయం చేశాడు. అమర సమూహం ఆ దేవ దేవుని స్తుతిస్తూ టి వస్తూన్నారు. ఆ సరోవరంలో ఉన్న క్రూర గ్రాహం (మొసలి) గజేంద్రుని బలంగా పట్టుకు పీడిస్తూన్నది. వ్యాకులుడైన గజేంద్రుడు తత్సమయంలో వేదమయ గరుడవాహనా రైన శ్రీహరిని దర్శించి అతి కష్టంపై ఆ సరోవరంలోని సుందర కమలాన్ని తీసి పై నారాయణా! విశ్వ గురో। భగవన్! నీకు ప్రణమిల్లుతూన్నాను.' అంటూ దీనంగా స్వరంతో పలుకుతూ ఉంటే ప్రాణ సంకట స్థితిలో ఉన్న అతణ్ణి తిలకించిన శ్రీహరి ు విడనాడి శీఘ్ర గమనంతో సరోవరంలోకి దూకి గజ మకరాలను బయటకు లాగి అమ క్షణంలో సుదర్శనంతో ఆ మొసలి శిరస్సును ఖండించి గజేంద్రుని సంరక్షించాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-4

### కరి మకరుల పూర్వజన్మ వృత్తాంతము.

శుకమహర్షి పలుకుతూ ఉన్నాడు:— 'రాజా! తత్సమయంలో శంకర బ్రహ్మేంద్రాది ఋషి ముని, గంధర్వ గణాలూ శ్రీహరి కార్యాన్ని ప్రశంసించి పూల వాన కురిపించారు. లోకంలో దివ్య దుందుభులు మ్రోగాయి. గంధర్వులు గానం చేయగా, అప్సరసలు చేశారు. కిన్నరులు పాడగా సిద్ధ చారణ ఋషిగణాలు స్తోత్రం చేయగా ఆయా ధ్వనులు లా ప్రతిధ్వనించాయి. దేవల ఋషి శాపం వల్ల 'హూహూ' అనే గంధర్వుడే మొసలి న్ని పొందాడు. అతడే శాపవిముక్తుడై హరి చరణ కమలాలయందు శిరస్సు ఉంచి సంస్తు ం. యదార్థానికి అవినాశియైన పరమాత్మయే కీర్తి సంపన్నుడు. ఆ హరి గుణ లీలాదులు గారాలై గాన యోగ్యాలై ఉంటాయి. ఆ దేవ దేవుని, కరుణా సముద్రుని దివ్య కథ మాత్రంచే ఆ గంధర్వుడు సర్వ పాప దూరుడై స్వస్వరూపం పొంది శ్రీహరికి ప్రద పణామాలు ఆచరించి తన లోకానికి వెళ్ళిపోయాడు. భగవత్ స్పర్శ మాత్రంచే గజేం కూడ అజ్ఞాన దూరుడై భగవత్ స్వరూపాన్ని పొంద గలిగాడు. గత జన్మలో గజేం పాండ్య నరేశుడైన ఇంద్ర ద్యుమ్న రాజుగా ఖ్యాతి గాంచి భగవద్భక్తుడై ఉండేవాడు. క సమయంలో అతడు పురాన్ని విడనాడి తాపస వేషంలో జటాజూట ధారియై మలయ తపస్సు చేస్తూన్నాడు. ఓనాటి మాట. స్నానానంతరం అతడు పూజా సమయంలో పై ఏకాగ్ర చిత్తంతో ధ్యానంలో ఉండగా విధివశాత్తూ శిష్య సమేతంగా అగస్త్య మహర్షి చేశాడు. ప్రజా పాలన గృహస్థోచిత ఆతిథి సేవా ధర్మాదులను విడనాడి తాపసులవలె వాసం చేస్తూ మౌనిగా ఇంద్రద్యుమ్న రాజు కూర్చోవడం వల్ల దేశానికి అనర్థమని ంచిన అగస్త్య మహర్షి కుపితుడై — గురు జన సేవా, శిక్షణా రహితంగా, అహంకారంతో హ్మణ శ్రేష్ఠులను అవమానించే యీ రాజు గజ సమ జడ బుద్ధితో ఉన్నాడు. కావున ఘోరం మయమైన గజ జన్మను పొందును గాక!' అంటూ శపించాడు.

నిగ్రహానుగ్రహ సమర్థుడూ, వర శాపాదులు యీయ శక్తి కలవాడూ అయిన
్య మహర్షి ఆ రాజును అలా శపించి శిష్య సమేతంగా స్వేచ్ఛగా వెళ్ళిపోయాడు. అది
ారబ్ధ మని భావించి ఇంద్ర ద్యుమ్న రాజర్షి శాపాన్ని ఆనందంగా స్వీకరించాడు.
ంతరంలో అతనికి ఆత్మ జ్ఞానాన్ని మరుగుపరచే గజ జన్మ లభించింది. ఆ స్థితిలో కూడ
పూర్వ జన్మ పుణ్య ఫలంగా హరిధ్యాన స్మృతులు నాశనం కాలేదు. శ్రీహరి భగవానుడు
ా గజేంద్రుని రక్షించి దివ్య శరీరాన్ని ప్రసాదించి తన పార్షదులలో స్థానాన్ని ప్రసా
రుడ వాహనా రూఢుడై వైకుంఠ ధామానికి విజయం చేశాడు. తత్సమయంలో దేవ
హరి లీలా గానం చేస్తూ స్వస్థానాలకు ప్రస్థానించారు.

పరీక్షిన్నరేంద్రా! నీకు నేను హరి మహిమా భూయిష్ఠమైన గజేంద్ర గాథను వినిపిం
దీనిని శ్రద్ధాసక్తులతో ఆలకించునట్టివారు కలిమల దూరులై, దుస్స్వప్నాలు నాశనం కాగా
పొందుతారు. ధీశాలురు పరమ శాంతిని పొందేటందులకు పవిత్ర హృదయులై దైవ
ంభరితమైన యీ గాథను పఠిస్తూ ఉంటారు. గజేంద్రుడు చేసిన స్తుతికి ప్రసన్నుడై
త్మ అమర సమూహంలో యీ రీతిగా చెప్పాడు. – బ్రాహ్మ ముహూర్తంలో లేచి
చిత్తంతో నన్ను, నిన్ను యీ సరోవర, పర్వత, గుహ, వన, కీచక, వేణు, వేత్ర
దులను, వృక్ష పర్వత శిఖరాదులను, శివ బ్రహ్మల వాసస్థానాదులను నాకు
ప్రీతి పాత్రమైన క్షీర సముద్ర ప్రకాశవంతమైన శ్వేత ద్వీప శ్రీవత్స,
, వనమాల, కౌమోదకి, సుదర్శన పాంచ జన్యాదులను గరుడునీ, మదీయ సూక్ష్మ కళా
న శేషభగవానునీ నా ఆశ్రయంలో ఉండే లక్ష్మీదేవినీ, నారద, ప్రహ్లాద, మత్స్య
, వరాహావతార వేళల్లో నాచే చేయబడిన అనంత, పుణ్యమయ చరిత్రలనూ, సూర్యచంద్ర,
్యదులు, ఓంకార, సత్య మూల ప్రకృతులూ గో బ్రాహ్మణ ధర్మాదులూ, ఐరావత, ధ్రువ
లు, నల, యుధిష్ఠిర జనకాదు లయిన మహా పురుషులూ – వీరందరి కందరూ మత్
పులే కావున – వీరిని స్మరించినవాడు పాప దూరుడై మోక్షాన్ని పొందగలడు. గజేంద్రా!
్మ ముహూర్తంలో బాహాభ్యంతర శుచియై – నీచే నన్ను గురించి చేయబడిన స్తోత్రాన్ని
రణ చేయువానికి – అవసానదశలో నిర్మల బుద్ధిని ప్రసాదిస్తాను.' అంటూ శ్రీహరి

...ుడు అమరులకు ఆనందాన్ని ప్రసాదిస్తూ పాంచజన్యాన్ని పూరించి గరుడా రూఢుడై ...క ధామానికి ప్రస్థానించాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–5

### ...మరులు బ్రహ్మను దర్శించుట – బ్రహ్మ హరిని స్తుతించుట.

శుకమహర్షి పలుకు తూన్నాడు. – పరీక్షిన్నరపాలా! గజేంద్ర మోక్ష గాథా రూపమైన ...లు సర్వ పాపాలనూ నాశనం చేస్తాయి. దానిని నీకు వినిపించాను. ఇక రైవత మన్వం...ర్ణన చేస్తాను. సావధానంగా ఆలకించు. పంచమ మనువైన రైవతుడు చతుర్థ మనువగు ...నకు సోదరుడు. అర్జున, బలి, వింధ్యాదులు ఆతని పుత్రులు. 'విభు' నామకుడు ఆ మన్వం...ి మహేంద్రు డయ్యాడు. భూత రయాదులు ప్రధాన దేవగణాలు. హిరణ్య రోమ, వేద ...ర్ధ్వ బాహువు – ఆదిగా గలవారు సప్త మహర్షు లయ్యారు. వారిలో శుభ్రుడు అనే ...పత్ని అయిన వికుంఠయందు వైకుంఠు డనే నామంతో అమర గణ సమేతంగా శ్రీమన్నా...ి భగవానుడు అవతరించాడు. లక్ష్మీదేవి ప్రార్థనానుసారం ఆమె ఆనందార్థం సర్వలోక ...న వైకుంఠ ధామాన్ని సృష్టించాడు. ఆ వైకుంఠ నాథుని కళ్యాణమయ గుణ ప్రభావ, ...త్మ్య వర్ణన తృతీయ స్కంధంలోనే చేశాను కదా! విష్ణు భగవద్గుణాను వర్ణన చెయ్యాలంటే ...తలం మీది రేణు వులను అన్నింటినీ లెక్కించ గలవాడే చెయ్యాలి.

ఆరవ మనువైన చాక్షుషుడు చక్షుష నందనుడు. పురు, పూరుష, ప్రద్యుమ్నాదులు ఆతని ...లు. మంత్రద్యుమ్ను డనేవాడు ఇంద్రుడై భాసిల్లినాడు. వీరక, హవిష్యమంతాదులు ...లుగా ఖ్యాతి గాంచారు. ఈ మన్వంతరంలో వైరాజపత్ని అయిన సంభూతి గర్భాన ...నామంతో ఆవిర్భవించి క్షీర సాగర మథనం సాగించి అమరులకు అమృతాన్ని ప్రసా...ు. కూర్మావతారియై మందరాద్రిని ధరించి దేవతలకు సహకరించాడు.

పరీక్షిత్తు ప్రశ్నిస్తూడు :— 'శుకమునీంద్రా! క్షీర సముద్రాన్ని భగవానుడు ఏ రీతిగా మధించాడు? కూర్మ రూపంలో మందరాద్రిని ధరించ వలసిన అవసరం ఎందుకు వచ్చింది? అమరులకు తత్ సమయంలో అమృతం ఎలా లభించింది? సాగరం నుండి ప్రాదుర్భవించిన వ్య వస్తువు లేవి? అత్యద్భుతాలైన హరి లీలలను దయచేసి చెప్పండి. భక్తజన వత్సలుడైన ష్ణుదేవుని మహిమలు వినేకొద్దీ వినాలన్న కుతూహలం నాలో వర్ధిల్లుతూ ఉన్నది. ఎంత విన్నా కు తృప్తి కలగడంలేదు. సంవత్సరాల నుండీ సంసార తప్తుడైన నాకు మనశ్శాంతి లభించడం ు. శాంతిని ప్రసాదిస్తూ సమస్త సంసార తాపాలనూ దూరం చేసే దైవ లీలా భూయిష్టమైన శ్య గాథలను వినాలని ఎవరి కుండదు?' అనగా శుకమహర్షి చెబుతూన్నాడు :—

'రాజా! దేవ దానవ యుద్ధంలో దేవతలు రణరంగంలో పడిపోయి శక్తులను కోలు యి కదలలేని స్థితిలో పడిపోయారు. దూర్వాస మహర్షి శాపం కారణంగా ఇంద్రుడే కాక లోకాలూ లక్ష్మీ శూన్యాలై నిస్తేజాలైపోయాయి. ఓనాటి మాట. దూర్వాసుడు శ్రీహరిని దర్శించి మరలి వస్తూండగా మార్గంలో ఐరావతారూఢుడై వస్తూన్న మహేంద్రుడు కనిపించాడు. ురాధిపతి యని సత్కరించి మహర్షి హరిప్రసాద రూపమైన పూలమాలను మహేంద్రున గా. ఐశ్వర్య మత్తుడైన మహేంద్రుడు ఆ మాలను ఐరావత గజం మెడలోకి విసిరివేశాడు. మదగ్గజం దానిని తుండంతో లాగి పాదం క్రిందపడవేసి నలిపివేసింది. దానితో, క్రుద్ధుడైన ్వాసుడు — 'మహేంద్రా! నువ్వు శ్రీ హీనుడ వయ్యెదవు గాక!' అంటూ శపించాడు. ఆ ను అలక్షించి ఇంద్ర వరుణాది దేవత లందరూ సమాలోచన సాగించి పునః ఐశ్వర్యాన్ని ి మార్గాన్ని గ్రహించలేకపోయారు. అంత వారందరూ కలిసి — సుమేరు గిరిపై సుఖా ి ఉన్న బ్రహ్మదేవుని సమీపించి — దూర్వాస శాపం, రాక్షసుల చేతిలో తాము ఓడిపోవడం ' గల విషయాలను నివేదించుకున్నారు.

దివ్యదృష్టితో బ్రహ్మదేవుడు సర్వాన్నీ గ్రహించి ఏకాగ్ర చిత్తుడై పరమాత్మ అయిన రి దేవుని స్మరించి వికసిత వదనుడై — 'అమరులారా! నేనూ, శంకరుడూ, మీరూ, , దానవ, మానవ, పశు, వృక్షాది సకల చరాచర జీవరాశి ఏ దేవ దేవుని అత్యల్పాంశవల్ల నబడినామో? ఆ దేవ దేవునే శరణు వేడెదము గాక! ఆ కరుణా సముద్రుని దృష్టిలో

లూ సంరక్షించ దగినవారూ, ఉపేక్షించ దగిన వారూ, ఆదరించ దగినవారూ — అన్న
లేదు. సృష్టిస్థితి లయాదులకు మాత్రం త్రిగుణాలను స్వీకరిస్తూంటాడు. ఈ వేళలో
క్షణార్ధం ఆ దేవ దేవుడు సత్త్వ గుణాన్ని ఆశ్రయించి ఉన్నాడు. కనుక ఆ సర్వేశ్వరుని
దే మనము శరణు వేడెదము గాక! హరి అమర ప్రియుడు కాగా అమరులు హరి
కావడం వల్ల మనలను తప్పక ఆ జగన్నాథుడు సంరక్షించి తీరతాడు.' అన్నాడు.

అనంతరం అమరులందరూ బ్రహ్మదేవుని వెన్నంటి అజితుని తేజోమయ వైకుంఠ
చేశారు. భగవత్స్వరూపమైన వైకుంఠ ధామాన్ని గురించి విన్నవారే కానీ అమరులలో
దర్శించిన వారూ లేరు. అక్కడకు వెళ్ళేసరికి అక్కడ ఏమి కాన రాలేదు. అంత బ్రహ్మ
యత్తచిత్తుడై వేదవాణి ద్వారా ఆ దేవ దేవుని సంస్తుతించ సాగాడు :— 'సత్య అనంత,
రా! ఆదిపురుషా! సర్వ జీవులలో భాసిల్లే నీ రూపం అఖండమైనది. తర్కానికి అవి
పైనది. మనస్సుకంటె నువ్వే అగ్రగామిగా ఉంటావు. నీ దివ్య స్వరూపాన్ని యీ వాక్కు
జాలదు. స్వప్రకాశ స్వరూపుడవైన నువ్వే సర్వ దేవతలకూ ఆరాధ్యుడవే. మే
ం వినయంగా నీకు ప్రణమిల్లుతూన్నాము. బుద్ధ్యహంకార మనో ప్రాణాదుల జ్ఞానం
మాత్రమే ఉంది. విషయ సమేతంగా యింద్రియాదులు నీ వల్లనే తేజరిల్లు తూంటాయి.
నిన్ను ఎంతమాత్రం స్పృశించజాలదు. ప్రకృతి వికారాలైన జనన మరణాది లక్షణా
ద్యా విద్యా తీతా! చతుర్యుగాలలోనూ సాకార రూపంలో నువ్వు దర్శన మిస్తూంటావు.
న్ను మేము శరణు వేడుతూన్నాము. జీవునికి యీ దేహం ఓ మనోమయ చక్రమై
. ఈ చక్రానికి దశేంద్రియాలు, పంచప్రాణాలూ పత్రాలై ఉన్నాయి. నాభి రూపంలో
రజస్తమోగుణాలు ఉంటాయి. పృథివ్యాపస్తేజో వాయు రాకాశ, మనో బుద్ధ్యాహంకారాలు
తత్ చక్రానికి నేమి రూపంలో ఉన్నాయి. ఈ చక్రాన్ని చలింప జేసేది నీ మాయా
. మాయా శక్తి వేగం విద్యుద్వేగాన్ని అధిగమించి ఉంటుంది. పరమాత్మయే యీ
కి యిరుసు రూపంలో ఉంటాడు. సత్య స్వరూపుడవైన పరమాత్మా! నిన్ను మేము
వేడుతూన్నాము. ప్రకృతికి అతీతమైనవాడూ, జ్ఞానైక మాత్ర స్వరూపుడూ, అదృశ్యుడూ,
రూపంలో సర్వ వస్తువుల మూలాలయందుండువాడు, దేశకాల వస్తువులచే పరిచ్ఛిన్నుడు
కూ, అయిన దేవ దేవుడు ఆ సర్వ జీవ హృదయాంతర్వర్తియై అంతర్యామిగా భాసిల్లుతూ

షు. భక్తి యోగం ద్వారా విచారశీలురైన వారు ఆ పరమాత్మనే ఆరాధిస్తూ ఉంటారు. లక్ష్యమైన స్వస్వరూపాన్ని మాయా మోహితులైన వారు విస్మరిస్తూ ఉంటారు. ు సామాన్యులు దాటజాలరు. కానీ సర్వ శక్తి సంపన్నుడైన ఆ దేవ దేవుడు మాయనూ, గుణాలనూ కూడ స్వాధీనంలో ఉంచుకుని సర్వ జీవకోటి హృదయాలలోనూ సమభావంతో ఉంటాడు. నిజ పురుషార్థంతో గాక జీవుడు ఆ హరి కరుణ వల్ల మాత్రానసే ఆయనను ్లుగుతాడు. మేము ఆ దేవదేవుని శ్రీ చరణాలకు ప్రణమిల్లుతూ ఉన్నాము. అమరుల ేము, తపోధనులైన మహర్షులూ కూడా భగవంతునకు అత్యంత ప్రియమైన సత్వ దేహాలతో ప్రభవించి బాహాభ్యంతరాలలో ఏక రస రూపాన వ్యాపించి ఉన్న పరమాత్మ స్వరూపాన్ని గ్రహించజాలకున్నాము. అట్టి దశలో రజ స్తమోగుణ ప్రధానులైన దులు దైవీ స్వరూపాన్ని ఎలా గ్రహించగలరు? అట్టి శ్రీమన్నారాయణ దేవుని చరణార కు వందనం చేస్తున్నాము.

పరమాత్మచే నిర్మితమైన పృథ్వియే ఆతని చరణతలమై భాసిల్లుతూ ఉన్నది. జరాయుజ, , స్వేదజ, ఉద్భిజ నామాలతో చతుర్విధ ప్రాణికోటి నివసిస్తూ ఉన్నది. సర్వ తంత్ర తుడూ, పరమైశ్వర్య సంపన్నుడూ అయిన పురుషోత్తముడు మాకు ప్రసన్నుడగును అనంత శక్తి సంపన్నమైన జలాలు భగవంతుని వీర్యమే. తద్వారా లోకపాల సమే జగత్త్రయం ప్రభవించి ప్రవృద్ధమవుతూ ఉంటుంది. సర్వ శక్తి సంపన్నుడైన ఆ సర్వే ం మాయందు ప్రసన్నుడగును గాక! సర్వ దేవతలకూ అన్న, బల, ఆయుర్దాయ ీ గాక, మనోరూపంలో స్వీకరించిన ప్రభువు మాకు ప్రసన్నుడగును గాక! వైదిక ఖంగా సాగే యాగాలన్నింటినీ శ్రీసంపన్నం చేయడానికే అగ్ని భట్టారకుడు అవతరించాడు. ుయందు జఠరాగ్ని రూపాన, జలాలలో బడబానల రూపాన, ఉంటూ జలాది ధాతువులను తప్తం చేస్తూంటాడు. ద్రవ్య సర్వస్వం అగ్ని నుండియే ప్రాదుర్భవిస్తూన్నది. అట్టి పరమేశ్వరునకు ముఖమై ఉన్నాడు. అట్టి తేజోమయ రూపుడైన భగవానుడు మాకు ్న్నుడగును గాక! సూర్య భగవానుని ద్వారానే దేవయాన మార్గానుసారం జీవులు బ్రహ్మ న్ని పొందాతారు. వేద స్వరూపుడై, భగవంతుని ధ్యానించుట కనువైన పుణ్యలోక స్వరూ మృత్యువూ కూడ సూర్యుడే. అని శృతులు వర్ణిస్తూన్నాయి. అట్టి సూర్యుని నేత్రంగా

గవానుడు మాకు ప్రసన్ను డగును గాక ! భగవంతుని ప్రాణ శక్తి వల్లనే చరాచర
ప్రాణ శక్తితో వర్ధిల్లు తూన్నాయి. సమస్త ప్రాణికోటి సంబంధమైన శారీరిక, మానసిక,
ము సంబంధమైన బలాన్ని ప్రసాదించే వాయువు కూడ ప్రభవిస్తూ ఉంటుంది. ఆ పరమే
చక్రవర్తి అయి సమ్రాట్టు అయి భాసిల్లు తూంటాడు. ఇంద్రియాధిష్ఠాన దేవతలమైన
ఆ పరమాత్మను అనుచరులము. ఎవని శ్రోత్రాల నుండి దిశలూ, హృదయం వల్ల
ము గోళాలూ, నాభి ద్వారా ఆకాశమూ ఉత్పన్న మయ్యాయో ? (ప్రాణాపాన వ్యానోదా
పంచ ప్రాణాలూ, నాగ, కూర్మ కృకల, దేవదత్త, ధనాంజయాలు) దేహానికి ఆశ్రయ
నవాడూ అయిన పరమేశ్వరుడు మాకు ప్రసన్ను డగును గాక ! ఎవని బలం వల్ల
ద్రుడు, ప్రసన్నతచేత అమరులూ, క్రోధాన్నుండి రుద్రుడూ, బుద్ధి ద్వారా బ్రహ్మయు,
ూలనుండి వేదాలూ, ఋషులూ, లింగం నుండి ప్రజాపతులూ ప్రభవించారో ? ఆ దేవ
మాయందు ప్రసన్ను డగును గాక ! వక్షఃస్థలాన్నుండి లక్ష్మియు, ఛాయ ద్వారా పితృ
, స్తనాల నుండి ధర్మమూ, వెన్ను ద్వారా అధర్మమూ, మస్తకం నుండి ఆకాశమూ
ద్వారా అప్సరసలూ ఉత్పన్న మయ్యారో ? అట్టి సమస్తాన్నీ ప్రభవింపజేయునట్టి
ుడు మాకు ప్రసన్ను డగును గాక ! ఎవని వదన గహ్వరం నుండి బ్రాహ్మణులూ
భుజాల నుండి క్షత్రియులూ బలమూ, ఊరువుల నుండి వైశ్యులూ, వ్యాపారమూ,
ుండి శూద్రులూ సేవా వృత్తి ప్రభవించాయో అట్టి పరమాత్మ ఆ మాకు ప్రసన్ను
గాక ! అధర్మం నుండి ప్రీతియూ నాసిక ద్వారా పశుప్రీతి ప్రదమైన కామమూ భూ
ుండి యముడూ, నేత్ర రోమాల నుండీ కాలాన్నీ సృజించిన దేవ దేవుడు మాకు ప్రస
సంరక్షకు —గును గాక ! పంచ మహా భూతాలూ, కాల కర్మలూ, సత్త్వాది గుణాలూ -
నిర్వచనీయమైన యోగ్యమైనదియై ఉన్న ఏ విశేష వస్తువు యోగమాయా నిర్మితమే
తులు ఘోషిస్తూన్నాయో ? ఆ సర్వేశ్వరుడు మమ్ములను అనుగ్రహించును గాక ! మాయా
గుణాలయందూ, దర్శనాది వృత్తుల ద్వారా ఆసక్తిని పొందనివారూ, వాయు సమంగా
అసంగుడూ అయిన శ్రీహరి దేవునియందే శక్తులన్నీ శాంతిస్తాయి. అట్టి స్వాత్మానంద
ద్దైన పరమాత్మకు మేము ప్రణమిల్లు తూన్నాము.

జగన్నాథా ! మేము నిన్నే ఆశ్రయించి శరణు వేడుతూన్నాము. మందస్మిత యుక్తమైన

దర వదనారవిందాన్ని యీ కనులతో చూడాలన్నదే మా అభీష్టము. ప్రసన్నుడవై దర్శన మిచ్చెదవు గాక! శ్రీహరి దేవా! సమయ సమయాలలో నువ్వే స్వేచ్ఛగా అనేక ు ధరిస్తూ ఉంటావు. కఠినాతి కఠిన కార్యాలుగా మేము భావించే వాటిని నువ్వు సునా ాగా చేసివేస్తూంటావు. సర్వ శక్తి సంపన్నుడవైన నీకు దుర్లభ అసాధ్య కార్యమన్నది ా? విషయ వాసనలలో చిక్కుకుపోయి క్లేశానీకంతో, అతి కష్టంతో కర్మలు చేస్తూ లు అల్ప ఫలాలను పొందుతూ ఉంటారు. ఒక్కొక్క వేళ అసలు ఫలితాలనే అందుకో ేతూంటారు. కానీ భగవదర్పణ బుద్ధ్యా అత్యల్ప కర్మ లాచరించేవారు కూడ సత్ఫలితాలనే ంటారు. అవి ఏనాటికీ విఫలం కాజాలవు. జీవ హితైషి, పరమ ప్రియతముడూ, ఆత్మ పుడూ అయిన పరమాత్మ — తరువుకు మూలంలో నీరుపోస్తే — శాఖోప శాఖ లన్నింటికీ ాలు లభించునట్లు — సర్వాత్ముడైన పరమాత్మను ఆరాధిస్తే సర్వులనూ ఆరాధించు నట్టే ంది. త్రికాలాతీతుడూ, ఆనందమే స్వరూపంగా కలవాడూ తర్క వితర్కాలకు అందని రహస్యాలు కలవాడూ గుణాతీతుడై కూడ వాటికి అధిపతిగా ఉండునట్టి వాడూ అయిన మయ భగవంతునకు మేము పదే పదే ప్రణమిల్లుతూన్నాము.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–6

## సురాసురుల సాగర మథనం

శుకమహర్షి :— రాజా! ఆ రీతిగా అమరులు స్తుతించడంతో కోటి సూర్య ప్రభలతో ్గ నట్టి శ్రీమన్నారాయణ భగవానుడు చతుర్భుజ రూపంలో వారికి సాక్షాత్కరించాడు! త్తర ప్రకాశంతో తేజరిల్లునట్టి శ్రీహరిని దర్శించిన దేవతలకు కనులు మిరుమిట్లు గొలి ు. భూమ్యాకాశ, దిశ, విదిశలలో ఏమీ అతనికి కనిపించ లేదు. ఆ దివ్య ప్రకాశంలో

రూపంతో, మరకత మాణిక్య సమమైన శ్యామల వర్ణంతో, కమల దళాయత లోచనా
పీతాంబరధారియై ఆ దేవదేవుడు సర్వాంగ సుందరంగా ఉన్నాడు. పీతాంబరాన్ని ధరించిన
భృకుటి ధనుస్సు వలె మనోహరంగా వుంది. కుండలాల ప్రకాశం కపోల భాగాన్ని తేజ
స్తున్నది. మందస్మిత వదనారవిందం, కటి భాగంతో బంగరు మొలత్రాడు, కరములలో
లూ గళసీమలో హారాలూ, చరణాలలో నూపురాలూ శోభిల్లుతూన్నాయి లక్ష్మీ వక్షః
ముడైన ఆతని గళభాగంలో కౌస్తుభ మణి ప్రకాశిస్తూన్నది. ఆ ప్రక్కనే వనమాల
సాగింది. సర్వాలంకార సుశోభితుడైన శ్రీహరిని శంకర బ్రహ్మలు యిద్దరే అదితో
లిగారు, రూపుదాల్చి సుదర్శన చక్రాదులు ఆ పరమాత్మను సేవిస్తూన్నాయి. క్రమంగా
లందరూ ఆ దేవ దేవునికి సాష్టాంగ ప్రణామాలు చేశారు. అమర పరివేష్టితులైన శంకర
లు శ్రీహరి భగవానుని యిలా స్తుతించ సాగారు. 'సృష్టిస్థితి లయాది రహితుడూ, ప్రాకృత
తుడు, సూక్ష్మాతి సూక్ష్ముడూ మోక్ష స్వరూపుడూ, పరమానంద ఘనుడూ, అనంతుడు,
్వర్యశాలీ అయిన పరమాత్మకు మేము పదే పదే ప్రణమిల్లుతూన్నాము. పురాణ
శుభాలను కోరునట్టివారు శ్రుత్యుక్త, పాంచరాత్ర్యుక్త, మార్గానుసారం భవదీయ
మయ రూపాన్నే వుపాసిస్తూంటారు. సృష్టికర్త నగు నన్ను సయితం సృజించునట్టి
విశ్వ మయమగు స్వ స్వరూపంతో నువ్వు నన్నూ, అమరులనూ. జగత్రయాన్నీ
సందర్శించ గలుగుతూన్నావు. ఆదిలో యీ విశ్వంలో నీలోనే లయమై వున్నది.
ో కూడ నీలోనే వుంది. అంతంలో నీయందే లయమవుతుంది. ఘటానికి మృణ్మయం
మధ్యాంతాలలో అధారమవుతూన్నట్లే యీ విశ్వానికి నీవే కారణుడవుగా వుంటావు.
ఆశ్రయించిన మాయతో నువ్వు యీ విశ్వాన్ని సృష్టించి నువ్వే ఆ జగత్తులో ప్రకా
అంతర్యామి రూపాన తేజరిల్లే నిన్ను శాస్త్రజ్ఞులు సావధానులై గుణ విషయాది సము
ంధుండి కూడ భవదీయ నిర్గుణ రూప సాక్షాత్కారాన్ని పొందుతూంటారు. నరులు యుక్తి
కాష్టం నుండి అగ్నినీ, గోవులనుండి క్షీరాలనూ, పృథివి నుండి అన్న జలాలనూ,
రం ద్వారా జీవికనూ పొందిన చందాన విజ్ఞులు శుద్ధ బుద్ధి ద్వారా భక్తి, జ్ఞానాలను ఆశ్ర
విషయాలయందే నిన్ను పొంది వారి అనుభూతిని అనుసరించి నిన్ను వర్ణిస్తూన్నారు. ప్రభూ!
్ష పీడితయైన గజము గంగానదిలో స్నానం చేసి సుఖ శాంతులను పొందినట్లే - చిర
నుండి నిన్ను పొందగోరునట్టి మేము నీ సాక్షాత్కారం వల్ల శాంతిని పొందగలిగాము. మా

రంతరాలలో నువ్వే వ్యాపించి వున్నావు, సర్వజ్ఞుడవూ, సర్వ సాక్షివీ, అయిన నీకు మేము గలిగే దేమున్నది? అన్నీ నువ్వెరిగినవే. లోకపాలకులమైన మే మందరం నీ చరణాలను యించిన కారణాలనూ నువ్వెరిగినవే. కావున మా అభీష్టాలను నెరవేర్చెదవు గాక! శంకర హ్మేంద్రులమైన మేమూ, అమరులూ, ఋషులూ దక్షాది ప్రజాపతులూ, రి కందరమూ ప్రజ్వలితాగ్నిలోని మిణుగురుల వలె నీ అంశా మాత్రులమే అయి ది భేద భావం కారణంగా నీ కన్న భిన్నులముగా భావించబడుతూన్నాము. ఇట్టి దశలో లకూ సుఖశాంతులు సిద్ధించునట్టి మార్గాన్ని మేము చెప్పగలమా! జగత్కల్యాణ సంధాయక మార్గాన్ని నువ్వే ఆదేశించి కళ్యాణాన్ని ప్రసాదించు దేవా!'

శంకర బ్రహ్మేంద్రాదులు అమర సమేతులై ఆ రీతిని ప్రార్థించగా శ్రీహరి మేఘ ర స్వరంతో పలికాడు — 'శంకర బ్రహ్మేంద్రాదులారా! మీ రంతా సావధానంగా నా పలు నాలకించండి. ప్రస్తుతం — అసురులకు కాలం అనుకూలంగా వుంది, మీ అభ్యుదయానికి సమయం కాదు, మీకు శుభవేళ వచ్చే వరకూ మీరు రాక్షసులతో సంధి చేసుకోండి. త్తర బృహత్తర కార్యాలను సాధించ దలచిన నాడు శక్తిశాలురైన శత్రువులను కూడ కోవాలి. కార్య సాధనానంతరం సర్ప మూషిక న్యాయాన్ని అనుసరించాలి. మీరు ంగా అమృతాన్ని పొందే ప్రయత్నం కొనసాగించండి. అమృతపానం ద్వారా మరణం దు. అమరత్వం సిద్ధిస్తుంది. ఆదిలో తృణ, గుల్మ, లతాదులు, ఆదిగా గల ఓషధులను క్షీర రంలో ఉంచి అనంతరం అసురుల అండదండలతో మందరగిరిని కవ్వంగా చేసుకుని వాసుకిని గా అమర్చుకుని నా అనుగ్రహంతో క్షీరసాగరాన్ని మథించండి. రాక్షసులకు క్లేశ, శ్రమా , ఫలం మీకూ దక్కుతుంది. అసురులు అర్థించిన దల్లా కాదనక ఇచ్చి వేయండి. కార్య వ శాంతం వల్ల అయినట్లు క్రోధం వల్ల కాదు. సాగర గర్భం నుండి ఆదిలో కాలకూట పుడుతుంది. భయపడకండి, ప్రప్రథమంగా మీరు దేనినీ వాంఛించకండి. కోరినది లభించక నా క్రోధ వివాదాలకు తావీయకండి.' అని పలికి పరమాత్మ అంతర్ధానమై పోయాడు.

సర్వ శక్తి సంపన్నుడూ, సర్వ సత్త్వుడూ అయిన ఆ దేవ దేవుని లీలా రహస్యాలను ించగలవా రెవరు? శంకర బ్రహ్మలు కూడ శీఘ్రమే స్వస్థానాలకు వెళ్ళిపోయారు. అంత ంద్రాది బృందారకులు బలిచక్రవర్తిని సమీపించగా — ఆయుధ రహితంగా వచ్చిన అమరు

ంధించ అసుర సేనా నాయకులు ప్రయత్నిస్తూండగా సంధి, విగ్రహాది ధర్మాలన్నీ తెలిసిన ‌వర్తి తన సైన్యాధిపతులను వారించాడు. జగత్రయ విజేత, సర్వైశ్వర్య సంపన్నుడూ, బలి సింహాసనాసీనుడై యుండగా అమరులు అతనిని సమీపించారు. ప్రథమంగా మహేం మధురవాణిలో — బలితో భాషించాడు. శ్రీహరిదేవుని వచనానుసారం చేయడం వల్ల — అరిష్టనేమి, త్రిపుర వాసులతో సహా బలిచక్రవర్తి తన ఆమోదాన్ని తెలియ జేశాడు. సురాసురులు అమృతార్థులై క్షీర సాగర మథన ప్రయత్నం ఆరంభించారు. అనంతరం ర్వ శక్తితో మందరాద్రిని పెల్లగించారు. మందరగిరి సామాన్యమైనదా ? సాగర తీరం నికి సుదూరంగా వుంది. పరిఘుల వంటి బలిష్ఠాలైన బాహువులు కల సురాసురులు ఆ న్ని పూర్తిగా సాగర పర్యంతం మోయజాలక మధ్యే మార్గంలో వదిలేశారు. సువర్ణ గల ఆ మందరాద్రి సురాసురులకు విశేష కష్టాన్ని కలిగించింది. అనేకులు చూర్ణమై రు. అనేకుల నడుములు విరిగిపోయాయి. కొందరివి చేతులూ, మరికొందరి కాళ్ళూ నలిగి యి. వారి దైన్య, హైన్య స్థితికి జాలిపడి శ్రీహరి గరుడా రూఢుడై వారలందరిపై కరుణా ృష్టులను ప్రసరింపజేయడంతో క్లేశ రహితులై వారందరి కందరూ రెట్టించిన వుత్సా విలసిల్లారు. అంత అనంత అపార వర్ణనాతీత శక్తి సంపన్నుడైన భగవానుడు ఆ గిరిని లీలగా ఓ చేత ఎత్తి గరుత్మంతునిపై వుంచి సురాసుర సమేతుడై క్షీరసాగర పురోగమించాడు. తరువాత గరుడుడు శ్రీహరి ఆదేశానుసారం ఆ గిరిని సముద్ర మధ్య ో వుంచి వెళ్ళిపోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–7

## క్షీరసాగర మథన వేళలో పుట్టిన హాలాహలాన్ని మహాదేవుడు పానం చేయుట.

అనంతర గాథను శుకమహర్షి చెబుతూన్నాడు:– 'పరీక్షిన్నరేంద్రా! నీకు కూడ
ఁ భాగం యిస్తామని సురాసురులు వాసుకిని అంగీకరింపజేసి ఆ మహా నాగునే రజ్జువుగా
ందరాద్రిని కవ్వంగా అమర్చి సాగర మథనం ఆరంభించారు. అజితుడైన భగవానుడు
శిరస్సువైపు నడువ అమరులు అతణ్ణి అనుసరించారు. అసురులు ఆది గమనించి అశు
మైన సర్ప పుచ్ఛ భాగాన్ని మేము గ్రహించ మన్నారు. అది గ్రహించి భగవానుడు సర్ప
భాగాన్ని విడనాడి పుచ్ఛ భాగం వైపు పురోగమించగా అమరులు ఆ దేవ దేవునే అనుస
రు. అమృత గ్రహణేచ్ఛతో అసురులు వాసుకి మస్తక భాగాన్ని పట్టగా అందరి కందరూ
ఁ మథనం ఆరంభించారు. రాజా! దేవ దానవులు మందరాద్రిని పట్టి మథిస్తూండగా –
భాగాన ఆధారమేదీ లేకపోవడం వల్ల మహా భారమైనది కావడం వల్ల మందరాద్రి సాగ
ి మునిగిపోసాగింది. తమ బృహత్తర కార్యారంభంలోనే మందరగిరి మునిగిపోతూండడం
ించి ఆ ప్రయత్న శీలు రందరూ తీవ్ర వేదనకు గురి అయ్యారు. తలలు దించేశారు. అది
నించిన పరమాత్మ – యిది విఘ్నరాజు పని అని తెలుసుకొని విఘ్న నివారణ మార్గాన్ని
ించి అత్యంత విశాలమై, అతి విచిత్రమైన కూర్మ రూపాన్ని దాల్చి సాగర గర్భంలో
శించి మందరాద్రిని పైకి ఎత్తాడు. అపార శక్తి సంపన్నుడు, సత్య సంకల్పుడు అయిన
హరికి అది ఓ లెక్కా–యా? మందరగిరి లేచి వుండడం చూసిన సురా సురులు బద్ధ కంకణులై
న మారంభించారు. తత్సమయంలో పరమాత్మ లక్ష యోజన విస్తీర్ణమైన పృష్ఠ భాగంలో
దరగిరిని ధరించి వున్నాడు. మహా బలశాలురైన సురాసురులు ఏకోన్ముఖులై సాగరాన్ని
ంచ సాగారు. అనంతరం కూర్మ రూపంలో ఉన్న అనంతుడైన శ్రీహరి పృష్ఠ భాగం మీ
దరగిరి శీఘ్ర వేగంతో గిర గిర తిరుగుతూ చే దాని రాపిడికి అయ్యాది కచ్ఛపం యొక్క

తి కూడ తగ్గలేదు. సాగర మథనం పూర్తి కావడానికి పరమాత్మ అసురశక్తి రూపాన
ం బలాన్ని వర్ధిల్ల జేస్తూ వారి యందు ప్రవేశించాడు. దైవీ శక్తి రూపంలో అమరుల
• ప్రవేశించి వారి శక్తిని కూడ వర్ధిల జేశాడు. నిద్రా రూపేణా వాసుకిలో ప్రవేశించి
కష్టం కలగకుండ చేశాడు. సహస్ర బాహువులు కల పరమాత్మ ద్వితీయాద్రివలె ముంద
అధిష్ఠించి దానిని అదిమి పట్టుకున్నాడు.

శంకర బ్రహ్మేంద్రాదులు అంబర మార్గం నుండి పూలవాన కురిపిస్తూ స్తోత్రం చేయ
. అనంతరూపుడైన శ్రీహరి ఆ విధంగా సహస్ర బాహువులతో మందరాద్రిని అణచి
రూపంలోనూ, దాని క్రింద ఆధారంగా కూర్మ రూపంలోనూ, సురాసురుల దేహాలలో శక్తి
లోనూ వాసుకియందు దృఢ, నిద్రా రూపంలోనూ ప్రవేశించి వారందరికీ శక్తి అనుగ్ర
క్లేశ రహితులనూ చేశాడు. తత్సమయంలో వారందరూ బలోన్మత్తులై మహోత్సాహంతో
వేగంతోనూ సాగరాన్ని మథించ సాగారు. సాగరమందుండే మకర, కూర్మ, మత్స్య
ద్వేగానికి క్షోభిస్తూన్నాయి. కఠోరాలైన సహస్ర సంఖ్యలలో కల వాసుకి నయన ముఖాల
శ్వాస రూపంలోనూ విషాగ్ని బహిర్గత మవుతూన్నది. తదగ్ని ధూమాదులవల్ల కాలేయ,
బల్వలాది మహాసురులు తేజో విహీను లయిపోయారు. తత్సమయాన వారు దావాగ్ని
ంన సరళ వృక్షం వలె గోచరించ సాగారు. వాసుకి ముఖాల నుండి వెలువడే శ్వాస
గ్ని శిఖల వల్ల అమరులు కూడ తేజో విహీను లయ్యారు. వారందరి కవచ, మాలాంబర,
ఖలూ ధూమ్ర వర్ణ మయా లయ్యాయి. అమరుల అట్టి దైన్య స్థితిని చూసిన భగవత్
మేఘాలు అమరులపై వర్షించ సాగాయి. సాగర తరంగ స్పర్శతో వాయువు శీతల
 యుతంగా అమరులు శ్రమను తగ్గిస్తూన్నాడు. సురా సురు లారీతిగా సాగరాన్ని
• వుంచే కూడ అమృతం లభించకపోవడం వల్ల శ్రీహరియే స్వయంగా సాగర మథనం
ంచాడు. మేఘ శ్యాముడు, పీతాంబరధారీ, మకర కుండల ధారీ, గిరజాలు తిరిగిన జుత్తుతో
రుణ రేఖలు గల నయనారవింద యుగళంతో, వనమాల గళసీమలో నూతన శోభ లీన
తూండగా యావద్విశ్వానికీ అభయమిచ్చునట్టి విశ్వ విజయ సాధకాలైన హస్తములతో
ని పట్టుకుని మథిస్తూన్నాడు. కచ్ఛప రూపాన మందరాద్రికి ఆధారంగా వుండీ ద్వితీయ గిరి
ాసిల్లు తూన్నాడా దేవ దేవుడు. భగవానుడే మథన మారంభించడంతో సాగరంలో అల్ల

ఆరంభ మయింది. మత్స్య కచ్ఛప, మకర, సర్పాది జల జంతువులు భయ భీతాలై చ్చి యిటూ ఆటూ పరుగెత్త సాగాయి. తిమి, తిమింగిలాదులూ, సముద్రపు ఏనుగులూ, ర గ్రాహాలూ వ్యాకులపడి పోతున్నాయి. తత్సమయంలో సర్వ ప్రథమంగా హాలా పుట్టింది. ఆ హాలా హలావిర్భూత విషజ్వాలలు పూర్వాధో భాగ, దిశ, ఉపదిశ భేద ంగా సర్వే సర్వత్రా వ్యాపించ సాగాయి. ఆ భయంకర విష జ్వాలల నుండి క్షించక మార్గాంతరం కానరాక ప్రజలూ ప్రజాపతులూ సత్వలూ సర్వరక్షకుడైన భగ శరణు వేడారు. తత్సమయాన సర్వ ఋషి గణ సేవితుడైన సదాశివుడు సతీసమేతంగా ాద్రిపై విరాజిల్లుతూన్నాడు. జగత్రయ వాసుల అభ్యుదయార్థం, మోక్షం ప్రధాన లక్ష్యంగా తపస్సు చేస్తూ వుంటాడు. ప్రజా పతులు ఆ మహాదేవుని యిలా స్తుతించ సాగారు.

'మహాదేవా! సర్వ ప్రాణులకూ ఆత్మ స్వరూపుడవూ, జీవనదాతవూ నీవే నిన్నే. మేము కోరుతూన్నాము. జగత్రయాన్ని దగ్ధం చేయునట్టి మహోగ్ర విష జ్వాలల నుండి మమ్ము ెదవు గాక! యావద్విశ్వానికీ మోక్షాన్ని ప్రసాదించునట్టి ఏకమాత్ర శరణాగత వత్సలుడవు. ర్తి హరుడవు, విశ్వ గురుడవూ అయిన నిన్ను ధీశాలురు ఆరాధిస్తూ వుంటారు. అఖండా క రస స్వరూపుడవు, అనంతుడవూ అయిన నువ్వు స్వమాయా శక్తితో సృష్టిస్థితి లయార్థం హ్మ విష్ణు మహేశ్వరాది రూపాలు ధరిస్తూ వుంటావు. స్వయం ప్రకాశుడవైన నువ్వే పరమ స్యమగు బ్రహ్మ తత్త్వానివని వేదజ్ఞులు గ్రహించి యున్నారు. నర, సుర, పశుపక్ష్యాది ద్రూపమైన చరాచర విశ్వానికి జీవన దాతవు నువ్వే. సర్వాత్మ స్వరూపుడవైన నీకన్న మైన సృష్టి లేనే లేదు. సర్వేశ్వరుడవు, సర్వ సమర్థుడవు అయిన నువ్వే అనేక శక్తులతో రూపంలో ప్రతీతమవుతూంటావు స్వతఃసిద్ధంగా జ్ఞానస్వరూపుడవూ అయిన నీ ద్వారానే ఉద్భవించాయి. జగదాది కారణమైన మహ త్తత్త్వమూ, సాత్త్విక, రాజస, తామస మయిన అహంకార త్రయమూ కూడ నువ్వే, ప్రాణేంద్రియ, పంచభూత, శబ్దాదుల వాలూ, వాటి మూల కారణాలూ కూడ నువ్వే, ప్రాణులకు వృద్ధి క్షయాలు, కలిగించే స్వరూపుడవు నువ్వే, సర్వ జీవ కళ్యాణ కారకమైన యాగ, సత్య, మధుర వాక్ ధర్మా నీ స్వరూపాలే. అకార, ఉకార, మకార త్రయ యుక్తమైన ప్రణవం లేదా త్రిగుణాత్మక ప్రకృతివి నువ్వే నని వేద వాదులు వర్ణిస్తూన్నారు. సర్వదేవమయుడైన అగ్ని నీ

ము. జగత్త్రయాభ్యుదయ దాతవైన శంకరా! పృథ్వి నీ పాద కమలము. సర్వ దేవ ...పా! కాలమే నీకు గతి. దిశలే నీకు శ్రవణేంద్రియాలు. వరుణుడే నీకు రసనేంద్రియం ఆకాశం నీ నాభి, వాయువు శ్వాస, భాస్కరుడే నీకు నేత్రము. చంద్రుడే నీ మనస్సు. ...మే నీ మస్తకము. వేద స్వరూపా! సాగరమే నీకు ఉదరము. గిరులే నీ అస్థికలు. ఓష... విధాధాలూ నీకు రోమాలు కాగా గాయత్ర్యాది ఛందస్సులే నీకు సప్త ధాతువులు. సమస్త ...లూ, నీ హృదయము. సద్యోజాతాది పంచోపనిషత్తులూ - తత్పురుష, అఘోర, సద్యో... వామదేవ, ఈశానాలే నీ పంచ వదనాలు. వాటి పదచ్ఛేదాల ద్వారా 38 కళాత్మకాలైన ...తాలు ప్రభవిస్తూన్నాయి. నువ్వు యావద్విశ్వం నుండి ఉప రహితుడవై ఉన్నప్పుడు ...లూ నిన్ను 'శివ' నామంతో వ్యవహరిస్తారు. యదార్థానికి స్వయం ప్రకాశమైన పరమార్థం ...పే దంభ సంబంధిత దంభ లోభాది తరంగాలలో నీ ఛాయ వుంటుంది. సృష్టికి కారణ ...లైన సత్త్వ రజ స్తమోగుణాలు నీకు నేత్ర త్రయాలు. గాయత్ర్యాది ఛందో రూపమైన ...యే నీకు యోచనీయాంశము. సాంఖ్యాది సర్వ శాస్త్రాల రూపంలో నువ్వే వుంటావు, వాటికి ...వు కూడ నీవే, జ్యోతిర్మయ స్వరూపా! నీ యందు త్రిగుణ ప్రభావం కానీ, ఎట్టి భేద... కానీ వుండదు, హరి బ్రహ్మేంద్ర, లోకపాలురు కానీ ఎట్టివారూ నీ స్వరూపాన్ని ...గాంచజాలరు. జీవ ద్రోహకరారైన అసురశక్తులను నువ్వు అంతం చేస్తూ వుంటావు. ...య వేళలో భవదీయ ప్రచండ నేత్రాగ్ని, సర్వాన్నీ భస్మం చేసి వేస్తుంది. తత్సమయంలో ...నువ్వు నిర్వికారంగా ధ్యానమగ్నుడవై వుంటావు ఆత్మారాములూ, జీవన్ముక్తులూ అయిన స్వహృదయాలలో నీ దివ్య పాదారావిందాలనే ధ్యానిస్తూ వుంటారు. నిరంతరం జ్ఞాన ...మైన తపస్సులో నువ్వు లయమై వుంటావు. సతీ సమేతుడవైన నిన్ను చూసి కొందరు ...న వాసిగా, ఉగ్రమూర్తిగా, వర్ణిస్తూంటారు మూఢులై లజ్జా రహితులై చరించు నట్టి వారికి ...య అపార శక్తి లీలా రహస్యాలు తెలిసే దెట్లు? ఈ కార్య కారణ రూపమైన విశ్వం ... మాయ అతీతమైనది. అట్టి మాయకన్న అతీతమైనవాడవు నువ్వు. అట్టి భవదీయానంత ...త్స్వరూప జ్ఞానం బ్రహ్మాదులే పొందజాలకుండగా ఎలా ఎంతని ఏమని నిన్ను స్తుతించ ...ము. అట్టి దశలో వారి కుమారులమైన మేము వర్ణించ గలిగే దేమున్నది? అయినా యథా...

నీ గుణ గానం చేశాము. లీలా విహారివైన నీ యీ రూపాన్ని మాత్రమే మేము చూడ . పరమ తత్త్వ మయమైన నీ స్వరూపం మాకు తెలియదు. పరమేశ్వరా! నువ్వు క్తమైన లీలలు కలవాడవే అయినా లోక కళ్యాణ దృష్ట్యా వ్యక్త రూపంలో కూడ వు.' అన్నారు.

ప్రజాపతుల దుఃఖ స్థితిని గమనించి సమస్త ప్రాణి కోటికీ అకారణ బంధువూ, దేవాధి అయిన శివ భగవానుడు దయావశుడై వ్యథ చెంది ప్రియురాలైన సతీ దేవితో - ఎంత విచారకరమైన సంఘటన? సాగర మథనం వల్ల ఏర్పడిన కాలకూట విషం వల్ల జీవరాశీ యీ ప్రజాపతులూ పొందే అసహ్య వేదనలను విన్నావు కదా! ఆర్తులైన రూ తమ ప్రాణాలను రక్షించుమని కోరుతూన్నారు. ఇప్పుడు వీరికి అభయమిచ్చి రక్షిం మన కర్తవ్యము. శక్తి సామర్థ్యాలు కలవాడు దీనులను రక్షించ గలిగితేనే వాని జన్మ వుతుంది. సజ్జనుడైన వాడు క్షణ భంగురమైన తన ప్రాణాన్ని అర్పించి అయినా అన్య లను రక్షిస్తాడు. మాయా మోహితులు మాత్రం పరస్పర విద్వేషంతో యుద్ధాలు చేస్తూ రు. తద్వారా వారికి దుఃఖమే సిద్ధిస్తుంది. కష్టాలలో చిక్కుకున్న వారిపై కరుణ చూపు రిని సర్వాత్ముడైన శ్రీకృష్ణుడు ప్రసన్నుడైననాడు నేనూ చరాచర విశ్వంతో ఆనందితుడ వుంటాను. కనుక విశ్వశాంతికై నే నిప్పుడే కాలకూట విషాన్ని పానం చేస్తాను. తద్వారా కళ్యాణం సిద్ధిస్తుంది.' అని పలికి ఆ దేవ దేవుడు కాలకూట విష పానార్థం సంసిద్ధ య్యడు. భర్త ప్రభావం ఎరిగిన రాజరాజేశ్వరి కూడ తన అంగీకారాన్ని ఆనందంగా జేసింది.

మహాదేవుని శక్తి వల్లనే ప్రాణికోటి జీవిస్తూన్నది. మహాదేవుడు కాలకూటాన్ని ంలో ఉంచి భక్షించి వేశాడు. ఆ విష మందుండే పాప రూప ప్రభావం శంకర నునికి కూడ కనిపించింది. ఆ హాలాహల విష ప్రభావమే శివ దేవుని కంఠ సీమలో నీలి కలిగించింది. జగత్కళ్యాణ కరుడైన ఆ మహాదేవునికి అది కూడ అలంకారమే అయింది ండీ శంకరుడు నీలకంఠు డయ్యాడు. పరోపకార పరాయణులు పరుల దుఃఖాలను చేయ ఆ దుఃఖాదులను తామే అనుభవిస్తారు, భక్తజనప శంకరుడైన శంకరుడు భక్తుల

ష్టాలనూ నెరవేరుస్తూంటాడు. అట్టి ప్రభావ సంపన్నుని ద్వారా హాలా హల విషం పానం
కనదని విన్న వారందరి కండరూ బ్రహ్మ విష్ణువులతో సహా అతణ్ణి ప్రశంసించారు
వుని విష పాన సమయంతో నేల రాలిన విష బిందువులను వృశ్చిక, సర్ప, విష సంబంధ
షధులూ గ్రహించాయి.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–8

## అమృతావిర్భావం - జగన్మోహినీ ప్రాదుర్భావం.

శుక మహర్షి పలుకుతూన్నాడు :— మహాదేవ భగవానుడు ఆ విధంగా హాలా హలాన్ని
చేయడం చూసి సురా సురులు పరమానంద పరవశు లయ్యారు. నవోత్సాహంతో వారు
న్ని మధిస్తూండగా కామధేనువు ప్రాదుర్భవించింది. హోమ సామాగ్రిని ప్రసాదించునది
ం వల్ల మహర్షులు దానిని స్వీకరించారు. తరువాత చంద్ర సమ ప్రభలతో తేజరిల్లునట్టి
శ్రవనామకాశ్వం ఆవిర్భవించగా దానిని చూసి బలి అభీష్టాన్ని వ్యక్తం చేయగా బలి దానిని
ంచాడు. తరువాత కైలాస శోభను మించిన శోభ గల చతుర్దంతాలు కల ఐరావత గజ
ం నుండి బయట పడింది. అనంతరం కౌస్తుభ మణి ఆవిర్భవించగా దానిని శ్రీమన్నారాయణ
నుడే గళసీమలో అలంకరించు కున్నాడు. అదే సమయంతో కల్పవృక్షమూ, అమరులకు
తం పరమానందాన్ని ప్రసాదించగల అప్సరోభామలు ఆవిర్భవించారు. తరువాత సర్వ
క సుందరి, శ్రీమన్నారాయణ భగవానుని నిత్య శక్తి, అయిన మహాలక్ష్మీదేవి కూడ
ర్భవించింది. తటిల్లతలా భాసించే ఆమె సౌందర్య శోభలు దశ దిశలా వ్యాపించాయి.
రూప లావణ్య మహిమాదులకు సర్వులూ ఆకర్షింప బడ్డారు. అందరి కందరూ లక్ష్మి తమకే
వాలనుకున్నారు. స్వహస్తాలా మహేంద్రుడు ఆమెకు ఆసన మిచ్చాడు. నదీ శ్రేష్ఠాలు
ర్తి మంత్రాలై సువర్ణ కుంభాలతో పావన జలాలను తెచ్చాయి. పృథ్వీ దేవి మహాలక్ష్మి

అభిషేకించాలని సర్వౌషధులనూ తెచ్చింది. గోవులు ఆమెకై పంచాగవ్యాలనూ, వసంత ఋతువులో లభించే ఫల పుష్పాదులనూ సమర్పించగా ఋషిగణం విధి విధానంగా లక్ష్మీదేవిని అభిషేకించారు. మంగళ గీతాలను గంధర్వులు గానం చేయగా, అప్సరసలు నాట్యం సాగారు. మేఘాలు రూపు దాల్చి మృదంగ, పణవ, మురజ, ఆనక, గోముఖ, వీణ, వేణువులు మ్రోగించారు. కర కమలంలో పద్మాన్ని ధరించిన లక్ష్మీదేవి తత్సమయంలో సింహాసనం అధిష్ఠించింది. జల పూర్ణ కలశాలతో దిగ్గజాలు ఆమెను అభిషేకించాయి. భూసురోత్తములు మంత్రాలను పఠించగా సాగరుడు పీతాంబరాన్నీ, వరుణుడువైజయంతీ మాలనూ సమర్పించాడు. వైజయంతీ మాలా సుగంధాన్ని ఆఘ్రాణించి భ్రమరాలు ఝుం ఝుం నాదాలు చెయ్యసాగాయి. విశ్వకర్మ అనేక విధాలైన భూషణాలు సమర్పించాడు. నారులు కుండలాలనూ, బ్రహ్మ హంసన్నీ, సరస్వతి ముత్యాల హారాన్నీ సమర్పించారు. భూసురోత్తములు స్వస్తి వచనాలు పలుకగా లక్ష్మీదేవి కరములందు కమలాలను ధరించి సర్వ గుణోపేతుడైన వరుని కోసం అన్వేషణ ప్రారంభించింది. తత్సమయంలో ఆ శ్రీదేవి వదన కమండల శోభ వర్ణనాతీతంగా వుంది. కపోలాలలో కుండల ప్రకాశం భాసిల్ల సాగింది లజ్జతో అవనతముఖియై ఆమె మెల్ల మెల్లగా మంద మందస్మితం చేయసాగింది. చందన చర్చితమై కుంకుమాంకితమైన పీన స్తన ద్వయంతో అటు నిటు తిరుగుతూ వుంటే చరణ నూపుర ధ్వనుల నుండి ఝుంకారం బయలుదేర తత్సమయంలో దర్శకులకు స్వర్ణలత యిటు నటు పరిభ్రమిస్తున్నదా? అన్నట్లుంది. సర్వోత్తమ గుణ సంపన్నుడూ, దోష, నాశ రహితుడూ అయిన పురుషుడు లభిస్తే – తన కాతడే ఆశ్రయుడుగా భావించి వరించాలని ఆమె చూడసాగింది. గంధర్వ, యక్ష, రాక్షస, సిద్ధ, చారణ, దేవతాదులలో అట్టివాడు ఆమెకు కానరాలేదు. ఒకడు తపోధనుడై కూడ క్రోధాన్ని విడనాడలేదు, మరొకడు జ్ఞాన మున్నది కానీ ఆసక్తిని విడనాడజాలకున్నాడు. అన్యులు కొందరు మహత్వశాలురై కామాన్ని జయించజాలకున్నారు ఐశ్వర్య సంపన్నులైనవారు కొందరు పరులను యాచించ మానడం లేదు, కొందరిలో ధర్మాచరణ వున్నా సర్వ ప్రాణుల యందూ ప్రేమ భావాన్ని కలిగి వుండలేకున్నారు. కొందరిలో త్యాగమున్నది కానీ అది మోక్ష సాధనం కాదని వారు గుర్తించలేకున్నారు. ఒక్కొక్కచో మహా వీరత్వం వున్న వారు పయితం కాలాన్ని జయించజాలక, బంధం నుండి తప్పించుకోలేక పోతూ వున్నారు. విషయాసక్తి రహితులైనవారు అద్వైత సమాధిలో వుంటూన్నారు. దీర్ఘాయుర్దాయం పొందిన ఋషులున్నారు. అయినా వారిలో నాకు కావలసిన

గళ ఆయుర్దాయాది లక్షణాలు లేవు. ఈ లక్షణ ద్వయం కలవారు అమంగళ వేష సంచరిస్తూన్నారు. అని యోచించి చిట్ట చివరకు శ్రీమన్నారాయణుని తిలకించి సర్వ క్షితుడు యీతడే సర్వ మంగళ సద్గుణాలు యీతనియందే నిత్య నివాసం చేస్తూన్నాయి. తడు నన్ను అభిలషించడంలేదు.' అనుకుంటూ తరువాత ఆ శ్రీదేవి ఓ నిశ్చయానికి హరిని వరించి ఆతని దివ్య గళ సీమలో స్వయంవర మాల వేసింది. ఆ దేవ దేవుని గుణాలు స్పృశించ జాలవు. ఆతణ్ణి ఆశ్రయించి సేవిస్తూ వుండే అణిమాద్యష్ట సిద్ధుల ఆతనికి శక్తి లేదు. యదార్థానికి శ్రీదేవికి ఏకమాత్రాశ్రయుడు శ్రీమన్నారాయణుడే వల్ల ఆమె ఆతనినే వరించింది. మత్త మధుకర పరివేష్టితమైన కమల మాలను శ్రీహరి ములో అలంకరించి సిగ్గుతో వంచుకొని ఆతని వక్షఃస్థలం వైపు చూస్తూ ఆతని సమీపం బడింది. విశ్వా లన్నింటికీ ప్రభువైన శ్రీహరి సర్వ సంప దధిష్ఠాతృ దేవత. జగ యిన లక్ష్మీ దేవికి నిజ వక్షఃస్థలాన్నే సర్వదా నివసించడానికి ఆశ్రయంగా ప్రసా ఆతని వక్షఃస్థలాన్ని అలంకరించిన లక్ష్మీదేవి తన కరుణారస దృక్ప్రసారంతో జగ నూ, లోకపాలురనూ, ప్రేమ పాత్రులైన భక్తులనూ అనుగ్రహించి అభివృద్ధిని చింది. తత్సమయంలో శంఖ, తూర్య మృదంగాది మంగళ ధ్వనులు మిన్ను ముట్టాయి. లు గానాలు చేయగా అప్సరసలు ఆనందాతిరేకంతో నాట్యం చేశారు. బ్రహ్మ, రుద్ర, ప్రజా పత్యాదులు పూలవాన కురిపించారు. భగవద్గుణ రూప లీలాదులను యథార్థంగా పట్టి మంత్రాలతో స్తోత్రాలు చేశారు. ప్రజలూ, ప్రజాపతులూ, అమరులూ లక్ష్మీ కటాక్ష మాత్రంచే సద్గుణ శీల సంపన్నులై సుఖించారు. సురులను ఉపేక్షించి లక్ష్మీదేవి చరించిన ండీ వారు శక్తి హీనులై, నిరుద్యోగులై, లజ్జా రహితులై, లోభులై పోయారు.

తరువాత ఆవిర్భవించినది పద్మ దళాయతాక్షి అయిన వారుణీ కన్య. శ్రీహరి సమ్మ ఆమెను దానవులు స్వీకరించారు. సురాసురులు ఆ రీతిగా క్షీర సాగరాన్ని మథిస్తూం నిలో నుండి దీర్ఘాలై బలిసిన బాహువులతో, సంఖ సమ గళంతో, అరుణారుణ తో, ఇంద్ర నీల మాణిక్యంతో సమమైన దేహచ్ఛాయతో అంగ ప్రత్యంగాలలో ఖచితాలైన వివిధాభరణాలూ కర్ణకుండల, పీతాంబరాలూ ధరించి విశాల వక్షఃస్థలంతో జ సమ పరాక్రమంతో, నవయౌవ్వనంతో కుటిల కుంతలాలతో భాసిల్లే ఆదివ్య పురు

అపూర్వ సౌందర్య లావణ్యాదులతో భాసిల్లుతున్నాడు. కర కంకణాలు ధరించిన అతని లో అమృత కలశం వుంది. శ్రీహరి అంశావతారమూర్తి, ఆయుర్వేద ప్రవర్తకుడూ, ోక్త — అయిన అతడే ధన్వంతరి నామ ప్రఖ్యాతుడయ్యాడు. అమృత కలశ హస్తుడై రి చేతినుండి బలాత్కారంగా రాక్షసులు అమృత కలశాన్ని లాక్కున్నారు. సాగర బహి సంపదలన్నీ తమకే చెందుతాయన్న విశ్వాసంతో ఆదినుండీ అసురులు పరిశ్ర రు. వారు అమృత కలశాన్ని కైవసం చేసుకోవడంతో అమరులు విషాదగ్రస్తులైపో . వారి దీన దశను తిలకించి భక్తజనాశ్రయుడగు పరమాత్మ వారికి అభయమిచ్చి — లారా! విచారించక ధైర్యంగా వుండండి. స్వమాయా శక్తితో రాక్షసుల మధ్య అంతః ు సృష్టించి మీ కార్యాన్ని నెరవేరుస్తాను.' అన్నాడు.

పరీక్షిన్నరపాలా! అమృతపానాసక్త చిత్తులై ఆతురపడుతూన్న అసురులు పరస్పరం మోహితులై కలహించ సాగారు. 'అమృతాన్ని ముందు నేను త్రాగాలంటే — ముందు త్రాగాలంటూ ఆ బల మద గర్వితులైన రాక్షసులు కొట్టుకో సాగారు. దుర్బలతర హస్తాల బలవంతులు అమృత కలశాన్ని లాగుకో సాగారు. ఈర్ష్యా ద్వేష వశులైన కొందరు లవలె 'అమరులు కూడ మనతో సమంగా కష్ట పడ్డారు. కనుక వారికి కూడ అమృత భాగం లి. ఇది సనాతన ధర్మం.' అన్నారు.

తత్సమయంలో సర్వజ్ఞుడు, చతుర శ్రేష్ఠుడూ అయిన పరమాత్మ వర్ణనాతీత జగన్మోహన రూపాన్ని దాల్చాడు. ఆ జగన్మోహినీ రూపం నీల కమలంలా శ్యామలంగా వుంది. ప్రత్యంగాలు ఆకర్షణీయంగా శోభిల్లిపోతున్నాయి. సుందరంగా కపోలాలూ, ఉన్నతమైన , రమణీయమైన వదనారవిందమూ, విశేషించి నవ యౌవ్వనంతో శోభిల్లడం వల్ల పీన భార పీడితయై, సింహ సమ కటి భాగంతో ముఖ బహిర్గత సుగంధాఘ్రాణేచ్ఛతో భ్రమర యం గుంపులుగా ఆమెను పరివేష్టిస్తున్నాయి. వాటికి భీతిల్లుతున్నట్లు ఆమె నయనాలు ంగా మీనాలవలె భాసిల్లుతున్నాయి. ఆమె కాలి అందెల రవళి శ్రవణానందకరంగా వుంది. ంబరాచ్ఛాదితమైన పీన నితంబం పై భాగాన సువర్ణ నిర్మితమైన గజ్జెల వడ్డాణం నవ్య తో ప్రకాశిస్తున్నది. లజ్జాయుక్త మందస్మితాన్ని నటించే భృకుటీ విలాసంతో, అపాంగావ

లతో హావ భావ విలాసాలతో సర్వ జనాకర్షణీయమైన మోహినీ రూపంలో శ్రీహరి దైత్య వీర సేనాపతుల హృదయాలను సంచరించజేస్తూ కామోద్దీపనాన్ని కలిగించాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-10

### జగన్మోహిని అమరులకు అమృతాన్ని ప్రసాదించుట.

శుకమహర్షి పలుకుతున్నాడు — రాజా! రాక్షసులు స్నేహ సోదర ప్రేమ బంధు బాంధవ్య సయితం విస్మరించి పరస్పరం నిందించుకుంటూ దొంగలవలె ఒకరి చేతినుండి వేరొకరు అమృత కలశాన్ని లాగుకుంటున్నారు. తత్సమయంలో త్రైలోక్య సుందరి యగు ఓక లావణ్య లహరి తమవైపు రావడం చూశారు. వారు సర్వాన్నీ విస్మరించి పరస్పరం చుకో సాగారు — 'ఆహా! ఏమి సౌందర్యం? ఈ సుందరాంగి సర్వాంగ బహిర్గతం విద్యుల్లతలను తలపిస్తున్నది. ఒక్కసారి యీమెను దర్శిస్తేనే జన్మ సఫల మయేలా' అంటూ వారందరూ ఆమె వైపు పరుగెత్తి కామ మోహితులై — విశాలాక్షీ! ఎవ్వరి? ఏమి చెయ్యాలని యిక్కడకు విచ్చేసినావు? నీ దర్శన మాత్రంచే మా మనసులు పడి పోతూన్నాయి. ఎవరి పుత్రివి? సురాసుర సిద్ధ గంధర్వ చారణాదులలో లేదా లోకంలో ఎవరూ నిన్నింత వరకూ స్పృశించలేదని మేము భావిస్తున్నాము. అట్టి దశలో మర్త్య మానవులు నిన్నెలా స్పృశించ గలరు? సుందరీ! దయా సాగరుడైన విధాత దేహధారి ఇంద్రియాలకూ, మనస్సులకు తృప్తిని కలుగ జెయ్యాలని నిన్నిలా పంపాడు. మానీ! ఏకజాతివారమైన మే మందరమూ ఏకైక వస్తువును కోరుతూన్నాము. అందుకే కలహాలు బయలుదేరాయి. సుందరీ! నువ్వు మా కలహాన్ని రూపుమాపెదవు గాక! ప సంతనులం కావడం వల్ల మేము సోదరుల మైనాము. అందరం కలిసి తీవ్రతర పరిశ్రమతో అమృతాన్ని సంపాదించుకున్నాము. పక్షపాత రహితంగా నువ్వు మాలో కలహం రాకుండ అమృతాన్ని సమంగా పంచిపెట్టు.' అన్నారు.

ఆ పలుకులు విని జగన్మోహినీ రూపుడైన శ్రీహరి మందస్మితం చేస్తూ చపల దృష్టి వారిని చూస్తూ — 'అసురులారా! మీరు చూడ కశ్యప నందనులు. నేను చూడ కులటను. న్యాయభారం నాపై ఎందుల కుంచినారు? స్వేచ్ఛా చారిణులైన స్త్రీలను వివేక సంపన్నులు ఊ విశ్వసించరు. రాక్షసులారా! వేట కుక్కలమీదా, వ్యభిచారిణులమీదా ఎన్నటూ కం పెట్టుకోరాదు. వేట కుక్కలు కొత్తదైన దానిని వేటాడుతూనే వుంటాయి. వ్యభిచారి కూడ కొత్త విటులను అన్వేషిస్తూ వుంటారు.' అంది.

జగన్మోహిని పరిహాస వాక్యాలు రాక్షసులకు విశ్వాసాన్ని కలిగించాయి. వారు రహస్య భావంతో చిరునవ్వుతో అమృత కలశాన్ని మోహిని చేతులలో పెట్టారు. అమృత కల అందుకొని ఆమె మందస్మితం చేస్తూ — దైత్య దానవులారా! ఉచితానుచిత భావ రహి నేను చేసినట్లు మీరు వూరుకోవాలి. స్వేచ్ఛగా నేను పంచి పెడుతాను.' అంది.బలమదగర్వి లైన ఆ దైత్యులు జగన్మోహిని యొక్క మధుర వచనాలు ఆలకించి — ఆమె మాయా ని అని గ్రహించజాలక ఏకగ్రీవంగా తమ సమ్మతిని తెలియజేశారు.

తరువాత వారందరూ ఓ రోజు వుపవసించి స్నానాది నిత్య కర్మ లాచరించి హవిస్సు అగ్నిహోత్రుని తృప్తి పరచి గో, బ్రాహ్మణాది ప్రాణు లన్నింటికీ అన్నదానంచేసి రోత్తముల ద్వారా స్వస్త్యయనం చేయించారు. అభిమతానుకూలంగా వారందరూ వస్త్రా లను ధరించి తూర్పు దిశగా తిరిగి కూర్చున్నారు. ధూప, దీప, సుగంధ మాలాదులతో కృతులై దైత్య దానవులున్న దివ్య భవన ప్రదేశానికి అమృత కలశంతో ప్రవేశించినది జగ గాని, దివ్యాంబర ధారియైన ఆమె నితంబ భారంతో మంద మందంగా అడుగులు వేస్తూ విహ్వలాలైన నేత్రాలతో, కనక కలశ ద్వయ సమమైన స్తన ద్వయంతో కరి తుండ ంన జఘనాలతో, హేమ నిర్మిత నూపుర ఝుంకారాలతో సభా మందిరాన్ని సంచలింప చేయ సి. కర్ణాలకు ఆలంకరింపబడిన కుండలాలూ, కపోల భాగ, నాసికలూ, ముఖారవిందమూ త సుందరంగా ఉన్నాయి. సౌందర్య నిలయుడైన పరమాత్మయే జగన్మోహినీ రూపంలో పడం వల్ల ఆమె మహాలక్ష్మీ దేవి సఖియా అన్నట్లుంది. మందస్మిత వదనారవిందయై, గావలోకనాలతో జగన్మోహిని దృక్ప్రసారం చేసినంత మాత్రాన సురాసురులందరూ మోహి పోతున్నారు. తత్సమయంలో ఆమె పైట చెరగు జారి పోయింది. జన్మతః క్రౌర్యమే

ంగా గల అసురులకు అమృతం పోయడ మంటే పాముకు పాలు పోయడం వంటిదేనని
ంచి భగవానుడు సురాసురులను వేరు వేరు పంక్తులలో కూర్చోమన్నాడు. తరువాత
త కలశ హస్తుడై దైత్యులను సమీపించి హావభావ, విలాస విన్యాసాదుల ద్వారా వారిని
పరవశులను చేసి దూరంగా కూర్చుని వున్న అమరులకు — జరామరణాలను నాశనం
ట్టే అమృతాన్ని ప్రసాదించ సాగింది. ఆ విషయాన్ని పసికట్టి కూడ — రాక్షసులు ఆదిలో
చేసిన ప్రతిజ్ఞలను స్మరించుకుని — ఆమెతో కలహించడం గౌరవభంగ మనుకుంటూ
దాల్చారు. ఆ జగన్మోహినిపై వారికి విశేష ప్రేమ భావం వుండడం వల్ల — ఏమి
ినా ప్రేమ బంధం ఖండింప బడిపోతుందేమో నన్న భీతితో మౌనం దాల్చారు. అమరులు
కపానం చేసే వేళలో రాహువు దేవతా స్వరూపాన్ని ధరించి వారి మధ్య కూర్చుని అమృత
చేస్తూ వుండడం గమనించిన సూర్య చంద్రులు — సంకేత మాత్రంగా — జగన్మోహినీ
ప భాసిల్లుతూన్న శ్రీహరికి నివేదించారు. వెంటనే శ్రీహరి సుదర్శన చక్రాన్ని ప్రయో
ంతో రాహువు శిరస్సు మొండెం నుండి వేరై పోయింది అమృత స్పర్శవల్ల అది
త్వం పొందింది. అమృత స్పర్శలేని దేహం — పతనమైపోయింది. రాహువుకు బ్రహ్మ
గ్రహాలలో స్థానం కల్పించాడు. అమావాశ్య, పూర్ణిమా పర్వ దినాలలో ఆ రాహువే
వంతో సూర్య చంద్రులపై దండెత్తుతూ వుంటాడు. సంపూర్ణంగా అమృతాన్ని దేవతలు
చేయడంతో శ్రీహరి భగవానుడు మోహినీ రూపాన్ని త్యజించి — యదార్ధ రూపంలో
ం డమ్యాడు.

సురాసురులు ఏక కాలంలో ఏక స్థానంలో ఏకమాత్ర ప్రధాన ప్రయోజనంతో అత్యధి
పరిశ్రమించి క్షీర సాగరాన్ని మధించినారు. కానీ ఫలభేదం ఏర్పడింది. భగవంతుని ఆశ్ర
దేవతలు అమృతాన్ని పానం చెయ్యగలిగారు. మానవ మాత్రులు — తమ ప్రాణ మన
్మ వాక్శరీరాదులను స్వస్వంతానార్థం వినియోగిస్తారు. కానీ అవన్నీ భేద బుద్ధికి మూల
ులు కావడం వల్ల వ్యర్థాలే అవుతూన్నాయి. కానీ ప్రాణ శక్త్యాదుల ద్వారా త్రికరణ
ఏ స్వల్ప కార్యం చేయబడినా — అది భేదభావ రహితం కావడం వల్ల సఫలమే అవు
తరు మూలంలో నీళ్ళు పోస్తే — శాఖోపశాఖాలకూ పత్రాలకూ కూడ తృప్తి కలుగునట్లు
ర్పణ బుద్ధ్యా చేయబడే కర్మలు సర్వ లోకాలకూ చెందుతాయి.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–11

శుకమహర్షి భాగవత గాథను కొనసాగిస్తూ వున్నాడు. 'పరీక్షిన్నరేంద్రా! రాక్షసులతో సమంగానే కష్టించి సాగర మథనం చేసినా–తమోగుణ ప్రధానులూ, దురహంకారులూ, శూన్యులూ అయిన వారికి మాత్రం అమృతం లభించ లేదు. పరమాత్మ సాగర మథనగా లభించిన అమృతాన్ని సత్త్వగుణ సంపన్నులై అర్హులైన అమరులకే అందించాడు. త వారందరూ తిలకిస్తూండగానే గరుడా రూఢుడై స్వస్థానానికి వెళ్ళిపోయాడు.

తమ ఆగర్భ శత్రువు అయిన దేవతలకు అమృతం లభించడమూ, తమకు శ్రమమే మిగలడమూ చూసిన రాక్షసులు పెల్లుబికిన క్రోధంతో ఆయుధ పాణులై యుద్ధ సన్నద్ధులైరు. అమృత పానంతో నవ్య దివ్య శక్తి సముపేతులు అయిన దేవతలు విశేషించి విష్ణు విశేషానుగ్రహపాత్రులు కావడం వల్ల నిర్భయంగా శస్త్ర పాణులై యుద్ధ సన్నద్ధులైరు. క్షీరసాగర తీరంలో సురాసుర యుద్ధం ఆరంభమై కొనసాగుతూన్నది. కరవాల, తోమర, భిండివాలాది ఆయుధాలు పరస్పరం ప్రయోగించు కుంటూన్నారు. శంఖ, తూర్య, ంగ, డమరుకు, భేరీ ఆదిగాగల వాద్య విశేషాలు దిక్కులన్నీ పిక్కటిల్లేలా మ్రోగుతూన్నాయి. ంకారాలూ, హయ హేషలూ, రథనేమి ధ్వనులూ పదాతుల కేకలతో ఆ ప్రదేశం మహాహలంగా వుంది. రథికులతో రథికులూ, ఏనుగులతో ఏనుగులూ, పదాతులతో పదాతులూ, దళంతో గుఱ్ఱపు దళమూ, యుద్ధం చేస్తూన్నాయి. ఒంటెలపై కొందరూ, కంచర గాడిమరికొందరూ, గార మృగాల నధిరోహించి కొందరూ యుద్ధం చేస్తూన్నారు. సింహాపు భల్లూకాదులనూ, కంక, గృధ్ర బకాదులనూ నక్కలూ, తోడేళ్ళూ, శరభ, మహిష, ాస, భాస, శశాది వాహనాదులనూ కూడ ఎక్కి యుద్ధం చేసే వారే కాక తిమింగల, నీలపుగల గోవుల మీద, అడవి ఎద్దులూ, మూషిక, హరిణ సూకరాదులూ, ఊసరవిల్లి, బక, ది జలచర. స్థల చర భేద రహితంగా వాహనాలు అధిరోహించి వికృత రూపులయిన యుద్ధం చేస్తూన్నారు. బలోన్మత్తులైన దైత్యులు రణ మధ్యంలో ప్రవేశించి యుద్ధం

కొన్నారు, చిత్ర విచిత్ర వర్ణాలు గల పతాకాలు, స్ఫటికమణినిభ శ్వేత ఛత్రాలూ, ఆదిగా గల జటిత దండ మండిత చామరాలూ, నెమలి కన్నుల వినవకర్రలూ, చమరీ మృగవాల పురలూ, అక్కడ సర్వే సర్వత్రా ప్రకాశిస్తున్నాయి. వాయు ప్రేరితాలైన ఉత్తరీయ లు, భాసిల్లే కవచ భూషణాలూ, భాను ప్రభలను తిరస్కరించునట్టి శస్త్రాస్త్రాలూ దైత్య దానవులు బారులుతీర్చి యుద్ధం సాగిస్తూ వుంటే — జల జంతు పూర్ణాలైన లు రెండు ప్రవహిస్తున్నాయా? అన్నట్లు కానవస్తున్నది.

రాజా! ఆ రణభూమిలో దైత్య సేనాపతి అయిన బలి మయ దానవ నిర్మిత వైహాయస విమానాన్ని కామ గమనం కలదానిని అధిరోహించాడు. యుద్ధ సామగ్రి సర్వస్వ సంభరి వైరి వీరులకు అభేద్యంగా వున్న ఆ విమానం ఓ సారి కానవస్తూ, మరో మారు కాన లేదు. అది ఎక్కడ వున్నదీ కనిపెట్టడం చాల కష్టంగా ఉంది. బలి ఆ విమానాన్ని హించి ఒకదికలా దానవ సేనాపతులు పరివేష్టించి వింజామరలు వీయగా, దివ్య ఛత్రం తూండగా ఉదయాద్రిపై ఉదయించి తేజరిల్లే చంద్రునిలా అతడు భాసిల్ల సాగాడు. ఉప కలయిన నముచి, శంబర, బాణ, అయోముఖ, ద్విమూర్ధ కాలనాభ, హేతి, ప్రహేతి, , శకుని, భూత సంతాప వజ్రదంష్ట్ర, విరోచన, హయగ్రీవ, శంకు శిర, కపిల, మేఘ , తారక, చక్రాక్ష, శుంభ, నిశుంభ, జంభ, ఉత్కల, అరిష్ట, అరిష్టనేమి, త్రిపురాధిపతి పౌలోమ, కాలకేయ, నివాత కవచాదులు వారి వారి విమానాలపై ఆసీనులై బలిని పరివే వున్నారు. సాగర మథనంలో వారందరూ పాల్గొన్నవారే అయినా క్లేశాన్నే పొందారు. లమైన అమృతం వారికి లభించలేదు. వీరందరూ ఎన్నోసార్లు యుద్ధాలుచేసి దేవతలను గారు. అందుకే మహోత్సాహంతో, వారందరూ శంఖాలు పూరించి సింహ నాదాలు చేస్తూ వీదికి వురుకుతూంటే మదోన్మత్తులైన శత్రువులగు ఆ రాక్షసులను తిలకించి మహేం క్రుద్ధుడై ఐరావతా రూఢుడై యుద్ధ సన్నద్ధుడయ్యాడు. తత్సమయంలో వాయు రగ్ని లోకపాలు రందరూ, తమ తమ గణాలతో వాహనాలను అధిరోహించి ఇంద్రునకు వైపులా పరివేష్టించి పురోగమించ సాగారు. ఇరు సేనలూ యుద్ధ సన్నాద్ధాలై పరస్పరాభి నిలచాయి. తమకు జోడీగా నిలువ గలిగిన యోధులను నిర్ణయించుకుని ద్వంద్వ యుద్ధం చారు. మర్మాలను భేదించే పదజాలంతో పరస్పరం దూషించుకుంటూ ఉద్రేకాన్ని కలి ంటూ ఒకరి నొకరు ధిక్కరించు కుంటూన్నారు. మహేంద్రుడు బలితోనూ, కుమార

తారకాసురునితోనూ, వరుణ దేవుడు హేతితోనూ, మిత్రుడు ప్రహేతితోనూ యుద్ధం సాగారు. యముడు కాలనాభునితో, విశ్వకర్మ మయాసురునితో, త్వష్ట ప్రజాపతి శంబరా గో, సవిత విరోచనునితో, తలపడ్డారు. నముచితో అపరాజితులకును, అశ్వినేయులతో ర్వనికీ, భాస్కర భగవానునకు బలి బాణాది కుమార శతకం మధ్యా ఘోర యుద్ధం ఆరంభ ది. రాహు చంద్రులూ, పులోమ వాయువులూ, భద్రకాళీ శుంభ నిశుంభులూ ద్వంద్వ యుద్ధం గించారు. రుద్ర జంభాసురులకు, అగ్ని మహిష దానవులకూ, మరీచ్యాదులతో ఇల్వల లకూ సమరం సాగింది. దుర్మర్ష కామధేనువులకు, ఉత్కలాసుర మాతృ గణాలకూ, బృహస్పతులకూ, నరకాసుర శనైశ్చరులకూ, కాలకేయ వసు గణాలకూ, నివాత కవచ శాలకూ పౌలోమ విశ్వ గణాలకూ, క్రోధ వశ రుద్ర గణాలకూ మధ్య సంకుల సమరం మయింది.

ఉపర్యుక్త రీతిని దేవ దానవులు రణరంగంలో ద్వంద్వ యుద్ధం చేస్తూ జయాభిలాషతో గా కూడ, శర, కరవాల, తోమరాలను ప్రయోగించు కుంటూన్నారు. భుశుండి. చక్ర, ముష్టి, పట్టిశ, శక్తి, ఉల్మక, ప్రాస పరిఘ, ముద్గర, భిండివాల ఆదిగా గల ఆయుధా ధముల సంగ్రామం కొనసాగుతూ వుండగా ఖండింపబడ్డ రథాలూ, గజాశ్వ, పదాతులూ – ప్రత్యంగాలు తెగిపోయి వికృత ధ్వనులతో రణరంగంలో పతనమవుతూ వుంటే రుధిర సెలఏళ్ళై ప్రవహించ సాగాయి. తెగిన ధ్వజాలతో, విరిగిన ధనుస్సులతో, కవచ భూష ం విచ్ఛిన్నాలై పడియుండ అక్కడి ప్రదేశమంతా భయావహంగా వుంది. చతురంగ ా మహా వేగంగా పరుగులు తీయడంవల్ల అక్కడి వాతావరణమంతా ధూళి ధూసరితమై తద్ధూళి కారణంగా భూమ్యాకాశాలు కానరావడంలేదు. రణస్థలమంతా ఖండిత శరీరంగాలతో తమై పోసాగింది. అంత ధూళీ రక్తసిక్తం కావడం వల్ల కానరావడం లేదు ఓ వీరుని ండలాలు పతనమవుతూ వుంటే వేరొకని ముఖం క్రోధ ముద్రను ప్రకటిస్తూ వుంది. దంతాలను పట పట లాడిస్తూన్నాడు. వేరొకని సర్వాభరణ భూషితాలైన దీర్ఘ, బాహు ండింపబడుతూన్నాయి. వీర శ్రేష్ఠులు ఖడ్గ పాణులై ముందుకు దూసుకుపోతూన్నారు.

మహేంద్రునిపై బలిచక్రవర్తి బాణ త్రయాన్ని ఐరావతం మీదా, చరణ రక్షకుల
...గ్గేసి బాణాలనూ, మావటిపై ఓ బాణాన్ని ప్రయోగించాడు. అది గమనించి మహేం
ఆ శరాల నన్నింటినీ నారాచంతో మధ్యే మార్గంలోనే ఖండించి వేశాడు. మహేంద్ర
మానికి క్రుద్ధుడై, ఉద్రిక్తుడైన బలి జ్వాజ్వల్యమానంగా జ్వలించునట్టి శక్తిని ప్రయో
ఇంద్రుడు అయ్యస్త్రాన్ని బలి చేతులలో వుండగానే ఖండించి వేశాడు. తరువాత బలి
...గా శూల, ప్రాస, తోమర, శక్తి ఆదిగా గల అస్త్రాలను తీయడమే — తడవు మహేం
...ఆయుధాల నన్నింటినీ ఖండించి ద్విగుణీకృతోత్సాహాన్ని ప్రకటించాడు. అంత బలి ఆ
...యాను ప్రయోగించి అమరులపై ఓ పర్వతాన్ని విసిరాడు. ఆ మహా పర్వతం మీద
...వాగ్ని దగ్ధాలైన తరువులూ, జ్వలిస్తూన్న శిలలూ పడుతూండగా అమర సైన్యాలు
...పోయాయి. మహా సర్ప, దందశూక, వృశ్చికాది విష జంతువులూ, సింహ, వ్యాఘ్ర,
...హ, గజాది భయంకర మృగాలు సుర సైన్యాలను పీడించ సాగాయి. శూల పాణులైన
...నీకం — అమర సేనపై విరుచుకు పడుతూ 'కొట్టు, పొడిచెయ్యి, చంపెయ్యి' అంటూ
...గా హింసించ సాగాయి. అల్ప సమయంలోనే అమరులపై పిడుగులు పడసాగాయి.
...వృతమైన అంబరమంతా ప్రళయకాల పర్జన్య సమంగా గర్జించ సాగింది. బలి దానవుడు
... సమయ దావానల సదృశంగా అగ్నిని సృజించాడు. అప్పుడే వాయువు విజృంభించి
సేనలను దహింపజేయ సాగింది. రణరంగమంతా క్షణ కాలంలో అంధకార బంధురం
...గరం అల్లకల్లోలితం కావడంతో తాలోత్తాల తరంగాలు పయుటుదేరి చెలియలి కట్టలను
...ంచి సుర సేనలను ముంచివేయ సాగాయి. ఆ రీతిగా మాయాశ్రితుడైన బలి తాను కని
...ండ కలిగిస్తూన్న భూతోపద్రవాలకు అమర సేనలు తీవ్రంగా బాధపడసాగాయి. వాటిని
...లేక మహేంద్రాది బృందారక సందోహాలు చేసేది లేక శ్రీహరిని శరణు వేడి ప్రార్థించ
. వారి ఆర్త స్థితిని గ్రహించి వారి ప్రార్థనలకు ప్రసన్నుడై శ్రీహరి
...రూఢుడై సాక్షాత్కరించాడు. పరమాత్మ దర్శనమిస్తే నాశనం కాని విపత్తు ఉంటాయా?
... స్థితి ఏర్పడగానే కలలో కానవచ్చినవన్నీ నాశనమై పోయినట్లు శ్రీహరి సాక్షాత్కార
...ంచే అసురీ మాయ మటుమాయమై పోయింది. తత్సమయంలో రణరంగంలో గరుడా
...ఢైన నారాయణుని తిలకించి కాలనేమి అనే రాక్షసుడు గరుడుని మీదకు త్రిశూలాన్ని ప్రయో
... శ్రీహరి ఆ త్రిశూలాన్ని లీలగా పట్టుకొని దానినే ప్రయోగించి వాహన సమేతంగా

ువి యమ సదనం చేర్చాడు. చక్రయుధాన్ని ప్రయోగించి ఆ దేవ దేవుడు మాలి, ువలను కూడ సంహరించి వేశాడు. మాల్యవంత నాయకాసురుడు భీకరమైన గదతో ిపై ప్రహారం చేయబోతూ వుండగా తత్సమయంలోనే భగవానుడు సుదర్శన ప్రయో వాని మస్తకాన్ని కూడ ఖండించి వేశాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–10 అధ్యాయం–11

శుకమహర్షి సురాసుర యుద్ధాన్ని వర్ణిస్తూ వున్నాడు – 'పరీక్షిన్నరపాలా! శ్రీమన్నారా పని ఆవ్యాజ కరుణవల్ల అమరులు భయ దూరులై నవోత్సాహంతో ఉప్పొంగి ారు. ఇంద్ర, వరుణ, వాయు, కుబేరాది దేవతలు గతమందు ఏ రక్కసుల ప్రహారాలకు ునారో? వారే యిప్పుడు ఆ రాక్షసులను ఎదిరించి ప్రహరిస్తూన్నారు. బలితో పోరుతూ ా మహేంద్రుడు దాతనిపై వజ్రాయుధాన్ని ప్రయోగించబోతూ వుండగా సర్వులలోనూ రవాలు బయలుదేరాయి, అరే! బలిదానవా! మూఢుడా! మోసకరులు బాలుర కళ్ళను వారి ధనాదులను అపహరించినట్లే నువ్వు నిజ ఆసురీ మాయతో మమ్మల్ని ఓడించా న్నావు. మాయాధినాధుడైన శ్రీహరిని ఆశ్రయించిన మమ్మల్ని మాయ ఏమీ చేయ . మూఢులు మాయను ఆశ్రయించి స్వర్గాన్నే కాక ఆ పైలోకాలను కూడ ఆక్ర లని వ్యర్థ ప్రయత్నాలు చేస్తూ వుంటారు. అట్టి బందిపోటులను నేనీ వజ్ర ప్రహారంతో ించి పతనం చేసెదను గాక! మూఢ చిత్తా! నువ్విప్పుడు అసంఖ్యాకంగా మాయలు చేశావు. శత పర్వాలతో కూడిన వజ్రాయుధంతో నీ తల నరుకుతూన్నాను. నువ్వూ నీ సోదర బాంధవు లేమి చేయకలరో చేసి చూడండి.' అన విని బలి పలుకుతూన్నాడు.

'ఇంద్రా! కాలశక్తి ప్రేరణానుసారమే వీరులు యుద్ధం చేస్తూ వుంటారు. యశాప యశ,

జయాలలో వారికి ఏమైనా కలుగవచ్చును. జయాపజయాలకు మేమే కారణమనీ, కర్తల
ావించునట్టివారు మనీషుల దృష్టిలో శోచనీయులే ఔతారు. మర్మ ఘాతుకాలైన మీ వచ
మాకు దృష్టిలేనినాడు మాకు వేదన ఎందుకు కలుగుతుంది ?' అంటూనే దానవరాజు
హరించి శరాలను వర్షింపజేయ సాగాడు. దేవతల ప్రబల శత్రువు, సత్యవాదీ అయిన
ణాలను వర్షింపజేస్తూ వుంటే మహేంద్రుడు బలిపై వజ్రాయుధాన్ని ప్రయోగించాడు.
పక్షాలు ఖండింపబడ్డ పర్వతం వలె బలి విమాన సహితం నేల కూలాడు. అది చూసి
సురుడు సింహ వాహనా రూఢుడై మహేంద్రుని దగ్గరగా వచ్చి గదా ధారియై శచీపతి
ాగాన్నీ ఐరావత గజాన్నీ కూడ వేధించాడు. ఆ దెబ్బకు ఐరావతం మూర్ఛపోయింది.
దేవేంద్ర సారథి అయిన మాతలి సహస్రాశ్వ యుక్తమైన దివ్య రథంతో మహేం
సమక్షంలో నిలిచాడు. వెంటనే శచీనాథుడు ఐరావతాన్ని విడనాడి రథా రూఢుడయ్యాడు.
కార్యాన్ని ప్రశంసిస్తూ అతనిపై జంభాసురుడు శూలాన్ని ప్రయోగించాడు. మాతలి
గా ఆ శూల ప్రహారాన్ని సహించాడు. దానితో క్రుద్ధుడైన దేవేంద్రుడు వజ్రాన్ని
ంచి జంభాసురుని నేలకూల్చాడు. దేవర్షి ద్వారా జంభాసుర సంహార వార్త నాలకించిన
దరులగు నముచి, బల, పాకాసురులు శీఘ్ర గమనంతో వచ్చి మర్మాలను భేదించే కఠోర
ప పలుకుతూ ఇంద్రునిపై శరాలను వర్షింపజేయ సాగారు. విశేష హస్త లాఘవం కల
ఒకే పర్యాయం సహస్ర శరాలను ప్రయోగించి–మహేంద్రుని రథానికి గల సహస్రాశ్వా
యపరచాడు. పాకాసురుడు శర శతంతో మాతలినీ, రథాంగాలనూ భేదించి వేశాడు.
ంలో అన్ని బాణాలను ఏక కాలంలో ప్రయోగించడం చూపరులకు మహాశ్చర్యాన్ని
ంది. నముచి దానవుడు నిశితమైన పదిహేను బాణాలతో ఇంద్రుని వేధించాడు. భయం
హాసం చెయ్య సాగాడు. ప్రావృట్కాల జలధరాలు భాస్కరుని అచ్ఛాదించి వేసినట్లు ఆ
శరవర్షంతో మహేంద్రుని కప్పివేశారు. దేవరాజు కానరాకపోవడంతో అనుచరవర్గ
గా అమరులు విచార సాగరంలో మునిగిపోయారు, బిగ్గరగా రోదించ సాగారు. సాగర
విచ్ఛిన్నమైన నౌకలో వున్న వ్యాపారుల వలె నాయకుడు లేని అమరులు తీవ్ర పరి
ెందసాగారు. కానీ అల్ప సమయంలో శత్రువర్గం ద్వారా పన్నబడిన మాయ విచ్ఛిన్నం
తో – రథ, సారథి, తురగ సమేతంగా మహేంద్రుడు బయట పడ్డాడు. ప్రభాత వేళలో
ంచే భాస్కరునిలా ఆ మహేంద్ర తేజస్సుతో తత్ ప్రదేశం యావత్తూ భాసిల్ల

. రక్కసి మూకలు తన వారిని పీడించడం గమనిస్తూనే వజ్రపాణి క్రోధ తామ్రాక్షుడై
రాయుక్తమైన వజ్రాయుధంతో వైరి వీరులను భయ కంపితులను చేస్తూ బలాసుర,
రులను సంహరించేశాడు. ఆ దృశ్యాన్ని చూసిన నముచి దానవుడు మహేంద్రుని అంతం
న్న తలంపుతో తీవ్ర తాపంతో ముందుకు దూసుకు వచ్చి. 'ఇంద్రా! ఇక నువ్వు
లవు.' అంటూ అరుస్తూ శూల పాణియై మహేంద్రునిపై విరుచుకు పడ్డాడు. ఆశ్మ
ర్మితమైన ఆ శూలాయుధం సర్వాలంకార భూషితమైన సువర్ణ చ్ఛటలతో అనేక ఘంట
గుతూ రాసాగింది. ఆ మహా దానవుడు సింహ గర్జనులు చేస్తూ ఆ శూలాన్ని
నిపై ప్రయోగించాడు. తన మీదకు మహా వేగంతో వస్తూన్న ఆ శూలాన్ని మహేం
నిశిత శరాలతో మధ్యే మార్గంలోనే తుత్తునియలు చేసి వేశాడు. దానితో వూరుకోక ఆ
నాయకుడు నముచిని సంహరించాలని వజ్రాయుధాన్ని ప్రయోగించగా — వృత్రాసురుని
అంతం చేసిన ఆయుధం నముచి చర్మాన్ని కూడ ఖండించలేక పోయింది. అది
దేవేంద్రుడు మహాశ్చర్యం చెందాడు. అంతే కాదు తత్సమయంలో అతనికి మహా భయం
. ఇంద్రుడు తనలో యిలా అనుకుంటూన్నాడు. — 'ఆదిలో యీ వజ్రాయుధంతోనే
తుల రెక్కలు నరికాను. వృత్రుణ్ణి కూడ దీనితోనే ఖండించినాను. అనేకమంది బల మద
మత్తులైన రాక్షసుల నెందరినో యీ వజ్ర సహకారంతోనే జయించ గలిగాను. అట్టి నా
ుధం యీ నీచ రాక్షసుణ్ణి అంతం చేయలేకపోయినదంటే నాకు మహాశ్చర్యంగా వుంది.
తేజంతో తయారైన యీ వజ్రాయుధం శక్తి హీనమై పోయినదా?' అని అనుకుంటూం
కాశవాణి యిలా పలికింది.

'ఇంద్రా! ద్రవం కల దానితో కానీ, ద్రవహీనమైన దానితో కానీ వీనికి మరణం లేదని
న్నది. కావున నువ్వు ఏదేని ఉపాయం ద్వారా వీణ్ణి అంతం చెయ్యి.' ఆకాశవాణి
నాలకించిన మహేంద్రుడు సముద్రపు నురగను గ్రహించి అది తడిదీ పొడిదీ కాక
వల్ల — దానిని గ్రహించి దానితోనే ఆ క్రూరాసురుణ్ణి అంతం చేసివేశాడు. అది చూసి
ముని బృందం దేవేంద్రునిపై సుమాలను వర్షింపజేయ సాగారు. గంధర్వ శ్రేష్ఠులైన
సు పరావసులు గానం చెయ్యసాగారు. దేవ దుందుభులు మ్రోగ సాగాయి. అప్సరసల నాట్యా
విశ్వమంతా ఆనందించినది. అట్లే వాయు రగ్ని వరుణాదులు ప్రతిపక్ష వీరు లయిన్న

ను శస్త్రాస్త్ర ప్రయోగాలతో సంహరించి వేశారు అంతతో వూరుకోక సింహ వ్యాఘ
వాహనాలను కూడ రూపుమాపి వేశారు. రాక్షసులు పూర్తిగా నాశనమై పోయారని
విన బ్రహ్మ నారద మహర్షిని పంపి దేవతలను రణరంగం నుండి విరమింపజేశాడు.

అమరులను తిలకించి దేవర్షి – 'దేవతలారా! శ్రీహరి కరుణవల్ల మీరు అమృతాన్ని
ని విజయ లక్ష్మిని శ్రీమహాలక్ష్మి దేవి అనుగ్రహం వల్ల పొందగలిగారు. కాబట్టి యిక
్ష ఆపండి.' అన్నాడు. నారదోపదేశ, ఆదేశానుసారం అమరులు యుద్ధాన్ని వెంటనే
తచిత్తులై స్వర్గధామానికి పయనం సాగించారు. తత్సమయంలో వారి అనుచరులు వారి
ానం చేశారు. హత శేషులైన రాక్షసులు వజ్రా ఘాతంతో పడి వున్న బలిని తీసికొని
చేరగా రాక్షస గురు వయిన ఆచార్య శుక్రుడు అతణ్ణి మృత సంజీవినీ విద్యా ప్రభా
పునర్జీవితుని చేశాడు. అంతేకాదు వాని అనుచరులకు కూడ ప్రాణదానం చేశాడు. అంగాలూ,
ూ తెగనివారందరూ జీవించారు. ఆచార్య శుక్రుని స్పర్శ మాత్రంచే బలికి చైతన్యం
. అతని ఇంద్రియాలు చైతన్యవంతా లయినాయి. మనస్సుకు స్మరణ శక్తి ఏర్పడింది.
ారమే జగత్తులో జనన మరణ, జయాప జయాలు ఏర్పడు తూంటాయని గ్రహించిన
కూడ విచారించ లేదు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-12

### సదాశివుడు జగన్మోహినిని తిలకించి మోహింపబడుట.

శుకమహర్షి పలుకుతూన్నాడు – పరీక్షిన్నరపాలా! జగన్మోహినీ రూపాన శ్రీహరి
ను సమ్మోహపరచి అమరులకు అమృతాన్ని ప్రసాదించాడన్న విషయం విని సతీ సమే
దాశివుడు వృషభారూఢుడై హరి సన్నిధికి వచ్చాడు. నిజా వాసానికి విజయం చేసిన
ంకరులను ఆదరాభిమానాలతో ఆహ్వానించి శ్రీహరి గౌరవించాడు. సనాతన దంపతులైన
ంకరులు లక్ష్మీ కాంతుని సన్నిధానంలో సుఖాసీను లయ్యారు. తరువాత సదాశివ దేవుడు
్మతం చేస్తూ–నారాయణా! జగన్నాధా! జగద్రూపుడవూ, యావద్విశ్వానికీ మూల కారకు
భగవానుడవూ అయిన నీ ద్వారానే యీ ప్రపంచానికి ఆద్యంతాలు ఏర్పడుతూన్నాయి.
సుడవైన నీలో ద్రష్టా దృశ్య, భోగ్య భోక్తృ భావాలన్న భేదం లేదు. యదార్థానికి సత్య
క బ్రహ్మ స్వరూపుడవైన నిన్ను కళ్యాణార్థులు సమస్త భోగాలనూ పరిత్యజించి సర్వ
రిత్యాగులై నీ చరణారవిందాలనే సేవిస్తూ వుంటారు. అమృత స్వరూపుడవూ, ప్రాకృత
్వస్వ రహితుడవూ అయిన నిన్ను శోకాదులు అంటవు. బ్రహ్మానంద స్వరూపుడవూ
రుడవూ అయిన నీ కన్న భిన్నమైన దేదీ లేకపోయినా నువ్వు సర్వాతీతంగానే వుంటావు.
్థితి సంహార కారణుడవై సర్వుల శుభా శుభ కర్మ ఫలాలకు సాక్షివై వారల చేత
్మ ఫలాలను అనుభవింప జేస్తూ వుంటావు. సర్వాపేక్షలకూ దూరుడవై కూడ జీవుల అభీ
ారం ఆయా కార్యాలు కొనసాగిస్తూ వుంటావు. కార్య కారణ, ద్వైతా ద్వైతాది సర్వ
ా నువ్వే. యదార్థానికి ఆభరణాలు బంగారు కన్న భిన్నమైనవి కానట్లే కార్యరూప జగత్తు
డవైన నీ కన్న భిన్నమైనవి కావు. మూర్ఖులు నీ వాస్తవ రూపాన్ని గ్రహించ లేక భేద
ో కల్ప వికల్పాలు చేస్తూ వుంటారు. నీలో ఎట్టి ఉపాధీ లేకపోయినా గుణాధారంగా భేద
ైన ప్రతీతి కలగడం వల్ల అజ్ఞానులు భేద వాదులవుతూంటారు. జగన్నాధా! బ్రహ్మ

ంలో కొందరూ; ధర్మ స్వరూపంలో మరి కొందరూ నిన్ను భావిస్తూ అభివర్ణిస్తూ
ప. మరి కొందరు నిన్ను ప్రకృతి పురుషాతీతుడ వంటూన్నారు. మరో తరగతికి చెందిన
మలా, ఉత్కర్షిణీ, జ్ఞానా క్రియా, యోగా, ప్రహ్వీ, ఈశానా, అనుగ్రహా అనే నవశక్తి
పరమ పురుషునిగా భావన చేస్తూన్నారు. ఇంకా కొందరు క్లేశ, కర్మాది బంధన రహి
సనాతన సనాతనుడూ, అవినాశీ పురుషునిగా స్వీకరించి ధ్యానిస్తూ వున్నారు. జగన్నాథా!
లోని వారమైన నేనూ బ్రహ్మ మరీచ్యాది మహర్షులూ కూడ భవదీయ సృష్టి రహస్యాన్ని
చజాలకున్నాము. అట్టి దశలో భవదీయ సత్య స్వరూపాన్ని గ్రహించ గలిగే దెట్లు?
మాన్య శక్తి సంపన్నులూ, రజ స్తమోగుణ సంపన్నులూ అయిన నర, అసురాదులు
గ్రహించగలరా? సర్వాత్ముడవూ, జ్ఞాన స్వరూపుడవూ అయిన వాడవు కనుకనే నువ్వు
లా, ఆకాశంలో అదృశ్య రూపంలో ఉండీ యావద్విశ్వంలో తేజరిల్లుతూ సమస్త
టి యొక్క జన్మస్థితి నాశన, చేష్ట, కర్మలూ, సంస్కార బంధ మోక్షాదుల నన్నింటినీ
వుంటావు. సర్వేశ్వరా! నువ్వు గుణాలను స్వీకరించి లీలా గృహీత దేవుడవై అవత
ప్పుడల్లా నేను నిన్ను దర్శిస్తూనే వున్నాను. నీదైన జగన్మోహినీ రూప దర్శనాభిలాషతో
. దైత్య దానవాదుల నందరినీ సమ్మోహ పరిచిన నీ ఆ జగన్మోహినీ రూపాన్ని
ు.' అని కోరగా నారాయణుడు గంభీరంగా నవ్వి — 'శంకరా! నువ్వు కోరిన రూపాన్ని
పుతాను. కానీ దానిని నీవంటి ఊర్ధ్వ రేతస్కులు మాత్రం చూడ తగినది కాదు. కాముకు
దరణీయమైన జగన్మోహినీ స్వరూపం కామాన్ని ఉత్తేజపరుస్తుంది. అయినా నీఅభీష్టాన్ని
స్తాను.' అంటూనే శ్రీహరి అక్కడ అంతర్ధానమై పోయాడు. పత్నీ సమేతంగా శంక
వశుడై అక్కడ దశదిశలా పరికించ సాగాడు.

అంతలోనే అక్కడ ఓ వుద్యానవనం గోచరమయింది. అక్కడనేక చిత్ర విచిత్ర వర్ణ
మైన తరు లతాదులూ. వాటియందు అరుణ వర్ణాలతో కూడిన చిగుళ్ళూ సుగంధ భరితా
ష్ప గుచ్ఛాలూ మనోహరంగా గోచరమయ్యాయి. ఆ సుందరోద్యానవన మధ్య
దుకూల వస్త్రాన్ని ధరించి, మేఖలాదులు నితంబ భాగాన ప్రకాశించగా కందుక క్రీడా
త్తయైన ఓ లావణ్య లహరి కానవచ్చింది. ఎగి రెగిరి కందుకాన్ని పట్టుకోవడం అదిగా
ంలలో స్తనద్వయం పరస్పరం రాసుకుంటూన్నది. హారాలన్నీ అల్లల్లాడు తూన్నాయి.

, హారాల భారం వల్ల సన్నని నడుము అల్లలాడ ప్రవాళ శోభతో భాసిల్లే చరణార
ంతో యిటూ అటూ గంతులు వేయసాగింది. ఆ గజ గమన ఆ కందుకం అటూ యిటూ
వుంటే గంతులేస్తూ దానిని పట్టుకోవా లనుకుంటూన్న జగన్మోహిని చంచల నేత్రాలు
ృతను పొందు తూన్నాయి. ఆమె కపోలాలలో కుండల కాంతులు కనులకు మిరుమిట్లు
సాగాయి. భ్రమర పక్షాలను తలపింపజేసే కుటిలాలకాలు ముఖారవిందానికి నవ్య శోభను
జేస్తూన్నాయి. ఒకప్పుడు చీర చెరగు జారి వూడిపోతూంటే మరొకప్పుడు వేణీ బంధం
గే సాగింది. అట్టి సమయాలలో సుకుమారమైన వామ కరంతో ఆమె వాటిని సరిదిద్దు
గా కుడి చేతితో కందుకాన్ని నేలకు వేసి కొడుతూ యావద్విశాన్నీ తన మాయా మోహితం
ాగింది. కందుక క్రీడ కొనసాగిస్తూ ఆ జగన్మోహిని కొద్దిగా సిగ్గును నటిస్తూ చంచలంగా
స నాథుని చూసింది. అయ్యపాంగావలోకన మాత్రానికే పరమ శివుని మనస్సు చలించి
అతడు మోహ పరవశుడై పోయాడు. వశం తప్పాడు. దగ్గరే వున్న ప్రమథ గణాలనూ,
తినీ కూడ విస్మరించాడు. తత్సమయంలో ఆమె బంతి దూరంగా దొర్లిపోయింది. ఆమె
పట్టుకోవాలని పరుగుతీస్తూ వుంటే శంకరుడు తిలకిస్తూ వుండగా ఆమె ధరించిన వస్త్రమూ,
మూ కూడ జారిపోయాయి. ఆమె సర్వావయవాలూ సర్వాంగ సుందరాలు కావడం వల్ల —
ంగం మీదకు దృష్టి పడితే అక్కడే ఆ దృష్టి మనస్సూ కూడ లగ్నమై పోతూన్నాయి.
మయంలో సర్వాంగ సుందరమైన మోహినీ రూపాన్ని తిలకించి, ఆమె కూడ తనయందను
మై వున్నదని గ్రహించి శంకరుడు భావించ సాగాడు. ఆ జగన్మోహిని శంకరుని కామ
ని చేసివేసింది. అతని వివేకాన్ని పోగొట్టింది. ఆమె హావభావ విలాసాదులు తిలకించి
కామాతురుడై భవాని సమక్షంలో వుండగానే యిసుమంతకూడ లజ్జలేనివాడై మోహినివైపు
గమించాడు. ఆదిలోనే వివస్త్రయైన మోహిని శివుడు తన దగ్గరగా రావడం గమనించి ఓ
చాటు నుండి వేరొక చెట్టుచాటుకు వెళ్ళి దాగుతూ ఏక స్థానంలో నిలబడక నవ్వుతూనే
సాగింది. కామ పరవశుడైన సదాశివుడు ఇంద్రియాల పట్టు తప్పి పోగా మదించిన
ఆడ ఏనుగును వెన్నంటే నడిచిన చందాన పరుగులు తీయసాగాడు. మోహినిని వెన్నంటి
జడను పట్టుకుని పరమ శివుడు ఆమెను దగ్గరకు లాగి వక్షఃస్థలానికి హత్తుకునేలా
ంచుకున్నాడు. గజద్వయం పరస్పరం గాఢాలింగనం చేసుకున్న రీతిని శంకరుడు జగన్మో
కౌగలించుకుంటూ వుండ ఆమె విడిపించుకునే ప్రయత్నంలో ఆమె కేశపాశం చిక్కుపడి

ు. వైష్ణవీ మాయా మోహిని కావడం వల్ల ఆమె సదాశివుని బాహు బంధం నుండి
ఒకుని పరుగెత్త సాగింది. ఆమె వెనుక మహా దేవుడు కూడ పరుగెత్త సాగాడు. తత్ప
ో మన్మథుడు శంకరుని జయించినాడా అన్నట్లుంది. కామోన్మత్త అయిన కరిణి వెనుక
దోన్మత్త అయిన మత్తేభం పరుగులు తీసిన రీతిగా శంకరుడు పరుగు పెడుతూన్నాడు.
వీర్యుడూ, ఊర్ధ్వ రేతస్కుడూ అయి కూడ మహాదేవుని వీర్యం జగన్మోహి కార
లితమయింది. శివుని దివ్య వీర్యం పడిన చోటల్లా సువర్ణ రజత ఖనులు ఏర్పడ్డాయి.
వ్యుడు కావడంతో మహాదేవుడు స్వస్థచిత్తు డయ్యాడు. అనంతరం ఆత్మ స్వరూపుడైన
మాయకు స్మరారి అబ్బురపడ లేదు. శ్రీమన్నారాయణ భగవానుని శక్తి అపారమైనదని
ికి తెలియదా! లజ్జా విషాదాతీతుడైన కైలాస నాథుని చూసి జగన్మోహినీ రూపుడైన
పురుష రూపాన్ని దాల్చి ప్రసన్న వదను డయ్యాడు.

'మహాదేవా! దేవ శిరోమణీ! నా మాయా మోహినీ రూపాన్ని తిలకించి మోహితుడవై
నః నీ అంత నీవుగా స్వస్థమందు ప్రవేశించ గలిగావు. ఇది మహానంద ప్రదమైన
ం, అపారమైన నా మాయను ఇంద్రియా దీనులు అధిగమించజాలరు. ఓసారి నా
పడి నీవు వినా అన్య లెవరూ మోహ పాశాన్ని తెంచుకో జాలరు. గుణమయమైన
మాయ మహామహులనే మోహ పాశ బద్ధులను చేసివేస్తూ వుంటుంది. అట్టిది నిన్ని
ముందెప్పుడూ మోహింపజేయ జాలదు. హేతువేమన సృష్ట్యాదుల కోసం ఆయా సమ
మాయను క్షోభింపచేయు కాల స్వరూపుడను నేనే కావడం వల్ల మతీయేచ్ఛాతీతంగా
రజో గుణాదులను సృష్టించ జాలదు.' అన్నాడు.

పరీక్షిన్నరేంద్రా! ఆ రీతిగా శ్రీహరి శంకర భగవానుని గౌరవించిన తరువాత గౌరీ
నారాయణ భగవానునకు ప్రదక్షిణ ప్రణామాలు అర్పించి ప్రమథ గణాలు పరివేష్టించి
లాసానికి వెళ్ళిపోయాడు. మహర్షుల సమాజంలో శంకర భగవానుడు — తన యొక్క
యొక్క విష్ణు రూపాంశా భూతమైన మాయా మోహినియొక్క వర్ణనను విశదీకరించి
ాడు.

'దేవీ! విష్ణు పరమాత్మ యొక్క మాయా మోహినీ రూపాన్ని నువ్వు తిలకించినావు
ాడు. కళా కౌశల సర్వజ్ఞుడనూ, సమస్త విద్యాధి నాథుడనూ సర్వతంత్ర స్వతంత్రుడనూ

నేనీ వైష్ణవీ మాయా మోహితుడ నవుతూంట అన్య ప్రాణులను గురించి వర్ణించాలా? సంవత్సరకాల పర్యంతం నేను సమాధి నుండి లేవగా నువ్వెవరిని వుపాసిస్తూన్నావని - నన్ను ప్రశ్నించినావు గుర్తున్నదా? నా ఉపాస్యమాన సనాతన దేవుడీ నారాయణుడే. పురుషోత్తముని కాలం బంధించ జాలదు. శృతు లాతనిని వర్ణించ జాలవు. అనంత స్వరూపు డా పరమ పురుషుడు అనిర్వచనీయుడని గ్రహించెదవు గాక!

శుకమహర్షి పలుకుతూన్నాడు :- పరీక్షిన్నరపాలా! క్షీరసాగర మథన యుక్తమైన అవతార గాథను - శ్రీహరి లీలా సంభరితమైన దానిని నీకు వినిపించినాను. ఏక కాలంలో రూపాలతో దేవతలకు అమృతాన్ని ప్రసాదించిన యీపావన గాథలను ఆలకించినా పఠించినా క్తి క్లేశాలన్నీ నాశనమై సుఖాలన్నీ సంప్రాప్త మవుతాయి. దుష్టాత్ములకు శ్రీహరి చరణార లు ఎన్నడూ లభించవు. భగవత్ భక్తులకు మాత్రమే ఆ శ్రీ చరణాలు లభిస్తాయి. ఆందు పరమాత్మ మాయా మోహినీ రూపాన దుష్ట దైత్య దానవాదులను సమ్మోహపరిచి హరి సేవాసక్తు లయిన దేవతలకు అమృతాన్ని ప్రసాదించాడు. తన సేవా పరాయణులై తనను యించిన వారి కెవరికైనా అతడు సర్వాభీష్టాలనూ సిద్ధింప జేస్తాడు. భక్తజనులకు కల్పవృక్ష ములైన ఆ పరంధాముని శ్రీ చరణాలకు నేను ప్రణమిల్లుతూన్నాను.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-13

## రాబోవు ఏడు మన్వంతరాల వర్ణన.

శుక మునిచంద్రుడు పలుకుతూ వున్నాడు - 'పరీక్షిన్నరేంద్రా! వివస్వత నందనుడైన వస్వతుడే సప్తమ మనువు. ప్రస్తుతం జరుగుతూన్నది. వైవస్వత మన్వంతర కాలమే. సన వంశ వర్ణనను ఆలకించు. ఇక్ష్వాకు, నభగ, ధృష్ట, శర్యాతి, నరిష్యంత, నాభాగ, దిష్ట

వృషధ, వసుమంత నామాలతో అతనికి పదిమంది పుత్రులు కలిగారు. ఆదిత్య, వసు, విశ్వేదేవ మరుద్గణ, అశ్వినీ కుమార, ఋషులు ప్రధాన దేవతా గణాలుగా ఖ్యాతి ి. పురందరుడు ఇంద్రు డయ్యాడు. కశ్యప, అత్రి, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, జులు సప్తర్షు లయ్యారు, కశ్యప పత్ని వల్ల అదితి గర్భం నుండి ఆదిత్యులకు కనిష్ఠ ంగా శ్రీహరి వామన రూపంలో అవతరించి తేజరిల్లాడు.

అష్టమ మన్వంతరంలో గాలవ, దీప్తిమంత పరశురామ, అశ్వత్థామ; కృపాచార్య, శృంగ వేదవ్యాసులు సప్తర్షు లవుతారు. ప్రస్తుతం వీరు తమ యోగశక్తుల ఆధారంపై మ మండలాలతో తేజరిల్లుతూ వున్నారు. దేవ గుహ్యుని భార్య అయిన సరస్వతి గర్భం ార్వభౌమ నామకావతారం ఏర్పడుతుంది. ఈతడే పురందరుని నుండి స్వర్గాన్ని చి బలికి ఇస్తాడు. వరుణ పుత్రుడైన దక్ష సావర్ణి నవమ మనువవుతాడు. భూత కేతు, తాదులు అతని పుత్రు లవుతారు పార, మరీచి గర్భాదులు దేవగణా లవుతారు. అద్భు న్న పేరు గలవాడు ఇంద్రు డవుతాడు. తన్మన్వంతరంలో ద్యుతిమంతాదులు సప్తర్షు . అయుష్మంతుని సతి అయిన అంబుధార వల్ల ఋషభ రూపంలో భగవంతుని కళావ ేజరిల్లుతుంది. అద్భుతు డనే ఇంద్రుడు ఋషభ దేవ కరుణ ప్రసాద లబ్ధమైన త్రిలోక ఽ అనుభవిస్తాడు. ఉపశ్లోకుని కుమారుడైన బ్రహ్మ సావర్ణి పదియవ మను వవుతాడు. ద్గుణ సంపన్నుడైన అతని కుమారులు భూరిషేణాదులు. హవిష్మంత, సుకృతి, సత్య, ార్తి, ఆదిగా గలవారు సప్తర్షు లవుతారు. సువాసన, విరుద్ధాదులు అమర గణా లవుతారు. ఇంద్రుడు కాగా విశ్వ సృజుని పత్ని అయిన విషూచి గర్భం నుండి విష్వక్సేన భగవానుడు అవతరించి ఇంద్రునితో మైత్రి కొనగిస్తాడు, విశేష సంయమి అయిన ావర్ణి ఏకాదశ మనువు అవుతాడు. సత్య, ధర్మాదులు అతనికి పదిమంది పుత్రు లవు ిహంగమ, కామ గమ నిర్వాణ, రుచి ఆదిగా గలవారు దేవ గణా లవుతారు. అరుణాదులు ుష లవుతారు. ఆర్యక పత్ని అయిన వైధృతి గర్భం నుండి భగవానుడు ధర్మ సేతు ముల్లోకాలనూ సంరక్షిస్తాడు, పన్నెండ మనువుగా రుద్ర సావర్ణి ఖ్యాతి గాంచాడు. దేవ వంత, ఉపదేవ, దేవ శ్రేష్ఠాదులు ౘ ఏ లయ్యారు. తత్సమయాన ఋతధాముడు డవుతాడు, హరితాదులు దేవగణ స్థానం రాజిలుతారు. తపోమూర్తి, తపస్వి ాగ్నీధ్ర

సప్తర్షు లవుతారు. సత్యసహాపత్ని అయిన సూనృత గర్భం నుండి స్వధామ
ో భగవదంశావతారం ఏర్పడుతుంది. తద్రూపంలోనే పరమాత్మ ఆ మన్వంతరాన్ని
డు.

అపార సంయమి అయిన దేవ సావర్ణి త్రయోదశ మనువు అవుతాడు. చిత్రసేన, విచి
ు ఆతని కుమారు లవుతారు. సుకర్మ, సుత్రామాదులు దేవగణాలు. దివస్పతి ఇంద్రుని
ు. నిర్మోక. తత్త్వదర్శి ఆదిగా గలవారు సప్తర్షు లవుతారు. దేవ హోత్రుని పత్ని
బృహతి గర్భం నుండి యోగేశ్వర రూపాన భగవదాంశావతారం ఏర్పడుతుంది. తద్రూ
నే పరమాత్మ దివస్పతికి మహేంద్ర పదవిని ప్రసాదిస్తాడు.

రాజా! సూర్యదేవునికి సంజ్ఞా! ఛాయా అనే పేర్లు గల భార్య లిద్దరు వున్నారు.
రూ కాక అతనికి 'బడబా' అన్న నామంతో తృతీయ పత్ని వుందని కొందరు అభి
ు పడుతూన్నారు. సూర్య పత్నులలో సంజ్ఞాదేవికి యముడూ, యమీ శ్రాద్ధ దేవుడైన
వ్రతుడూ, ఛాయాదేవికి సావర్ణి, శనైశ్చరులు అనే కుమారులూ, తపతీ అనే పుత్రి కలి
సంజ్ఞాదేవి రూపాంతరమైన బడబకు అశ్వినీ కుమారు లిరువురూ ప్రభవించినారు. తపతి
ుునకు భార్య అయినది. అష్టమ మనువు సావర్ణి, నిర్మోక, విరజస్కాదు లాతని కుమా
సుతప, విరజ, అమృత ప్రభ నామకులు ఆ మనువు కాలంలో ప్రధాన దేవ గణాలుగా
నకు చెందుతాయి. బలిచక్రవర్తి ఆ మను శాసన కాలంలోనే మహేంద్ర పదవి పొందు
వామన రూప ధారియైన శ్రీమన్నారాయణ భగవానుడు ఆ బలి నుండియే మూడడుగుల
ని దానమడిగి ఆ నెపంతో జగత్రయాన్ని అధిగమించి అతనికి సుతల రాజ్యాన్ని ప్రసా
అనుగ్రహించాడు. అతడే యిప్పుడు సుతలంలో మహేంద్ర సముడై భాసిల్లు తూన్నాడు.
త మహాదాత అయిన ఆ బలిచక్రవర్తి అనంతైశ్వర్య పూర్ణమైన స్వర్గాధిపత్యాన్ని
డి పరమ సిద్ధిని పొందాడు.

చతుర్దశ మనువుగా ఇంద్ర సావర్ణి ఖ్యాతి గాంచుతాడు. ఉరు, గంభీర బుద్ధ్యాదులు అతని
రులు పవిత్ర, చాక్షుషాదులు ప్రధాన దేవగణాలు. శుచి అనేవాడు ఇంద్రు డవుతాడు.
, బాహు, శుచి, శుద్ధ మాగధాదులు సప్తర్షు లవుతారు. ఆ కాలంలో సత్రాయణ పత్ని

వితానకు బృహద్భాను రూపాన పరమాత్మ ప్రాదుర్భవించి కర్మకాండను
ం చేస్తాడు.
మహారాజా! భూత భవిష్యద్వర్తమానాలయందు జరిగే పదునాలుగు మన్వంతరాలను
వర్ణించి చెప్పాను.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–14

## మన్వాదుల వివిధ కర్మ నిరూపణ.

పరీక్షిత్తు ప్రశ్నిస్తున్నాడు :— మునీంద్రా! మీరు వర్ణించిన మనువులూ, వారి పుత్రులూ, ఋషులూ దేవ గణమూ – ఆదిగా గలవారు ఆచరించే కర్మాదులను గురించి వివరించెదరు అని అర్థించగా శుక మహర్షి సమాధాన మిస్తున్నాడు 'రాజా! పై వారందరినీ వినియో సర్వ శక్తి సంపన్నుడు భగవంతుడు మాత్రమే. యజ్ఞ పురుషాది అవతార స్వరూప రమాత్మను గురించి నీకు వివరించి చెప్పాను. ఆ భగవత్ ప్రేరణ వల్ల మన్వాదులు యీ నడుపుతూ వుంటారు చతుర్యుగాంతంలో నష్ట ప్రాయాలైన శ్రుతులను సప్తర్షులు నిజ క్తితో పునః సాక్షాత్కరింప జేసుకుని తదాధారంగా సనాతన ధర్మాన్ని సంరక్షిస్తూ . భగవత్ ప్రేరణానుసారమే ఆయా మన్వంతరాలలో మనువులు ధర్మాన్ని నాలుగు నడిచేట్లు అందరిచేతా ధర్మాన్ని అనుష్ఠింపజేయిస్తూంటారు. మను కుమారులు ఆయా లో దేశ కాలాది విభాగం చేసి ప్రజలను పాలిస్తూ వుంటారు. పంచ మహా యజ్ఞాలూ గల కర్మలయందే ఋషి, పితృ, భూత మనుష్యాదిగా గల వారి యందున్న సంబంధంతో వతలు ఆయా మన్వంతరాలలో, హవిర్భాగాలు స్వీకరిస్తూ వుంటారు. భగవత్ ప్రసాద అపార సంపదను అనుభవిస్తూ మహేంద్రుడు ప్రజాపాలన చేస్తూ లోకానికి వర్షం ప్రసాదిస్తాడు. పరమాత్మ యుగ యుగాలలో సనకాది సిద్ధ రూపాలలో జ్ఞాన మార్గం.

వల్క్యాదిది ఋషి రూపంలో కర్మ మార్గం, దత్తాత్రేయాది యోగి రూపాలలో యోగ
్న వుపదేశిస్తూ వుంటాడు. మరీచ్యాదుల రూపాలతో అతడే సృష్టిని విస్తరిల్ల జేస్తూ
ు. సమ్రా డ్రూపంలో బందిపోటు దొంగలను శిక్షిస్తూ శీతోష్ణాది వివిన్న గుణానుసారం
ాపంలో సంహార కార్యం కూడ చేస్తూ వుంటాడు. నామ రూపాల మాయ వల్ల సర్వ
ల బుద్ధి మూఢమై వుండడం వల్ల వారు భగవన్మహిమనూ ఆతని యదార్థ రూపాన్నీ
ెజాలకున్నారు.

—0

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-15

### బలి ఇంద్రుణ్ణి జయించుట.

పరీక్షిత్తు అడుగుతూన్నాడు – 'మునీంద్రా! సర్వానికీ అధిపతి అయిన భగవాడు వామన
తో పదత్రయ భూమి నిమ్మని బలి నెందులకు యాచించాడు? తాను వాంఛించినది ప్రాప్తిం
రువాత కూడ బలిని ఎందుకు బంధించినాడు? సమస్తైశ్వర్య సంపన్నుడైన యజ్ఞ భగవానుడు
యాచించడమూ, పైగా నిరపరాధి అయిన అతణ్ణి దండించడం చూస్తే నాకు మహాశ్చర్యం
తూన్నది. నా యీ సందేహాలను నివారించ మీరే సమర్థులు, కనుక వివరించండి.' అని
ంగా శుకమహర్షి బదులు పలుకుతూన్నాడు. – 'పరీక్షిన్నరేంద్రా!' బలిని మహేంద్రుడు
చి అతని సంపత్ ప్రాణాలను జయించిననాడే భృగు పుత్రుడైన అచార్య శుక్రుడు మృత
ీ విద్యా ప్రభావంతో బలిని పునర్జీవితుని చెయ్యడం వల్ల బలి ఆనందించి తన సర్వస్వం
ుని చరణ కమలాలపై అంకితం చేసి గురు సన్నిధిలో వుంటూ – భార్గవ వంశీకులైన
్మణులనూ సేవిస్తూ అక్కడ వుండిపోయాడు. బలి సేవా ధర్మానికి ప్రసన్నులై భార్గవ
లైన బ్రాహ్మణులు అతనిచే స్వర్గాన్ని జయింప జేయించాలన్న అభిలాషతో యోచించి
భిషేక విధి ననుసరించి అతణ్ణి అభిషేకించి అతనిచే విశ్వజిద్యాగం చేయించారు. విధ్యను

యాగంలో హవిస్సుల ద్వారా అగ్ని పరితృప్తుడు కాగానే యాగ కుండాన్నుండి బంగారు
తో కూడిన దివ్య రథం — ఇంద్రుని అశ్వాలను బోలిన హర్యశ్వమూ, సింహ చిహ్న
మైన పతాకాదులూ లభించినాయి. సువర్ణ పత్ర యుక్తమైన ధనుస్సూ, అక్షయ బాణ
లు రెండూ, దివ్య కవచం కూడ ఆ పావన గుండం నుండియే లభ్య మయ్యాయి. పితా
త్రైన ప్రహ్లాదుడు — బలికి ఎన్నడూ వాడని పూల మాల నిచ్చాడు. ఆచార్య శుక్రుడు
ంచి అతనికి దివ్యమైన శంఖాన్ని యిచ్చాడు. ఈ రీతిగా బ్రాహ్మ ణాశీర్వాద లబ్ధము
రణ సామగ్రిని గ్రహించి వేద పారగుల స్వస్తి వచనాలు కాగానే — వారందరికీ బలి
ప్రణామాల పితామహుడైన ప్రహ్లాదునితో భాషించి అతనికి వందనం చేసి భృగు వంశ
త్తముల ద్వారా లభ్యమైన స్యందవాన్ని అధిరోహించి కవచధారియై, అక్షయ బాణ
కరవాల, ధనుస్సులను ధరించి శస్త్రాస్త్ర సర్వస్వాన్నీ కూడ ధరించి, పితామహ దత్త
ాలమాలను గళ సీమలో అలంకరించుకుని బలిచక్రవర్తి నవ్య శోభతో తేజరిల్లి పోసా
ుజాలలో బంగారంతో తయారైన బాజు బందులూ, కర్ణాలలో మకర కుండలాలూ,
దగా సమస్తాభరణ సుశోభితుడై అగ్నికుండాన ప్రజ్వరిల్లే జాత వేదునిలా రథా రూఢుడై
తూన్నాడు. అతనితో సమ బలపరాక్రమ సంపన్నులై శౌర్య ధైర్యాలతో అలరారే
ంది దైత్య దానవాదులు ఆతన్ని అనుసరించారు. క్రుద్ధోద్రిక్త అరుణ నేత్రాలతో ఆ దానవ
ులు అంబరాన్ని కబళిస్తారా? లేక పృథ్వినే దహించి వేస్తారా? అన్నట్లుగా గోచర
న్నారు. ఆ మహా సేనలను వెంటబెట్టుకుని బలి దానవుడు రోదసినే కంపింపజేస్తూ
ఐశ్వర్య పరిపూర్ణమైన స్వర్గంపై దండెత్తి వెడలినాడు.

స్వర్గ రాజధానియైన అమరావతీ పురంలో నందనోద్యానవనోపవనాలు అసంఖ్యాకంగా
ు. అందమైన పక్షుల జంటలు గుంపులు గుంపులుగా అక్కడ మధుర నాదాలు
ంటాయి. భ్రమర సమూహాల మధుర నాదాలతో మనస్సులకు
త్సాహం కలుగ సాగింది. పగడాల వంటి రంగుల పూలతో నిండిన
శాఖలతో నిండిన తరులతా సమూహాలతో, హంస, కారండవ చక్రవాకాది పక్షి సంతతు
అమరుల సమ్మానాలను అందుకునే సుందర లావణ్య లహరులైన దేవాంగనలు సరో
జలక్రీడ లాడుతూ వుంటారు. తేజరిల్లే మందాకిని — అమరావతీ నగరానికి కంఠకంఠా

పులా పరివేష్టించి ప్రవహిస్తూ వుంటుంది. ఆ దివ్య నగరానికి చతుర్దిశలలోనూ సువర్ణ ప్రాకారం వుంది. ఆ ప్రాకారంలోనే విశాల స్థలాలలో మహా సుందర భవనా లున్నాయి. బంగరు పట్టాలతో వున్న అసంఖ్యాక, ద్వార, గోపుర రాజ ంతో నిండిన ఆ మహా నగరాన్ని విశ్వకర్మ కళా కౌశల సర్వస్వాన్నీ వినియోగించి గా నిర్మించాడు. సభా మండపాలూ, వినోద క్రీడలకు యోగ్యమైన వేదికలూ, రథాలు గా సంచరించడానికి వీలైన మార్గాలూ, విశేషంగా వున్న ఆ దివ్య నగరంలో అనేక 'లు సిద్ధంగా వున్నాయి. మణిమయ శృంగాటకాలతో, మౌక్తిక ఖచితమైన వేదికలతో ఆ దివ్య నగరం అపరిమితానందాన్ని ప్రసాదిస్తూ వుంది. ఆ నగర యువతులు సదా వర్ష ప్రాయంలోనే వుంటారు. నిర్మలమైన అమూల్య వస్త్రాలను ధరించి వారు ప్రజ్వ సదృశంగా స్వచ్ఛందంగా ప్రకాశిస్తూ వుంటారు. అమర భామినుల వేణీ బంధాల నుండి సౌగంధి కాల సుగంధాన్ని గ్రహించి గాలులు మెల మెల్లగా చల చల్లగా వీస్తూంటాయి. ర్మిత గవాక్షాల నుండి, సుగంధ ధూప వాసనలు బహిర్గతమై మార్గాలను వ్యాపి చి వుంటే వాటిని అనుసరించి అమరకాంతలు వస్తూ పోతూ వుంటారు. మణి, మౌక్తికాదు ాడిన కేతు, పతాకాదులతో అలంకృతాలైన అనేక స్థానాలు మయూర, పారావత, దుల కూజితాలతో ఒప్పుతూ అమర భామినుల మంగళ గీతాలతో సర్వదా మంగళ గా వుంటాయి. శంఖ మృదాంగానక దుందుభి, వీణా వేణు, మురజ, ఋష్ట్యాది వాద్య గో గంధర్వ గానంతో, అచ్చరల నాట్యాలతో మనోహరంగా భాసిల్లే ఆ దేవ రాజధానీ ప్రకాశాధిష్ఠాన దేవతను సయితం పరాజితం చేసినట్లుగా గోచరమవుతూ వుంటుంది. స్థలూ, ద్రోహులూ, అధార్మికులూ, లోభులూ, దురభిమానులూ అయిన వారిలో ఏ హూ ఆ నగరంలో కాలు పెట్టజాలరు ఏవం విధ విశిష్ట గుణ సంపన్నమైన అమరావతీ గో ప్రవేశించి బలి మహా వీరుడు ఆ నగరాన్ని ముట్టడించి ఇంద్ర పత్నుల గుండెను క లాడిస్తూ శుక్రాచార్య ప్రదత్తమైన దివ్య ప్రభావ సంపన్న శంఖాన్ని పూరించాడు ఆ ాదాలతో నగరమంతా ప్రతిధ్వనించిపోయింది. మహా సైన్యాలతో యుద్ధ సన్నద్ధుడై వచ్చిన బలిని తిలకించి మహేంద్రుడు అనుచర వర్గం వెంటరాగా ఆచార్య బృహస్పతిని చి ప్రణమిల్లి — 'గురుదేవా! బలి అపార శక్తితో మాపై దండెత్తి వచ్చాడు. ఈ అతణ్ణి ఎదుర్కోవడం మాకు అసాధ్యమని భావిస్తూన్నాను. వాని కింత శక్తి ఎలా

? ఏ ధైర్యంతో మహా సైన్యాలతో దండెత్తి యిక్కడకు రాగలిగాడు? ఆ దానవున
క్తి ఎలా వచ్చిందో? నాకు ఎంతమాత్రం అర్థం కావడం లేదు. ఈ సమయంలో బలిని
దు మరెవ్వరూ ఎదురించలేరు. ఆచార్యా! సర్వ శ్రేష్ఠులైన తమరు యీ పరిస్థితికి కార
న్ని విశదీకరించెదరు గాక! ప్రళయాగ్నిలా వర్ధిల్లిన బలి ముఖంతోనే యీ విశ్వాన్ని
వేస్తాడా? నాలుకతోనే వాల్గు దిక్కులనూ నాకివేస్తా? దిశా సర్వస్వాన్నీ నిజ నేత్రాగ్ని
తో దగ్ధం చేసివేస్తాడా? అన్నట్లు గోచరిస్తున్నాడు. స్వామీ! వీనికి యీ సర్వశక్తులూ
గాయి? పైగా తేజస్సు కూడ వర్ధిల్లింది. అన్నీ వివరంగా చెప్పండి.' అన్ని ప్రశ్నిం
దేంద్రునకు ఆచార్య బృహస్పతి బదులు పలుకుతున్నాడు.

'శచీపతీ! బ్రహ్మవేత్తలైన భార్గవులు మహత్తరమైన సర్వలోక విజయ సాధకమైన శక్తిని
సాదించారు. జీవులు కాలాణ్ణి ఎదుర్కోజాలనట్లు బలిని యీ సమయంలో నువ్వేకాదు
ం ఏకమై ఎదురించినా ఏమీ చెయ్యజాలదు. పరమాత్మ మాత్రమే అతణ్ణి ఎదురించ
నుక బలికి వ్యతిరేక కాలం వచ్చే వరకూ నువ్వు నీ వారితో స్వర్గాన్ని విడనాడి
అధికార గర్వంతో బలి బ్రాహ్మణావమానం చేసిన వుత్తర క్షణంలో వాని శక్తులన్నీ
శనమై పోతాయి. నాడే పరివార సహితంగా అతడు పతన మవుతాడు.' అన విని అమరు
స్వేచ్ఛానురూప రూపాలు ధరించి అమర ధామం నుండి వెళ్ళిపోయారు. అమరులు కాన
ంతో బలి స్వర్గాన్ని స్వాధీనం చేసుకుని ముల్లోకాలనూ జయించి స్వాధీనంలో వుంచు
అనంతరం భార్గవులు అతనిచే శతాశ్వ మేధాలు చేయించారు. తత్ ప్రభావం వల్ల
ర్తి జగత్రయ విఖ్యాత మయింది. నాటి నుండే అతడు తారాధి నాథుడైన చంద్రునిలా
ాగాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–16

### అదితికి కశ్యప మహర్షి పయోవ్రతాన్ని వుపదేశించుట.

శుకమునీంద్రుడు పలుకుతూన్నాడు – 'రాజా! తన బిడ్డలైన దేవతలు అమరావతిని పలాయనం చిత్తగించడమూ, దానవులు జగత్త్రయాన్ని శాసించడమూ తిలకించిన మహా దుఃఖం కలిగింది. ఆమె అనాథలా మథనపడ సాగింది. చిరకాల సమాధి నుండి శుద్ధైన కశ్యప మహర్షి ఓనాడు అకస్మాత్తుగా కనులు తెరచి శ్రీఘ్రమే అదితి ఆశ్రమా చ్చి చూస్తే అక్కడ సుఖశాంత్యుత్సాహా లేవీ కానరాలేదు. అదితి భర్తను గౌరవించింది. ంగా కూర్చున్న ఆమెను తిలకించి కశ్యపుడు – దేవీ! ఈ సమయంలో భూసురోత్తము ట్టి ఆపదా రాలేదు కదా! ధర్మ పాలన సక్రమంగా వున్నదా? కాలుని కరాళ వదనంలో జీవకోటికి అమంగళాలు సంభవించడం లేదుకదా? జలపానం కూడ చేయకుండ అతిథి పోయే గృహం స్మశాన సమమైనది. నేను లేని కారణంగా నువ్వు వుద్విగ్నంగా వుండడం సహే. అట్టి దశలో అగ్నికి హవిస్సులు సక్రమంగా అర్పించవు. హరి ముఖ స్వరూపులైన, ), బ్రాహ్మణులనూ సేవించునట్టి గృహస్థుల సర్వాభీష్టాలూ నెరవేరుతాయి. ఎప్పుడూ ంగా ఉండే నీ ముఖ కమలం వాడినట్లున్నదే? నీ బిడ్డలందరూ క్షేమమే కదా?' అని గా ప్రశ్నించిన భర్తకు అదితి యిలా సమాధానం యిస్తూన్నది. – 'నాథా! గో, బ్రాహ్మణ, ా, నేనూ సుఖంగానే వున్నాము. ధర్మార్థ కామాది సాధనమందు గృహస్థాశ్రమం సహ ి వున్నది. సదా మిమ్మల్నే స్మరిస్తూ అగ్ని, అతిథి, సేవక, భిక్షుక, యాచకాదుల నంద ాదరంగా సేవిస్తూనే వున్నాను. త్వాదృశోదార ప్రజాపతుల ఆజ్ఞను నే నేల పాలిం సర్వాభీష్టాలనూ ప్రసాదించే ధర్మాన్ని నే నెందులకు తిరస్కరిస్తాను? ఆర్యా! త్రిగుణ లైన ప్రజలంతా మీ సంతానమే. మీకు బిడ్డ లందరియందూ సమభావం కలిగియే మీరు రిస్తారు? అయినా భగవంతుడు సయితం స్వభక్తులనే అనుగ్రహించునట్లు తమరు తమ న నాపై దయదలచి నాకు శుభాలు చేకూరే మార్గాన్ని చెప్పండి. మహా శత్రువులు నా

పదలనూ, నా స్థానాన్నీ కూడ అపహరించారు. నన్ను కాపాడండి. మదీయ యశోధ రాదులను హరించి నన్ను స్వగృహం నుండి బయటకు గెంటివేశారు. నేను సయితం సాగరంలో మునిగిపోయాను. మీకన్న మిన్నయైనవారు నా మేలుకోర గలవా రెవరూ ేరు. కనుక యథా పూర్వం నా బిడ్డలు స్వస్థానాన్ని పొంది సిరిసంపదలతో తులతూగే న్ని చెప్పండి.'

దుఃఖ సంతప్త హృదయంతో వేదన చెందుతూ అదితి అర్థించిన విషయాలకు స్పందించి ఉచ్చెరువు చెందుతూ — 'ఎంత ఆశ్చర్యకర విషయము? విష్ణు మాయ ఎంతటి ప్రబల ? స్నేహ పాశంతో యావజ్జగత్తూ బాధింపబడియే వున్నది పాంచ భౌతికమూ, అనాత్మ దేహ మెక్కడ? ప్రకృతి కన్న భిన్నమై అతీతమైన ఆత్మ ఎక్కడ? ఎవ్వరికీ పతీ, హ సంబంధులూ లేరు. మోహమే వారిని ఆడిస్తూ వుంది. సర్వ హృంతయాంతర్వర్తీ, ం దుఃఖాలను దూరం చేయునట్టివాడూ జగద్గురువూ అయిన వాసుదేవ భగవానునే నువ్వు ంచు. ఆ దయాసముద్రుడు అవశ్యం నీ అభీష్టాన్ని నెరవేరుస్తాడు. భగవద్భక్తి వ్యర్థం భక్తి కన్న మిన్న అయిన వుపాయం వేరే ఏమీ లేదనీ నాకు మహా విశ్వాసం వుంది. ర్త పలుకగా అదితి బదులు పలుకుతూన్నది.

'దేవా! జగదీశ్వరుని ఆరాధించే విధానాన్ని తెలియజేయండి. నా మనోరథాన్ని పర ఏమి చేస్తే నెరవేరుస్తాడు? సంతాన సహితంగా నేను దుఃఖ సాగరంలో వున్నాను. ుడు నాకు శీఘ్రంగా సంపన్నుడయ్యే వుపాయాన్ని తెలియజేయండి.' అని అర్థించగా — పూర్వం బ్రహ్మదేవుణ్ణి సంతానార్థినై నేను ప్రశ్నించగా ఆయన — శ్రీహరి శీఘ్రంగా ్నుడై వరమిచ్చునట్టి వుపాయాన్ని చెప్పియున్నాడు. దానినే నీకు చెబుతూన్నాను. సావ ఆలకించు. ఫాల్గుణమాస శుక్ల పక్షంలో పది రెండు రోజుల కాల పర్యంతం క్షీరాలనే స్తూ భక్తితో శ్రీహరిని ఆరాధించాలి. అమావాస్య వచ్చిన తరువాత శూకరం ద్వారా ుడిన మట్టితో ఒళ్ళంతా శుభ్రం చేసుకుని నదిలో స్నానం చెయ్యాలి. తత్సమయాన యీ న్ని పఠించాలి. 'హే దేవీ! సర్వులకు స్థిరమైన స్థానాన్ని అనుగ్రహించే సంకల్పంతో ్నారాయణుడు వరాహ రూపంతో రసాతలం నుండి నిన్ను వుద్ధరించాడు. నీకు నేను ్ణుతూన్నాను. నా పాపాలను అన్నింటినీ నువ్వు నాశనం చేసెదవు గాక!' తరువాత నిత్య

త్రిక కృత్యాలు నేరవేర్చుకుని ఏకాగ్ర భావంతో మూర్తి, వేదిక, సూర్య, జల, అగ్ని, రూపాలలో భగవంతుణ్ణి అర్చించాలి. తరువాత యిలా స్తుతించాలి. 'సర్వ శక్తి సంపన్నుడ నీవా! సర్వాంతర్యామివీ, సర్వారాధ్యుడవూ నీవే అయి వున్నావు జీవులన్నీ నీ యందూ, సర్వ జీవులయందూ వసిస్తూ వుండడం వల్ల నిన్ను వాసుదేవు డంటూన్నారు. చరాచర కీ, విశ్వ కారణానికీ నువ్వే, సాక్షీ భూతుడవై వున్నావు అట్టి నీకు నా ప్రమాణాలు. స్థూడవూ, సూక్ష్మడవూ అయిన నువ్వే ప్రకృతి పురుషుల రూపాలలో తేజరిల్లిపోతూ వు. చతుర్వింశతి గుణ జ్ఞాతవూ, గుణ సంఖ్యా విశేషాలను వివరించు నట్టి సాంఖ్య శాస్త్ర కుడవూ అయిన నీకు సాష్టాంగ ప్రణామాలు. ప్రాయణీయ, వుదయ నీయ కర్మలే శిరస్సు పాతఃకాల్మధ్యం దిన సాయం సవనాలే త్రిపాదాలుగా, చతుర్వేదాలూ శృంగాలుగా, గాయ ఛందస్సప్తకమే సప్త హస్తాలుగా ధర్మ మయ వృషభ స్వరూప మగు యీ యాగం ద్వారా ప్రతిపాదింపబడి వున్నది. ప్రళయంకర రుద్రుడవు కూడ నువ్వే. సర్వ శక్తు సరించు నట్టి వాడవూ నువ్వే. అట్టి నీకు పదే పదే వందనాలు. సర్వ విద్యాధి పతివీ, నీకు నా ప్రణామాలు. సర్వ జీవ ప్రాణ స్వరూపుడవూ, సమస్త జగత్ స్వరూపుడవూ కూడ , యోగమూ, యోగ ఫలమూ యోగ కారణమూ కూడ నీవే. యోగ సిద్ధి ద్వారా ప్రాప్తించు రైశ్వర్యాలూ నీవే. హేహిరణగర్భా! నీకు నేను ప్రణమిల్లు తూన్నాను. ఆది దేవుడవూ, గాక్షివీనరనారాయణ ఋషుల రూపంతో అవతరించిన వాడవూ నువ్వే. అట్టి నీకు ప్రణామాలు. క మాణిక్య సమ శ్యామ వర్ణం కల దేహంతో, సర్వైశ్వర్య సౌందర్యాలతో భాసిల్లు శ్రీ లక్ష్మీ దేవి ద్వారా సేవించబడునట్టి పీతాంబరధారీ, నారాయణా! నీకు పదే పదే ప్రణమిల్లుతూ సర్వాభీష్టాలనూ నెరవేర్చునట్టి వరాలను ప్రసాదించు నట్టి వాడవూ, శ్రేష్ఠుడవూ, సర్వ రేణ్యుడవూ, అయిన నువ్వే సర్వులూ ఆరాధిస్తూ వుంటారు. అమరులూ ఆదిలక్ష్మీ దేవియూ శ్రీహరి చరణాలను ఆశ్రయించి వుంటారో అట్టి దేవ దేవుడు నాకు ప్రసన్ను డగును వీ! శ్రీహరి దేవుని ఆదిలోనే ఆవాహన చెయ్యాలి. అనంతరం మంత్రాల ద్వారా పాద్య, వాది క్రియల ద్వారా శ్రద్ధగా మనస్సును ఆ దేవ దేవునియందు లగ్నం చెయ్యాలి. గంధ పులతో అతనిని ఆరాధించి క్షీర పాన్నం చేయించి వస్త్ర, యజ్ఞోపవీత, భూషణ, పాద్య , గంధ, ధూపాలతో, ద్వాదశాక్షర మంత్రంతో భగవంతుని ఆరాధించి శక్త్యానుసారం

గుడ, శాలి తండుల, మిశ్రితమైన పదార్థాన్ని క్షీరాలతో పక్వం చేసి నివేదన చెయ్యాలి. ాత ద్వాదశాక్షర మంత్రంతో హోమం చెయ్యాలి. తత్ ప్రసాదాన్ని భక్తులకు పంచి . ఆపై తాను భుజించాలి. అనంతరం ఆచమన తాంబూలాదులు సమర్పించాలి. అష్టోత్తర ్యాయాలు ద్వాదశాక్షర మంత్రాన్ని జపించి పరమాత్మను స్తుతించి ప్రదక్షిణం చేసి ో ఆనందంగా సాష్టాంగ ప్రణామం చెయ్యాలి. నిర్మాల్యాన్ని మస్తకంపై ధారణ చేసి న చెప్పి కనీసం యిద్దరు బ్రాహ్మణులకైనా క్షీరాన్నంతో భోజనం పెట్టి దక్షిణలతో ంచి వారి ఆదేశానుసారం మిగిలిన అన్నాన్ని బంధు మిత్ర సమేతులై భుజించాలి. బ్రహ్మచర్యంతో వుండాలి. మరునాడు సయితం ప్రాతఃకాల కృత్యాలు నిర్వర్తించుకుని దై పూర్వోక్త విధ్యనుసారం శ్రీహరిని ఏకాగ్ర హృదయంతో ఆరాధించాలి. ఆశ్లే మాప్తి పర్యంతం నిత్యం భగవంతునకు క్షీర స్నానం చేయిస్తూ అనుదినం హోమ, ణ భోజనాదులు కూడ చేస్తూ వుండాలి. అలా పయోవ్రత విధానంతో ద్వాదశ దినాలు న, పూజ హోమ భూసుర సమారాధనలతో హరిని సేవించి — ఫాల్గుణ శుక్ల పాడ్యమీ త్రయోదశి వరకూ త్రికాలాల్లోనూ స్నానం చేసి పృథ్విపై బ్రహ్మచర్య వ్రతంతో ాలి. అసత్య మాడరాదు. దుష్ట సాంగత్యం నిషేధము. సర్వ సౌఖ్యాలనూ త్యజించాలి. రినీ హింసించరాదు. త్రయోదశినాడు శ్రోత్రియ బ్రాహ్మణుల ద్వారా శాస్త్రోక్తంగా ి పంచామృతం స్నానం చేయించాలి. నాడు లోభించకుండ శక్తి ననుసరించి హరిని ిలి. పాయసాన్నాన్ని పరమాత్మకు అర్పించి దానితోనే హోమం చెయ్యాలి. స్వాదిష్ట ను భగవంతునికి నివేదించి ఋత్విజులకు వస్త్ర, భూషణ, దక్షిణాదులు సమర్పించి కూడ చెయ్యాలి. అల్లే ఆచార్యుని కూడ అర్చించాలి. భూసుర, బంధుమిత్ర, బధి మూక చండాల, పంగ్వాదులకూ దీనులకూ కూడ సంతర్పణ చెయ్యాలి. అన్నీ యిలా రువాత భగవంతుని ఆనందార్థమే అనిభావించి సోదరబాంధవులతో కలిసి తానూభుజించాలి. ివసాలలో అనుదినం నృత్య, గాన, వాద్యాదులతో స్తుతి, స్వస్తి వాచన, హరి కథలతో ధన చేస్తూ అన్యులచే కూడ చేయించాలి. ఇది శ్రేష్ఠమైన సర్వోత్కృష్ట భగదారాధన. ివుడు నాకీ ఉత్తమ వ్రతోపదేశం చేశాడు. అదే నీకు నేను వినిపించినాను. దేవీ! నీ నెరవేరును గాక, జితేంద్రియులై శ్రద్ధాసక్తులతో విశుద్ధాంత రంగంతో యీ ప్రయో

ౖ అనుష్ఠించు. దీని ద్వారా పరమాత్మ పూజితుడై ప్రసన్నుడవుతాడు. హరి ప్రియ
యీ వ్రతాన్ని సర్వ తపస్సార మన్నారు పెద్దలు. దీనిని ఉత్తమ దానమని కూడ
ను. భగవంతుడు ప్రీతి చెందునట్టి వ్రతమే ఉత్తమ వ్రత మనబడుతుంది. కనుక నువ్వు
మీ యీ వ్రతాన్ని పాలించి అభీష్టాలను నెరవేర్చుకో.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–17

### ప్రసన్నుడైన శ్రీహరి అదితికి వరమిచ్చుట.

శుకమహర్షి పలుకుతున్నాడు – 'రాజా! భర్త అయిన కశ్యప మహర్షి ద్వారా అదే
లై దేవమాత అయిన అదితి సంయమిత చిత్తంతో సావధానయై ద్వాదశ దినాలూ పయో
చేసింది. సారథి స్థానంలో బుద్ధి నుంచి మనో నామకమైన కళ్ళెమును బిగించి, ఇంద్రియ
శ్వాలను స్వాధీనమందుంచుకుని ఏకాగ్రతతో పురుషోత్తముని స్మరించ సాగింది. అంత
్న వాసుదేవుని యందు లగ్నం చేసి పయో వ్రతాన్ని అనుష్టించింది. అంత పీతాంబరధారీ,
చక్ర గదా పద్మ ధారీ అయిన శ్రీహరి ఆమె సమక్షంలో సాక్షాత్కరించడంతో ఆమె ప్రేమ
అయి సాష్టాంగ నమస్కారం చేసింది. పునః లేచి చేతులు జోడించి అచ్యుతుని స్తుతించ
త్నించ సాగింది. కానీ ఆమె నయనాలు ఆనంద బాష్పాలతో నిండిపోయాయి. ఆమె శరీర
రోమాంచితమై పోయింది. అంగ ప్రత్యంగాలు ఆనందోత్సాహాలతో కంపిస్తున్నాయి.
రుద్ధమైనోట మాట వెడలక నిలిచిపోయింది. ప్రేమ పూర్ణ నయనాలతో ఆ సాధ్వి
హాత్మను సందర్శిస్తూ వుంటే నేత్రాలతో పానం చేసివేస్తున్నదా? అన్నట్లు వుంది. తరు
మెల మెల్లగా గద్గద స్వరంతో పురుషోత్తముని స్తుతించ సాగింది. – 'శ్రీహరి దేవా!
్వరుడవూ, యోగ స్వరూపుడవూ అయిన నీ పాదాలను ఆశ్రయించి మానవులు భవ

న్ని దాటుతూన్నారు. నీ యశో గాన శ్రవణం వినవారు కూడ సంసార సాగరాన్ని దాటు రు. నీయశో గాన శ్రవణం కూడ సంసార సాగరాన్నుండి తరింప జేస్తుంది. నీనామ సంకీ ర్తనాదుల మాత్రంచే శుభ మంగళాలు చేకూరుతాయి. నిన్ను ఆశ్రయించిన వారి సర్వాపద ల్నీ దూరం చేస్తావు. నాకు శుభాలను చేకూర్చెదవు గాక! సృష్టిస్థితి సంహార కారకు అనంతుడవూ అయిన నీవే స్వేచ్ఛగా అనేక శక్తులనూ, గుణాలనూ గ్రహిస్తూ వుంటావు. స్వరూపుడవై వుంటూ నిత్యం నిరంతరం వర్ధిల్లుతూన్న బోధ ద్వారా హృదయాంధ నాశనం చేసివేస్తావు. దేవ దేవా! అనంతా! నీకు నేను ప్రణమిల్లు తూన్నాను ప్రభూ! ప్రసన్నుడవై సంతమాత్రాన — మానవ మాత్రులు బ్రహ్మాయుర్దాయంతో, దివ్య శరీ అభీష్ట వస్తువులతో అతులిత ధనంతో, స్వర్గ, పాతాళ, భూలోకాలలో ర్వ యోగ సిద్ధులతో, ధర్మార్ధ కామాలతో, యోగ సిద్ధులతో తేజశ్శక్తి ... శత్రు విజయాది సామాన్య వాంఛలు సిద్ధించడంలో సంశయ మెం... సంతుష్టుడై పలుకు తూన్నాడు — 'దేవమాతా! చిరకాలంగా ... నాకు తెలుసును. బద్ధ శత్రువులు నీ కుమారుల సంపదలను అపహరించి స్వర్గాన్ని ఢీ వారి లారు. నీ బిడ్డలు రాక్షసులను ఓడించి స్వస్థానాలను పొందిన తరువాత వారితో కలిసి పరమాత్మను ధ్యానించాలని కోరుతూన్నావు. ఇంద్రాదులైన నీ కుమారులు, రాక్షసులను చేస్తే రాక్షసాంగనలు విచారిస్తూ వుంటే చూడాలని నీకున్నది. అదితీ! నీ కుమారులు క్తి, సంపన్నులై, కీర్త్యైశ్వర్యాలు పొంది ఆదిలో వలె స్వర్గాధిపత్యాన్ని పొంది విహ నువ్వు అభిలషిస్తూన్నావు. అయితే యీ సమయంలో బలిని జయించడం కష్టమే. పరమాత్మ, బ్రాహ్మణులూ యిప్పుడు బలికి అనుకూలంగా వున్నారు. సురాసుర యీ సమయంలో సురలకు సత్ఫలితాన్నివ్వదు. నీ వ్రతానుష్ఠానానికి నేను ప్రసన్నుడ ు. నాకై నువ్వు చేసిన ఆరాధన వ్యర్థం కాదు. శ్రద్ధను అనుసరించి ఫలం సిద్ధించి . కనుక మార్గాంతరాన్ని నేనే సూచిస్తాను. కశ్యప వీర్యంలో అంశ రూపంలో నేనే ని నీకు కుమారుడనై! నీ బిడ్డలను సంరక్షిస్తాను. సౌభాగ్యవతీ! నీ పతి యగు కశ్యపుని నన్నీ రూపంలోనే దర్శించు. అనఘాత్ముడైన కశ్యప ప్రజాపతిని సేవించు. ఈ విష

నిన్నెవరైనా ప్రశ్నించినా చెప్పకు. అమర రహస్యం ఎంత గుప్తంగా వుంచితే అంత వస్తుంది.' అంటూనే శ్రీహరి అంతర్ధానమై పోయాడు.

శ్రీహరి దేవుడు తనకు బిడ్డగా పుట్ట సున్నాడని తలుచుకుంటూ దేవమాత బ్రహ్మానంద ...లై పోయింది. ఈ దుర్లభ సంఘటన అదితికి అనిర్వచనీయానందాన్ని ప్రసాదించింది. భక్తి, ప్రేమ భావాలతో భర్తను సేవించ సాగింది. సర్వజ్ఞుడైన కశ్యపునకు తెలియనిది ...గవదంశ తనలో ప్రవేశించినట్లు యోగ సమాధి ద్వారా అతడు గ్రహించాడు. కాష్టంలో ...వు అగ్నిని అధానం చేసినట్లు సమాహిత చిత్తుడైన కశ్యపుడు తపస్సు ద్వారా చిర ...గా వున్న అమోఘ వీర్యాన్ని అదితి గర్భంలో ఆదానం చేశాడు. శ్రీహరి అంశ ... అదితి గర్భంలో ప్రవేశించాడని గ్రహించి బ్రహ్మదేవుడు గుహ్యాది గుహ్య మంత్రాల అతణ్ణి స్తుతించ మొదలు పెట్టాడు — సంపూర్ణ యశస్సుకు ఆశ్రయమైన దేవా! నీకు ...గును గాక। అనంత శక్తులకు అధిష్ఠానుడవైన నీ చరణ కమలాలకు ప్రణామాలు. ... శాసకా! నీ పాదార విందాలకు నేను పదే పదే ప్రణమిల్లుతూన్నాను. సృష్టి గర్భాన రూపంలో అవతరించినవాడా! సర్వ వేద జ్ఞాన ధారీ! విధాతా। నీకు అగణిత ప్రణామాలు. ...యం నీ నాభిలో వున్నది. నువ్వు త్రిలోకాతీతమైన వైకుంఠాన వశిస్తూన్నావు. సర్వ ... కరణాలలో తేజరిల్లుతూ వుంటావు. సర్వ వ్యాపక విష్ణు స్వరూపా। నీ కివే నా వంద అనంత శక్తి రూప పురుష స్వరూపంలో ఉన్న నిన్నే శ్రుతులు వర్ణిస్తూన్నాయి. తన పడిన సూక్ష్మ వస్తువును సయితం నది ప్రవహింప చేయునట్లు కాల రూపంలో నువ్వే ... ధారా ప్రవాహ సంచలనం చేస్తూ వుంటావు. చరాచర జీవజాలానికీ ప్రజాపతులకూ ...నానికి మూల కారణానివి నువ్వే. దేవాధి దేవా। జలాల్లో మునిగి పోయే వానికి నావ ...నట్లే స్వర్గ పతనులైన అమరులకు ఆధారం నువ్వే.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-18

శుకమహర్షి పలుకు తూన్నాడు – 'రాజా! బ్రహ్మదేవుడీ రీతిగా భగవానుని లీలా శక్తు స్తుతించిన తరువాత శంఖ, చక్ర, గదా, పద్మ హస్తుడైన శ్రీమన్నారాయణ దేవుడు భుజ రూపంలో పీతాంబర ధారియై అదితి సమక్షాన అవతరించాడు. కమల సమంగా అతని లు విశాలాలై భాసిల్లుతూ వున్నాయి. శ్యామ శరీరుడైన వదన మండలం తూన్నది. వక్షస్థలాన శ్రీవత్స లాంఛనం కర కంకణాలతో హస్తాలూ, భుజా భుజకీర్తులూ, కటి భాగంలో కటి సూత్రమూ పాదాలయందు నూపురాలూ తేజరిల్లుతూ యి. కౌస్తుభ వనమాలా ధారియైన శ్రీనాథుని శరీర కాంతితో కశ్యప సదనంలోని యావ రమూ మటుమాయమై పోయింది. తత్సమయాన దిశలన్నీ నిర్మలాలైనాయి. స్వచ్ఛ తో సరోవరాలు వున్నాయి. ఆనందోత్సాహాలతో ప్రజల హృదయాలు చెప్పశాలని సంతో పొందుతూన్నాయి. పృథివ్యంతరిక్ష, నరసుర, గో, గిరి సమూహాల హృదయాలు ఆనం ంతో వికసించి వున్నాయి.

రాజా! పరమాత్మ అవతరించిన సమయాన చంద్రుడు శ్రవణా నక్షత్రంలో వున్నాడు. ద్రపద శుద్ధ ద్వాదశి. లగ్నం అభిజిత్తు – నక్షత్రాదులన్నీ వుత్తమ స్థితిలో వున్నాయి ద్వాదశి' అని దీనికే పేరు. దివాకరుడు ఆకసమందుండగా భగవానుడు ప్రాదుర్భవించాడు. యంలో వీణా వేణు మృదంగ శంఖ్య తూర్య, పటహ ఢక్కాది మంగళ వాద్యాలు నించాయి. అప్సరసల నాట్యాలతో. గంధర్వుల గానాలతో, ముని దేవతలూ, మను, గ్న్యాదులూ పరమాత్మను స్తుతించారు. సిద్ధ, విద్యాధర, కిన్నర, చారణ కింపురుష రాక్షస, నాగ, పక్షి సంతతులు ఆనందంగా ఆడి, పాడాయి. సుమ వర్షంతో అదితి మంతా నిండిపోయింది. తన గర్భం నుండి పరమాత్మ ప్రాదుర్భవించడం తిలకించి ంద్రమాశ్చ ర్యాలతో పులకించి పోయింది. యోగ మాయాధి నాథుడైన పరమాత్మ అవత కశ్యపుడు ఆచ్చెరువంది జయ జయ శబ్దాలు పలికాడు. అవ్యక్త చిత్స్వరూపుడైన డు చిత్ స్వరూపుడై సర్వాయుధ, ఆభరణాదులతో భాసిల్లిపోతూ వున్నాడు. అట్టి దేవ

అదితి కశ్యపుల సమక్షంలో తద్రూపాన్ని వుపసంహరించి వామన బ్రహ్మచారి రూపంలో ...రించాడు. తన వేషాన్ని మార్చిన నటుని వలె వామన బ్రహ్మచారి మాయా వటు ధరించాడు, ఆ వామనుని దివ్య సుందర మంగళ రూపాన్ని దర్శించి మహర్షులు మహా పొందారు. కశ్యపుని సమక్షంలో మహర్షి గణం ఆ వామన మూర్తి జాత కర్మాదులు చేశారు. ఉపనయన వేళలో సవితయే గాయత్రీ మన్త్రోపదేశం చేశాడు. బృహస్పతి పవీతాన్ని కశ్యపుడు మేఖలనూ, భూదేవి కృష్ణ మృగ చర్మాన్నీ, చంద్రుడు దండాన్నీ, కౌపీన కటి సూత్రాలనూ ఆకాశాభిమానదేవత ఛత్రాన్నీ సమర్పించారు, బ్రహ్మ కమండ ..., సప్త మహర్షులు కుశలనూ, సరస్వతి రుద్రాక్షమాలనూ, అర్పించారు. ఆ విధంగా వుప ... సంస్కారం కోలాహలంగా జరుగుతూండగా కుబేరుడు భిక్షా పాత్రను సమర్పించగా ...త్తూ రాజరాజేశ్వరీదేవి భిక్ష వేసింది. అలా సమ్మానితుడైన వామనమూర్తి బ్రహర్షి సభలో ...శించ సాగాడు. అనంతరం ఆ వామనుడు ప్రజ్వలితాగ్నికి కుశలతో పరి సమూహన, ...స్తరణలు సాగించి సమిధలతో హోమం చేశాడు.

ఏవం విధ విశిష్ట గుణ సంపన్నుడైన వామనుడు మాయా వటు రూపాన బలి యాగ ...వైపు పురోగమించాడు. సర్వ శక్తి సంపన్నుడైన ఆ దేవ దేవుడు అడుగువేస్తూ వుంటే ...వి కంపించ సాగింది. నర్మదా నదికి వుత్తర దిశలో వున్న భృగు కచ్ఛ నామక విశాల ... ప్రదేశాన భార్గవులు బలిచేత అశ్వమేధాలు చేయిస్తూ వున్నారు. వారిని సమీపించాడు ...మనుడు. వామనుని దర్శించి ఆ వేదవాదు లందరూ 'భాస్కరుడే విజయం చేస్తున్నాడా ?' అనుకున్నారు. వామనుని తేజస్సు ముందు ఋత్విజులూ యజమానీ, సదస్యులూ కూడ ...జులై పోయారు. సూర్యాగ్ని, సనత్కుమారాదులలో ఎవరో ఒకరై ఆతడు వుండాలను ...న్నారు. శిష్య పరివేష్టితుడైన ఆచార్య శుక్రుడు అలా యోచిస్తూ వుండగానే దండ, కమండల ...త ధారియైన వామనుడు యాగ మండపంలో అడుగు పెట్టాడు. మేఖల, యజ్ఞోపవీత, మృగ ...ర్మాదులు ధరించి జటాజూట ధారియైన వామన భగవానుడు బ్రహ్మచారి వేషంతో మాయా ...డై యాగ మండపంలో ప్రవేశించాడు. దానితో భార్గవులు నిస్తేజులై లేచి నిలబడి వామన ...మూర్తికి స్వాగత సత్కారాలు చేశారు. ఆ సుందర వామన మూర్తి చిన్ని అవయవాలు వయన ...నోహరంగా వున్నాయి. ఆ దివ్య మూర్తిని తిలకించిన బలిచక్రవర్తి బ్రహ్మానంద పరవశుడై

ఉత్తమాసనాన్ని సమర్పించాడు. స్వాగతం పలికి అభినందించి చరణారవిందాలను నచేసి పూజించాడు. గంగాధరుడు సహితం ఏ శ్రీచరణారవిందాలను గౌరవంగా శిరస్సుపై డో ఆ జనార్దనుని పాద రాజీవ ప్రక్షాళన జలాలను బలిచక్రవర్తి శిరస్సుపై చల్లుకుని య్యాడు.

అనంతరం అతడు — 'విప్రకుమారా! సుసమయంలో విచ్చేసిన మీ కివే నా ప్రణా మిమ్మేరీతిగా సేవించాలో ఆదేశించండి. తపస్సు అంతా మూర్తీభవించి నా దగ్గరకు ని మహర్షులందరూ భావిస్తూన్నా. మీ ఆగమన మాత్రంచే నా పితరులు కూడ తరించినారు. ం పవిత్ర మవగా నా యాగం భవదీయాగమన మాత్రంచే సఫల మయింది. మీ చరణార పక్షాళన మాత్రంచే నా పాపాలన్నీ నశించిపోయాయి. యాగంలో విధ్యుక్తంగా చేసే వల్ల సత్ఫలం నాకు సునాయాసంగా మీ వల్ల లభించినది. మీ పావన చరణ కమలాలు వుంచడం వల్ల యీ భూతలమే పవిత్రమైనది. ఏదో కోరికతో వచ్చినట్లు మిమ్మ కనిపిస్తూన్నది. గో, గృహ, స్వర్ణ, పవిత్రాన్నీ పానయోగ్య పదార్థాలూ, వివాహార్థం కన్య, సర్వ సంపద్యుక్తమైన రథ, గజ, తురగాలూ మీకు అర్పించగలను. అన్నీ చగలను." అన్నాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–19

## వామనుడు మూడడుగుల భూమిని దాన మడుగగా బలి అంగీకరించ - ఆచార్య శుక్రుడు అడ్డు తగులుట!

శుకమహర్షి పలుకుతూన్నాడు. పరీక్షిన్నరేంద్రా! ధర్మ బద్ధాలై హృద్య మధురాలైన కు లాలించిన వామనుడు ఆ చక్రవర్తిని అభినందించి పలుకు తూన్నాడు:— 'బలి చక్ర

కీర్తి ప్రదమై ధర్మార్థ సంయుతమై, వంశ పరంపరాగతమై, మధురాతైన నీ వచనాలు పరమానందాన్ని కలుగ జేశాయి. పరలోక హితకరమై ధర్మ విషయంలో మీ గురువైన వ్య శుక్రులు వచనాలను పరమ ప్రమాణంగా విశ్వసించి నీ పితామహుడు పరమ శాంత యుడూ అయిన ప్రహ్లాదుని ఆదేశాలను కూడ శిరసా వహించిన నీ వంశంలో ధైర్య ్యలూ లోభులూ అన్నవారు లేనే లేరు. భూసురోత్తములకు దానమీయనివారూ, వాగ్దానం చేసి య్యని వారూ లేరు. యాచకులు యాచనలను విని యుద్ధరంగంలో శత్రువులు యుద్ధానికి ఆహ్వానిం ని వెన్ను జూపిన వారూ యింతవరకూ మీ వంశాన పుట్టలేదు. మీ కులంలో ప్రభవించిన ప్రహ్లా నేటికీ ఆకసంలోని చంద్రునిలా భాసిల్లుతూనే వున్నాడు. మీ కులంలోనే హిరణ్యాక్షుని వంటి శిఖామణి ప్రభవించాడు. గదా పాణియై అతడు పృథ్వీ మండల మంతా తిరుగుతే అతనికి తైన వీరుడే కానరాలేదు, శూక రాకారంలో శ్రీహరి జలాల నుండి పృథ్వి నుద్ధరించే సమ హిరణ్యాక్షుడు ఆ వరాహ మూర్తిని ఎదిరించగా అతి కష్టంమీద ఆ వరాహ స్వామి యించ గలిగాడు. కానీ హిరణ్యాక్షుని బల పరాక్రమాలను తిలకించిన ఆ దేవ దేవుడు యించి కూడ అది యదార్థమైన జయంగా భావించ లేదు. తన సోదరుణ్ణి నారాయణుడు రించాడన్న క్రోధంతో హిరణ్య కశిపుడు ఆతణ్ణి అంతం చెయ్యాలన్న భావంతో వైకుం వెళ్ళాడు. మాయా రచనా విశారదుడైన విష్ణువు — శూల పాణియై తన మీదికి లంఘించి హిరణ్య కశిపుని తిలకించి — 'మృత్యువు జీవులను తరిమివేస్తూన్నట్లు యీ రాక్షసుడు క్కడికి వెడితే అక్కడికే వస్తాడు. బహిర్ముఖుడే కానీ యితడు అంతర్ముఖుడు మాత్రం న్ను బాహ్యంలోనే అన్వేషిస్తాడు కానీ నిజ హృదయంలో వీక్షించజాలడు. కనుక కాల మయ్యేవరకూ నేను వీని హృదయంలో వసించడం — సమస్త భువనాలకూ శ్రేయో మని భావించి సర్వే సర్వత్రా అన్వేషించి శ్రీహరిని గాంచక క్రుద్ధుడై సింహగర్జనలు స్వర్గ, భూ, పాతాళ లోకాలు వెదికాడు, కానీ ఎక్కడా వానికి శ్రీహరి కానరాలేదు. శ్రీహరి తనకు భయపడి మరణించి వుంటాడని తలచి హిరణ్యకశ్యపుడు — క్రోధం కార మూలకమనీ వైరం వీడి మౌనం వహించాడు. నీ జనకుడూ ప్రహ్లాద నందనుడూ విరోచనుడు భూసుర భక్త శ్రేష్ఠుడు కావడం వల్ల అమరులది గ్రహించి బ్రాహ్మణ లై వచ్చి నీ ఆయుర్దాయాన్నే దానమివ్వమని అర్థించగా —

వారు కపట బ్రాహ్మణులని తెలిసి కూడ మహాత్ముడైన నీ జనకుడు అమరులకు తన ఆయువును ధారపోశాడు. నువ్వు కూడ తద్ధర్మాన్నే పాలిస్తున్నావు. మీ కుల గురు, అనుసరించిన మార్గాన్నే నువ్వూ అనుసరిస్తూ పాలిస్తున్నావు. యాచకులకు అభీష్టమును ప్రసాదించే వారిలో నువ్వు సర్వ శ్రేష్ఠుడవు. అట్టి నిన్ను నా పాదాలతో మూడు ప్రమాణం కల భూమిని యాచిస్తున్నాను. నువ్వు చక్రవర్తివే అయినా యింతకు మించి అవసరం లేదు. మనీషులు అవసరాన్ని మించి యాచించరు. కనుకనే వారిని ప్రతిగ్రహ పాపం అంటదు.' అన్నాడు.

అంత బలి అందుకుని — 'విప్రకుమారా! నీ బుద్ధి చూస్తే పిల్లల బుద్ధిగా వుంది. కానీ మాటలు చూస్తే పెద్దవిగా గోచర మవుతున్నాయి. లేకుంటే సర్వైశ్వర్య శాలినీ జగత్త్రయమునూ అయిన నేను యావద్భూమండలాన్నే దాన మీయగలను. అట్టి శ్రేష్ఠుడనైన నేను దానిని అభ్యర్థించమంటే మూడడుగుల నేలను మాత్రమే యాచిస్తావా? ఇది ధీశాలురకు తగునా? బ్రహ్మచారీ! నా దగ్గరకు వచ్చి యాచించిన వాడు మరలి వెళ్ళి ఎన్నడూ ఎవరినీ యాచించనట్టి స్థితికి రారాదు. పూర్ణ కాముడై వెళ్ళాలి. కావున నీ జీవ యాత్రకు కావలసినంత నిశ్శంకగా యాచించు.' అన్నాడు.

దానికి వామనుడు బదులు పలుకుతున్నాడు — 'రాజా! సంసారంలో వుండే వస్తువు లభించినా మానవ మాత్రుని వాంఛలు నెరవేరవు. జితేంద్రియుడు కానివాడు సర్వ విశ్వమును పొందినా తృప్తిని పొందజాలడు. మూడడుగుల నేలతో తృప్తి పొందని వాడు నవ ద్వీపయుక్తమైన భూమండలమంతా లభించినా తృప్తుడు కాజాలడు. ఏమందువా? వారికి యింకా ఏవేవో పొందాలన్న వాంఛలు ఏర్పడుతూ వుంటాయి. పృథు గయాది చక్రవర్తులు సప్తద్వీపాధిపతులైన నాథులై, సమస్త సంపదలూ పొందినా తృష్ణను మాత్రం జయించలేక పోయారు. యదృచ్ఛగా సంసారం ప్రాప్తమైన దానితో పరితృప్తి చెందే వాడే సుఖంగా జీవించ గలుగుతాడు. ఇంద్రియాలను వశంలో వుంచుకో జాలనివాడు జగత్త్రయం స్వాధీనమైనా సుఖాన్ని పొందలేక దుఃఖాలనే పొందుతూ వుంటాడు. అట్టి వాని అసంతోష రూపాగ్ని సదా జ్వలిస్తూనే వుంటుంది. ధన భోగాలయందు తృప్తి లేకపోవడమే సంసార బంధనానికి కారణము. బద్ధ జీవుడు సంసార చక్రంలో పరిభ్రమిస్తూ ముక్తిని పొందజాలడు. యదృచ్ఛా లాభ సంతుష్టుడైన భూసు

యస్సు వర్ధిల్లుతూ వుంటుంది. జలం వల్ల అగ్ని శాంతించిన రీతిగా అసంతుష్టుడైన విప్రుడు
నాను డవుతాడు. యాచకుల అభీష్టాలను నెరవేర్చే వాడవడంలో సందేహం లేదు. అందుకే
వలసిన భూమినే యాచిస్తూన్నాను. కావలసినంత మాత్రమే సంగ్రహించడం ఆర్యులైన
మ ధర్మము.' అన విని బలిచక్రవర్తి నవ్వి వామనుని చూసి — విప్రకుమారా! నువ్వు
మూడడుగుల నేల యిస్తామని' అంటూ పలికి — అతడు దానమివ్వడానికి జలపాత్ర
తీశాడో లేదో సర్వజ్ఞుడైన ఆచార్య శుక్రుడు భగవల్లీలను గ్రహించి బలిని చూసి
న్నాడు.

'దానవేంద్రా! ఈ వామనుడు ఎవరో కాదు. సాక్షాత్తూ శ్రీహరియే. దేవకార్య సిద్ధికై
శ్యపులకు పుత్రుడుగా ప్రభవించి నీ సర్వస్వాన్నీ హరించ వచ్చినాడు. ఈ విషయం ఎరు
వ్వు దానమీయ సిద్ధపడ్డావు. జరగబోయే అనర్థాన్ని అర్థం చేసుకోలేక పోతూన్నావు.
నాశనార్థం యితడు వచ్చాడు. ఇది నేను శుభంగా భావించ జాలను. యోగ మాయాశ్ర
న పరమాత్మయే కపట వటు రూపంలో వచ్చి కూర్చున్నాడు. ఈతడు భవదీయ రాజ్య,
భాగ్య తేజో యశస్సులను సయితం హరించి మహేంద్రుడికి వాటిని దత్తం చేయ
. విరాడ్రూపుడై యితడు జగత్రయాన్ని పాదత్రయంతో కొలుస్తాడు. మూఢా! సర్వాన్నీ
దానం చేసి వేస్తే నువ్వెలా బతుకుతావు. విశ్వరూపుడై యీతడు ఓ పాదంతో
రెండవ పాదంతో స్వర్గాన్నీ కొలవ గల సమర్థుడు. ఈతని బృహద్విశాల దేహంతో
మంతా నిండి పోతుంది. తృతీయ పాదానికి స్థానమేది? నువ్వు ఆ తృతీయ పాదానికి
చూప లేవు. వాగ్దాన భంగమై నీకు నరకం సిద్ధిస్తుంది. సత్య వాక్పాలన అసాధ్యం. కను
ర్థమైన వాగ్దానాలు చెయ్యరాదు. అట్టి వారిని మునీషులు ప్రశంసించరు. విశ్వంలో ఐశ్వర్య
డై జీవ యాత్ర నడుస్తూన్నప్పుడే తపోదాన పరోపకారాదులకు సావకాశం వుంటుంది.
న్ని పంచధా విభజించి ధర్మ యశోధనాభివృద్ధులకు మూడు వంతులూ, స్వసుఖార్థం ఒక
భజించి వ్యయం చేయ గల వారే యిహంలోనూ, పరంలోనూ సుఖించ గలుగుతారు దాన
ప్రతిజ్ఞా భంగ మవుతుందని యోచిస్తూన్నావేమో? ఈ విషయమై శ్రుతి వాక్యాన్ని
మిస్తూన్నాను విను. ఎవరికైనా ఏదైనా యిస్తానని చెప్పడం సత్యం కాదు." — అని
అసత్య మవుతుంది. ఈ దేహమే ఓ వృక్షం — సత్యమే దీనికి ఫల పుష్పాదులు.

మైన వృక్షమే లేనినాడు ఫలపుష్పాదులకు స్థాన మెక్కడ? తన వస్తువులను పరులకీయ
ట, తనవైన ధనాదులను తాను సేకరించి సంరక్షించుకొనుట యివే శరీర రూపకరువృక్ష
లు, వృక్ష మూలమే నాశనమైనప్పుడు అల్పకాలంలోనే వృక్షమంతా శుష్కించిపోతుంది.
దానమీయడంలో వెనుకంజ వేయకపోతే జీవితమే నాశనమై పోతుంది. ఇందులో సందే
హము. 'నే నిస్తానసడంలోనే ధనం దూరమై పోతుంది. తనకున్న దంతా యాచకునకు యీయ
నవాడు తాను అనుభవించడానికి భోగ సామగ్రిని దాచుకునే సావకాశం వుండదు, 'నేను
ను' అన్న అస్వీకారాత్మకమైన అసత్యంలో తన ధనాన్ని తాను రక్షించుకుంటూన్నాడని
వాలి. కాని యీ మార్గం సర్వ వేళల్లోనూ స్వీకరించ దగినది కాదు. సర్వజనులతోనూ,
వేళల్లోనూ సర్వవస్తువుల విషయంలోనూ 'నాస్తి నాస్తి' అని అంటూండే వానికి అపకీర్తి
ుంది. అట్టివాడు బ్రతికి చచ్చిన వానితో సముడవుతాడు. వారిజాక్షుల విషయంలోనూ,
హిక సంబంధాలయందూ, ప్రాణ మాన విత్త భంగమందూ గో, బ్రాహ్మణ హితార్థమూ,
మృత్యువు నుండి సంరక్షించటానికీ అసత్యం పలుక వచ్చును. ఇది ఎంతమాత్రం దోషం
ు.' అన్నాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-20

### వామనుడు విరాడ్రూపుడై భూ, స్వర్గలోకాలను కొలచుట.

శుకమహర్షీంద్రుడు — 'రాజా! ఆచార్య శుక్రుల పలుకు లాలకించి బలి క్షణమాగి సావ
ధానుడై పలుకుతూన్నాడు — 'గురుదేవా! మీ పలుకులు యదార్థాలే. ధర్మార్థ కామ
జీవనాలకు ఆటంకం కలుగజేయనిదే ధర్మం—అయినా ప్రహ్లాదుని మనుమడనైన నేను యీ
విప్ర కుమారునికి వాగ్దానం చేసి మరల లేదనడం అసాధ్యమే. అనృతాన్ని మించిన

ం లేదని పృథ్వీ దేవియే చెప్పినది. అంతే కాదు – సర్వ వస్తు జాలాన్నీ, జీవ జాలాన్నీ రించ గలను కానీ అబద్ధా లాడేవారిని మాత్రం భరించ జాలనని చెప్పింది. నేను నరక, ్య, దుఃఖ సాగరం రాజ్య భ్రష్టత్వం, మృత్యువులకు సయితం భయపడను కానీ, భూ త్తమునకు దాన మిస్తానని చెప్పి – లేదనడానికి మహా భీతి చెందుతాను. సత్పాత్రులకు ంయయకపోతే సంగ్రహించిన ధన, ధాన్యాది సంపదలు ఇక్కడే వుండిపోతాయి. దధీచి శిబి ుల మహాత్ములు అత్యంత ప్రీతి పాత్రమైన ప్రాణాలనే సమర్పించి విశ్వ కళ్యాణానికి ంచినారు. పృథివ్యాదులను దాన మీయడంలో విలంబం దేనికి ? ఆచార్యా ! గతించిన కాలాల్లో ్రదు లెందరో యీ సామ్రాజ్యాలను అనుభవించినారు. భూతలంలో ఆ మహావీరులను ంనవారే లేకపోయారు. ఇహ పరాలను విడనాడవలసి వచ్చిన సమయం ఎదురు కావడంతో ుయితం మృత్యువును జయించలేక పోయారు. వారి యశశ్చంద్రికలు మాత్రం మిగిలి యి. రణరంగంలో వెన్ను చూపనివారు కూడ ఎందరో వుంటాను. కానీ సత్పాత్రులకు చేసేవారు మాత్రం అరుదుగావే వుంటారు. ఉదారుడు, దయా శీలీ, అయిన వాడు అపాత్ర ానం చేసి దుర్గతి పొందినా అది ఆతనికి శోభనే కలిగిస్తుంది. అట్టి దశలో మహాత్ములైన ్వేత్తలకు దానమిచ్చి సర్వ నాశన మయితే మాత్రం ఏమి ? నేనీ విప్రకుమారుని అభీ అవశ్యం తీర్చగలను. అత్యంతాదర భావంతో మీ వంటి వారిచే యాగాల ద్వారా ఆరా డుతూన్న నారాయణుడే యీ రూపాన వచ్చినా, లేక మరెవరైనా కానీయండి యీ వటు ధరించి వచ్చినా. అధర్మం హేతువుగా యీతడు నన్ను బంధించినా నే నీతనికి అకష్టాన్ని దను. పవిత్ర కీర్తి అయిన నరాయణుడే యీతడైతే శ్రీహరి కీర్తిని పోగొట్టుకుంటాడా ? ుగంతో నన్ను అంతం చేసి అయినా యీ పృథ్విని స్వాధీనం చేసుకుంటాడు. అలా కాక దెవడైనా నా శరాగ్నిలో దగ్ధమై పోతాడు.' అని బలి పలకడం ఆచార్య శుక్రుడు అగ్ర ్రగుడై పోయాడు. తన శిష్యుడై కూడ తన మాటను జవదాటాడన్న కోపంతో శుక్రుడు శపించాడు. బలి శాపార్హుడు కాకపోయినా విధిని అనుభవించవలసి వచ్చింది.

శుక్రుడు – 'మూఢా ! అజ్ఞానివై కూడ నువ్వు జ్ఞానినిలా భాషిస్తూన్నావు నా ఆదేశాన్ని ిరించి నన్ను వుపేక్షించి గర్వించినావు. కనుక శీఘ్రంగా నువ్వు రాజ్య లక్ష్మిని కోలు వవు గాక !' అని గురువు శపించినా బలి సత్యం విడువ లేదు. అతడు వామనుని విధ్యుక్తంగా

ఓ మూడడుగుల భూమిని దానం చేయు సంకల్పం చేశాడు. తత్సమయంలో బలిచక్రవర్తి పత్ని అయిన వింధ్యావళీదేవి అక్కడకు వచ్చి జల పాత్రను చేబూని జలాలు పోయగా మనదేవుని దివ్య చరణారవిందాలను ప్రక్షాళం చేశాడు. జగత్పావనమైన ఆ పవిత్ర జలాలను ఆ దంపతులు శిరస్సుపై ధరించారు. గరుడ, గంధర్వ, సిద్ధ చారణాదులు ఆ దాన ని దాతృత్వాన్ని కీర్తిస్తూ పుష్పాలను వర్షింప జేశారు. దేవ దుందుభులు మ్రోగగా , కింపురుషాదులు గానం చేస్తూ – అహో! మహాదాత బలి ధన్యుడు కదా! ఇట్టి మరెవ్వరూ చెయ్యలేరు, శత్రువని తెలిసికూడా సర్వం పోతుందని గురువు చెప్పినా వివేక నం చేశాడు.

మూడడుగుల నేలను స్వీకరించి అనంతుడైన వామనుడు ప్రేక్షకులకు అత్యద్భుత ్యలు కలిగేలా విరాడ్రూపాన్నిదాల్చాడు. భూమ్యాకాశ, దిశలూ, స్వర్లోక, పాతాళ,సాగర, క్షి, మనుష్య, దేవ, మున్యాదులూ సర్వులూ ఆ విశ్వరూపంలో ఇమిడిపోయారు ఋత్విజ , సదస్యులతోకూడ సర్వైశ్వర్యాలకూ ఏకమాత్ర శాసకుడైన పరమాత్మయొక్క ఆ రూపంలో మహాభూతాలూ, ఇంద్రియ, ఇంద్రియ విషయాలూ, అంతఃకరణ త్రిగుణమయ మా యావజ్జగత్తూ చూశారు. ఆ త్రివిక్రమదేవుని పాదతలంలో రసాతలమూ, పాదాలయందు జంఘలలో గిరులూ, జానువులలో ఖగసమూహాలూ, ఊరువులలో మరుద్గణమూ వర్తికి కనిపించాయి. పరమాత్మ వస్త్రాలలో సంధ్యయు, గుహ్యస్థానంలో ప్రజాపతులూ, లో బలితో సహా సర్వరాక్షసగణమూ, నాభిలో ఆంశమూ ఉదరంలో సమస్త మూ, వక్షఃస్థలాన తారాగణాన్ని, హృదయంలో ధర్మాన్నీ, స్తనాలలో ఋతాన్నీ, లో చంద్రుణ్ణీ వక్షఃస్థలాన కమల పాణి అయిన మహాలక్ష్మి నీ గళమందు సామ శబ్దసమూహ సర్వస్వాన్నీ బలి తిలకించాడు, బాహువులందు మహేంద్రాది సురగణా ర్ణాలయందు దిశలనూ, మస్తకమందు స్వర్గాన్నీ, కేశాలయందు మేఘాలనూ, నాసికలో నూ, నేత్రాలయందు భాస్కరునీ, ముఖమందు అగ్నిహోత్రునీ సందర్శించాడు,వాక్కులో , రసమందు వరుణుడూ కనుబొమలలో విధి నిషేధాలూ, కనురెప్పలలో అహోరాత్రులూ లో క్రోధమూ, అధరోష్ఠాలలో లోభమూ, గోచరమయ్యాయి. ఆపురుషుని స్పర్శలో కామమూ,

ందు జలమూ, పృష్టమందు అధర్మమూ పదవిన్యాసలో యజ్ఞమూ,భావములో మృత్యువూ, ందు మాయయూ, రోమాలయందు ఓషధులూ, నాడులమందు నదులూ, గోళ్ళయందు బుద్ధిలో బ్రహ్మాది సురశ్రేష్ఠులూ కనిపించారు. ఈరీతిగా బలిచక్రవర్తి భగవంతుని ద్రియాలయందు చరాచర జగత్తునంతా చూడగలిగాడు.

ఆ విశ్వరూపాన్ని దర్శించిన రాక్షసులందరి కందరూ భయభీతులయ్యారు. భగవంతుని అపూర్వ మహత్తరతేజంతో కూడిన సుదర్శనమూ, మేఘగర్జనతో సమంగా టంకారధ్వని రంగ ధనుస్సూ విశేష ధ్వని కల పాంచజన్యమూ తీవ్రతర వేగంకల కౌమోదకీగదయు,శత చిహ్నాలతో కూడిన డాలూ, విద్యాధర నామకమైన ఖడ్గమూ, అక్షయ బాణతూణీరద్వయమూ యి. లోక పాలురసమేతంగా, సునందాది శ్రీహరి పార్షదులూ, నారాయణ సేవార్థమై ఖైవున్నారు. మస్తకోపరిభాగాన మకుటమూ, బాహువులలో భుజకీర్తులూ, కర్ణాలలో కుండలాలు, వక్షఃస్థలంలో శ్రీవత్సచిహ్నమూ, గళంలో కౌస్తుభమణియూ, కటిభాగాన త్రమూ రాజిల్లుతూన్నాయి. పంచవిధ పుష్పాలతో నిర్మితమైన మధులోలుపాలగు భ్రమరా ండిన వనమాలను ధరించి ఆతడు భాసిల్లుతున్నాడు. ఆ విశ్వమూర్తి ఏకపాదంతో యావద్భూ గాన్ని. ద్వితీయ పాదంతో స్వర్గాన్ని ఆక్రమించినాడు. తృతీయపాదం వుంచడానికి బలికి శేషించలేదు. భగవద్దివ్యపాదం ఊర్ధ్వలోకాలకు వెళ్ళేవేళ మహర్లోక జనలోక, తపోలోకాలు త్యలోకాలు చేరింది.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-21

### బలిచక్రవర్తి బంధించ బడుట.

శుకమహర్షి వామనావతార ఘట్టాన్ని కొనసాగిస్తూన్నాడు – 'రాజా! వామన దేవుని సత్య లోకం చేరిన వేళ ఆ పాద నఖ కాంతులతో ఆ లోకం తేజో హీనమై పోయింది. దేవుడు సయితం ఆ కాంతులలో లయమైపోయాడు. మరీచి ఆదిగా గల తపోధనులూ, బ్రహ్మచారు లయిన సనక సనందనాదులూ పరమ యోగులనూ వెంట బెట్టుకొని ఆ మ భగవచ్చరణారవిందాలకు వందనం చేశారు. వేదోప వేద, యమ, వేదాంగ తర్క, ఇతిహాస, పురాణ, సంహితాదులు బ్రహ్మ లోకాన మంతాలై వున్నాయి. యోగ రూప ప్రచండ వాయు శక్తితో జ్ఞానాగ్నిని ప్రజ్వలితం కర్మ ఫలాన్ని భస్మం చేసుకున్న మహాత్ములు సయితం ఆ దేవ దేవుని శ్రీచరణాలకు మ్రొక్కారు. తత్కమల సదృశ పాదారవింద స్మరణ మాత్రం వల్లనే వారందరూ బ్రహ్మ పొందారు. శ్రీహరి నాభి కమలం నుండి ప్రభవించిన బ్రహ్మదేవుడు ఆ త్రివిక్రమునికి స్వాగతం పలికి అర్ఘ్య పాద్యాదులతో ప్రక్షాళన చేశాడు. పూజానంతరం అత్యంత భక్తిపరవశ్యంతో వామన దేవుని స్తుతించాడు. రాజా! బ్రహ్మ కమండలోదకమే విరాడ్రూప పాద సంస్పర్శతో పావనమై గంగగా పరిణమించింది. అంబర వీధి నుండి అదియే పృథ్విపై ప్రవాహ రూపాన్ని దాల్చినది. త్రిపథ గామిని అయిన గంగ భగవానుని మహోజ్జ్వల కీర్తి అని గ్రహించు. పరమాత్మ విశ్వరూపాన్ని ఉపసంహరించి విభూతులను సూక్ష్మీకరించిన వేళలో బ్రహ్మాది దేవతలూ అనుచర సమేతులై అత్యాదర భావంతో వామనావతారుని సేవించినారు. జలోపహార, హారాదులూ, దివ్య గంధ, అంగ రాగ, సుగంధ ధూప లాజ, ఫల పుష్పాంకురాదులతో పూజిస్తూ – భగవన్మహిమను గానం చేస్తూ జయ జయ ధ్వానాలు పలుకుతూ శంఖ, దుందుభి, వీణా వేణు, మృదంగాది మంగళ ధ్వనులతో బ్రహ్మానంద భరితులయ్యారు.

మూడడుగుల నేల దానం' అన్న పేరుతో వామనుడు త్రివిక్రముడై బలి సర్వస్వాన్నీ

్వాధీనం చేసుకోవడంతో దైత్య సమూహాలు యోచించ సాగాయి. బలి యాగదీక్షలో ఉండ శ్రీహరి
ా రీతిగా చేశాడు. మన ప్రభువు యిప్పుడేమీ మాటలాడలేదు. ఈ వామనుడు విప్రుడు కాడు.
హా మాయావి అయిన శ్రీహరి. అమరుల క్షేమార్థం యీ వేషం వేశాడు. యాగదీక్షలో వున్న
న ప్రభువు ఎవరినీ దండించడని తెలిసియే నారాయణుడు యీ బ్రహ్మచారి రూపాన యాచించి
ంతరం — అన్నింటినీ స్వవశం చేసుకున్నాడు. సత్యవ్రత నిష్ఠుడూ, దానవేంద్రుడూ అయిన
ే ఏలిక యాగదీక్షా సమయంలో విశేషించి సత్యాన్ని పాలిస్తున్నాడు. విప్ర సేవా పరాయ
ూ, దయాశీలీ అయిన మన చక్రవర్తి ఎట్టి దశలోనూ అబద్ధ మాడడు. ఈ సమయంలో
ి మీ శత్రువును అంతంచేసి మన నాయకునికి మేలు చేకూర్చాలి.' అని వారు పరస్పరం
చించుకుంటూ ఆయుధ పాణులై — బలి అభిమతానికి వ్యతిరేకమే అయినా వామనుని మీదకు
ారు. ఆ దానవుల ప్రయత్నాలను చూసిన హరి పార్షదులు నవ్వుతూ నిజాయుధాలతో ఆ
వ సేనలను ఎదిరించారు. నంద, సునంద జయ, విజయ, బల, ప్రబల, కుముద, కుముదాక్ష,
్వక్సేన, గరుడ, జయంత, శ్రుత దేవత, పుష్పదంత, సాత్వతాది హరి పార్షదు లందరి
రూ — దశ సహస్ర గజ బలోపేతులే. వారందరూ దైవానుగ్రహం కలవారు కావడం వల్ల
యాసంగా రాక్షసులను అంతం చెయ్య సాగారు. అది చూసి బలి క్రుద్ధుడై, యుద్ధ సన్న
కూడ ఆచార్య శుక్రుల శాపానుసారం — యుద్ధ ప్రయత్నం విరమించి అసురులను కూడ
్రయత్నం నుండి విరమింప జేశాడు. విప్రచిత్తి, రాహు, నేమి, ఆదిగాగల దానవులను పిలిచి
క్రవర్తి — 'సేనాధిపులారా! నా పలుకు లాలకించి యుద్ధం చేయక మరలి రండి. కాలం
ుడు మనకు వ్యతిరేకంగా వుంది. కాలమే సర్వులకూ సుఖ దుఃఖాలను కలిగింపజేస్తుంది.
త్నం వల్ల విజేతలమైనామని భావించడం శ్రేయోదాయకం కాదు, మనలో ఏదీ లేదు.
తి, సామంత, మంత్ర, బల, దుర్గ, సామాదులలో దేనివల్లా కాని వన్నీ కాలం సహకరిస్తే
ారుతాయి. ఆ కాలశక్తియే ఒకనాడు అమరుల పతనానికీ, మన ఔన్నత్యానికీ సహక
ది. అదియే యిప్పుడు మన పతనానికీ, అమరుల విజయానికీ కారణంగా నిలచింది. విధి
అనుకూలించిన ఎన్నో కాలాల్లో మీరు హరి పార్షదులను జయించ గలిగారు. కానీ వారే
మనలను జయించి సింహనాదాలు చేస్తున్నారు. విధియే అనుకూలంగా వుంటే మనమే
ము కాగలము. అంతవరకూ మనం నిరీక్షించవలసినదే.' అన్నాడు.

ఉపర్యుక్త రీతిని తమ చక్రవర్తి పలుకగా దానవ సేనాధిపతు లందరూ రసాతలానికి
యారు. అనంతరం గరుడుడ శ్రీహరి ఆదేశానుసారం బలిని వరుణ పాశాలతో బంధించి
. తత్సమయంలో సర్వులూ హాహాకారాలు చేశారు. ఆ దశలో కూడ ఆ మహాదాత దృఢ
తోనే వుండిపోయాడు. ఆ దాతను అందరి కందరూ వేనోళ్ళ కీర్తించారు. తత్సమయంలో
బలితో అంటాడు. — 'దానవాగ్రణీ! నువ్వు నాకు దానంగా యిచ్చినది మూడడుగుల
గాత్రమే. విశ్వమంతా నా పద ద్వయమే అయింది. తృతీయ పాదాన్ని ఎక్కడుంచి ఎలా
? సూర్య, చంద్ర, నక్షత్ర కిరణ జాలం వ్యాపించినంతవరకూ మేఘాలు వర్షించునంత
గా యీ భూతలమంతా నీ అధీనంలోనే వుంటుంది. నువ్వు పరిశీలిస్తూండగానే నేను భూత
ఏక పాదంతోనూ, దిశావృతాకాశాన్ని శరీరంతోనూ, ద్వితీయ పాదంతో స్వర్గలోక స
ఆక్రమించుకోవడం వల్ల నీ సర్వస్వం మదీయాధీనమై పోయింది. అయినా వాగ్దానాన్ని
వి కారణంగా నీకు నరకాలే లభిస్తాయి. నీ ఆచార్యునికి యిది సమ్మతమే. ఇక నువ్వు నర
ప్రవేశించు. యాచకునకు ఇస్తానని వాగ్దానం చేసి విఫలుడైనవాడూ, మోసగించినవాడూ
భీష్టాలను నెరవేర్చుకోలేడు. ఇట్టి వానికి స్వర్గవాస విషయమెలా వుస్నా నరకం
. మహా ధనవంతుడ నన్న గర్వం నీకున్నది. 'ఇస్తాను.' అని మాట యిచ్చి నువ్వు
మోసగించావు. ఈ పాప ఫలంగా నువ్వు కొన్ని సంవత్సరాల పాటు నరకాన్ని అనుభ
అన్నాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–8 అధ్యాయం–22

శుకమహర్షి — 'రాజా! ఆ రీతిగా వామనమూర్తి బలిని తిరస్కరించి — అతణ్ణి ధర్మ
చెయ్యాలని ప్రయత్నించినా ఆ దానవనాథుడు చలించకుండ పలుకు తూన్నాడు —
వతారాధ్యా! పావన యశస్సంపన్నా! నువ్వు నా పలుకులను అనృతంగా భావిస్తా
? అలా ఎన్నడూ భావించకు వాగ్దానాన్ని నేను నిలబెట్టుకుంటాను దయచేసి మోసపోయా

ఇక నీ తృతీయ పాదాన్ని నా మస్తకం మీద వుంచు. రాజ్యభ్రష్టుడ నవుతానని, నరకంలో పడతానని నేను భీతి చెందను. అపార దుఃఖాలు కలిగినా, పాశ బద్ధుడనైనా, నా దగ్గర చిల్లి గవ్వ లేకపోయినా, నువ్వు నాకు ఘోర శిక్ష విధించినా, నేను భయపడను. కేవలం అపకీర్తికి మాత్రమే నేను భీతి చెందుతాను. మా గురుదేవులు నా కిచ్చిన దండన నాకు సమ్మతమైనదే, పరవశులైన మాతా పితరులూ సోదర బాంధవులూ యిట్టి దండన నీయలేరు. ప్రచ్ఛన్న రూపంలో నువ్వు మా వంశానికి చక్కని పాఠం నేర్పావు. కనుక నువ్వు మాకు పరమాచార్య వైనావు. ధన, కుల, బల, మద గర్వంతో మేమున్న వేళల్లో నువ్వు సర్వస్వాన్నీ హరించి మాకళ్ళు తెరిపిస్తూనే వున్నావు. మావల్ల నీకు కలిగే వుపకారం ఏమున్నది? పరమ యోగులు అనన్యాయుక్త భక్తితో పొందే సిద్ధినే వైర భావంతో మాలోని అసుర శ్రేష్ఠులూ పొంద గలిగారు. నిగ్రహాను గ్రహ సమర్థమైన నీ అనంత శక్తి, అపార లీలా వైభవాలు వర్ణించ గలవా రెవరు? అట్టి నువ్వు కనుకనే దేవా! నువ్వు నాకీ దండన విధించి వరుణ పాశ బద్ధుని చేయ గలిగావు. ఇందు వల్ల నేను వ్యథనూ, సిగ్గునూ కూడ పొందడం లేదు. విశ్వ విఖ్యాత పవిత్ర కీర్తనీయుడైన మా పితామహుడు ప్రహ్లాదుడు నీకు పరమ భక్తుడు. ఆతని తండ్రి హిరణ్యకశ్యపుడు నీతో బద్ధ వైరం పూనినా, మా తాతకు ఎన్నో కష్టాలు కలిగించినా ఆయన మీ పట్ల భక్తి పోలేదు. ఈ దేహం ఏనాడో ఓనాడు రాలిపోవలసిందే. హరి సేవ కాక యీ దేహ ధారికి ప్రయోజన మేమున్నది?' అని నిశ్చయించుకున్నాడు. మా పితామహుడు. దార పుత్రాదులు ధన సంపదలను దోచుకుపోవడానికే ప్రాప్తిస్తారు. అట్టి చోరులవల్ల ప్రయోజన మేమి? వారందరి కందరూ ప్రాణుల్ని సంసార చక్రంలో పడద్రోయడానికే వుపయోగిస్తారు. మానవ మాత్రునికి మరణమే తథ్యం. దార, పుత్ర, ధనాదులయందు ఆసక్తి వర్ధిల జేసుకోవడం దేనికి? — అన్న నిశ్చయంతో ప్రహ్లాదస్వామి — నువ్వు రాక్షస వంశ నాశకుడవని తెలిసి కూడ అభయ ప్రదాతైన నీ దివ్య చరణారవిందాలనే శరణు వేడాడు. ఆయన సామాన్యుడా? సంత శిరోమణి, ఉదార స్వభావుడు, అగాధ బోధ సంపన్నుడు. పైగా పరమ విరక్తుడు కావడం వల్ల తదనుకూలంగానే ప్రవర్తించాడు. కానీ మాకు నువ్వు పరమ శత్రుడవే! విధి బలవత్తరమై ఐశ్వర్య, రాజ్య లక్ష్ముల నుండి నన్ను వేరుచేసి నీసన్నిధికి చేర్చాడు. అదీ మంచికే వచ్చింది. లక్ష్మి సంపన్నుడు జడుడై మృత్యు ముఖంలో వున్నానని గ్రహించజాలక యీ దేహం శాశ్వతమని భావిస్తాడు.' అన్నాడు.

రాజా! బలి అలా భాషిస్తూండగానే భాగవతోత్తముడైన ప్రహ్లాదుడు అక్కడకు వచ్చిన
సమ సుందర కోమల నయనాలతో, ఆజాను బాహువులతో, ఉన్నత శ్యామల దేహంపై
బరాన్ని ధరించిన తన పితామహుని దర్శించాడు. కానీ వరుణ పాశబద్ధుడై యుండడం వల్ల
తణ్ణి ఆదిలో వలె పూజించలేకపోయాడు. అతని కనుల నుండి ధారలు ప్రవహిస్తూన్నాయి.
అతడు నతమస్తకు డయ్యాడు. భక్తవత్సలుడైన తన స్వామి అక్కడే వుండడం వల
ప్రహ్లాదుని శరీరం పులకించింది, అతని నయనాల నుండి ఆనంద బాష్పాలు జల జల
ు. హృదయం ఆనంద భరితం కాగా రుద్ధమైన కంఠంతో అతడు శిరసు వంచి పృథ్వీపై
సాష్టాంగ ప్రణామం చేశాడు. అనంతరం అతడు పలక సాగాడు — 'స్వామీ! ఈ బలికి
ంద్ర పదవిని ప్రసాదించినది నీవే. పునః దానిని హరించినదీ నీవే. ఆత్మను మోహింప
ట్టి రాజ్యలక్ష్మిని హరించడం వల్ల నువ్వు బలిపై అపార అవ్యాజానురాగాన్నే ప్రదర్శిం
రాజ్యలక్ష్మీ మదోన్మత్తుడైనవాడు ఎట్టి విద్వాంసుడైనా మోహ పరవశుడు కాక తప్పదు.
పరవశునికి స్వస్వరూప స్థితి కలిగేదెట్లు? అందుకే అతణ్ణి రాజ్య భ్రష్టుణ్ణి చేసి
పకారమే చేశావు ప్రభూ! జగదీశ్వరుడవూ, సర్వ హృదయాంతర్వర్తివీ, సార్వ సాక్షివీ,
నీకివే మా ప్రణామాలు.' అన్నాడు.

వామన మూర్తితో భాషిస్తూన్నంతసేపూ ప్రహ్లాద మూర్తి బద్ధాంజలియై వున్నాడు.
ం. భగవత్ సన్నిధిలో నిలచిన బ్రహ్మదేవుడు పరమాత్మతో ఏదో చెప్పాలని అను
్నాడు. అంతలోనే మహా సాధ్వి, బలిచక్రవర్తి అర్ధాంగి అయిన వింధ్యావళీదేవి —
ు తన భర్తను తిలకించి భయభీతయై వామనావతారుని చరణ రాజీవాలకు ప్రణమిల్లి
హస్తయై పలుక సాగింది — 'వినోదార్థమే విశ్వాన్ని సృజించిన నువ్వు సర్వోత్కృ
గ్రహించజాలక మందాత్ములు — తామే జగదీశ్వరులమని భావిస్తూంటారు. వాస్తవానికి
భర్తవూ, సంహర్తవూ సర్వానివీ నీవే. అట్టి దశలో మాయా మోహితులై కర్తల
ీవారు నీకేమి సమర్పించ గలరు?' అంది.

అంత బ్రహ్మ పలుకుతూన్నాడు:— 'సర్వ ప్రాణి జీవనదాతా! సర్వ భూతేశ్వరా!
దేవా! ప్రభూ! నువ్విప్పుడే బలిని విడిచిపెట్టు' ఈతని సర్వాన్నీ హరించినావు. ఇక
దండించ బనిలేదు. ఈ మహోదాత యావద్రాజ్యాన్నీ, పుణ్య కర్మార్జితాలైన తనకు

ంచిన లోకాలనూ, చివరకు స్వాత్మనూ కూడ నీకు సమర్పించినాడు. అయినా ధైర్యంగా
నం కాకుండ వున్నాడు. జనార్దనా! సత్య హృదయంతో నీ పాద కమలాలయందు అర్ఘ్యం
ర్పినట్టివాడు, కేవలం దూర్వాదళాలతో నిన్ను అర్చించు నట్టివాడు కూడ సద్గతిని పొందుతాడు
దశలో ప్రసన్నంగా స్థిర చిత్తంతో జగత్త్రయాన్నే నీకు సమర్పించిన యీ బలిచక్రవర్తి
ం భాగస్వామి అయ్యేదెట్లు' అనగా వామన మూర్తి – 'వత్సా! నాకు పరిపూర్ణానుగ్రహం
గని సర్వస్వాన్నీ హరించి వేస్తాను. కారణం? మానవుడు ధన మద గర్వితుడై నా భక్తు
హేళనచేస్తూ నన్నే విస్మరిస్తాడు. కర్మలు కారణంగా మానవులు అసంఖ్యాక యోనులలో
, మరణాలు పొందుతూ వుంటారు. నా విశేషానుగ్రహ ఫలంగానే నరజన్మ లభిస్తుంది. ఈ
వ దేహాన్ని పొంది సంపత్కుల ధన యౌవ్వన సౌభాగ్య గర్వ పర్వతాధి రూఢుడై
ుడు కానివాడైతే – అట్టి వాడు నా విశేషానుగ్రహానికి పాత్రుడు కాగలుగుతాడు. దైత్య
సమూహ సర్వంలోనూ బలిచక్రవర్తి అగ్రగణ్యుడే కాదు, ఆయా వంశాల కీర్తిని వర్ధిల
ం. అతీతమైన మాయను సయితం జయించ గలిగినవాడు. దుఃఖితుడై కూడ మోహితుడు
గడు కావడం నువ్వే తిలకించావు గదా! ధనమా పోయింది. రాజ్యమా? అపహరింపబడింది.
విధాల అవమానితు డయ్యాడు. శత్రు బంధితు డైనాడు. బంధు, బాంధవ సోదరు
హ విడనాడి దూరంగా వెళ్ళిపోయారు. క్రుద్ధుడై కుల గురువైన ఆచార్య శుక్రుడు నిందించి
ాడు. అయినా బలి చలించలేదు. నేను కూడ కష్టం కలిగేలా భాషించాను. విరుద్ధ ధర్మాలను
ంగా వుపదేశించినా యితడు స్వధర్మ పతనుడు కాలేదు. అందులకే అమరులకు సయితం
్యమైన వున్నత స్థానాన్ని యీతనికి ప్రసాదించాను. నాకు పరమభక్తుడైన యీ బలియే
మన్వంతరంలో మహేంద్రు డవుతాడు. అంతవరకూ సుతలమందుంటాడు. అక్కడి
రూ నా కృపకు పాత్రులవుతూనే వుంటారు. కనుకనే వారిని ఆధి, వ్యాధు లేవీ పీడించ
. వారికి అలసట, సోమరితనం–ఆదిగా గల వేవీ వుండవు. వారు బాహ్యాభ్యంతర్గత శత్రు
జయించ గలుగుతారు. ఎట్టి విఘ్నాలూ వారికి కలుగవు." అంటూ బ్రహ్మతో పలికి శ్రీహరి
న్నాడు :–

'బలీ! నీకు శుభమగును గాక! నీకు శుభ మగును గాక! అమరధామ వాసులు కూడ
కునట్టి సుతలానికి పరివార సహితంగా నువ్వు వెళ్ళు. మహేంద్రాది లోకపాలురు సయితం

రజాలనట్టి నిన్ను జయించ గలవా రెవరు? దైత్య, దానవులలో ఎవరైనా సరే నీ ఆదేశాల్లంఘిస్తే వారిని నా సుదర్శనం ఖండ, ఖండలు చేస్తుంది. నీ భోగ సామగ్రి సమేతంగా, అనుసహచర సమేతుడవైన నిన్ను స్వయంగా నేనే సంరక్షిస్తూ వుంటాను. సమస్తమైన లమండీ నేను కాపాడుతూనే వుంటాను. దానవ నాథా! మహాదాతా! నువ్వు సర్వదా నన్ను సంలోనే సందర్శించ గలుగుతావు. రజో గుణ గణ సంపర్కం వల్ల నీతో ప్రవేశించిన గావం మదీయ ప్రభావం వల్ల శీఘ్రంగా నాశనమైపోతుంది.'

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-23

### బంధన విముక్తుడైన బలిచక్రవర్తి సుతలం చేరుట.

మహర్షి పలుకుతూన్నాడు—'పరీక్షిన్నరపాలా! త్రివిక్రమ భగవానుడావిధంగా భాషించగా ర్తి నయనాల నుండి ఆనంద బాష్పాలు జలజల రాలాయి. అతని కంఠం రుద్ధం కాగా ద్ధాంజలియై — 'ప్రభూ! నీకు నేను సంపూర్ణ వందనం కూడా చెయ్యలేదు. నమస్కారం మాత్రమే చేశాను. అంత మాత్రానికే లోక పాలురకు సయితం అభ్యం కాని అపరిమిత దయను నాపై వర్షింప జేశావు.' అంటూండగానే అతడు వరుణ పాశ బంధదయ్యాడు. వెంటనే అతడు శంకర బ్రహ్మలకు ప్రణమిల్లి ఆనందంగా అసుర గణాతలానికి వెళ్ళిపోయాడు. ఆ రీతిగా వామన మూర్తి — దానవేంద్రుడైన బలి నుండిన స్వర్గ రాజ్యాన్ని పునః ఇంద్రున కిచ్చి — అతని మనోరథాన్ని నెరవేర్చడం వల్లడై యావద్విశ్వాన్నీ శాసించాడు. తన పౌత్రుడు బంధ విముక్తుడు కావడం చూసి భక్తి భావంతో భగవంతుణ్ణి స్తుతించ సాగాడు — 'స్వామీ! జనార్దనా! శంకర, లక్ష్మీ దేవ్యాదులు గాక నీ దయను పొందగలవా రెవరు? జగత్పూజ్యులయిన బ్రహ్మాదులు చారవిందాలకు ప్రణామా లర్పిస్తూ వుంటారో? అట్టి జగద్వంద్యుడే మా అసురుల

ాలుడై సంరక్షకు డయ్యాడు. ఆర్త త్రాణ పరాయణా! ఆదినారాయణా! నీ శ్రీచరణ రాజీవ
ిదాస్వాదన చేయగలగడం వల్లనే బ్రహ్మాదులు అనేక విభూతులనూ, సృష్టి రచనాది శక్తు
పొందగలిగారు. జన్మతః దుష్టులమైన మేము అసురులము. దుర్మార్గ ప్రవర్తకులమైన
ందు కూడ అవ్యాజమైన అనుగ్రహముంచి మాకు ద్వారపాలకుడవైనావు. నిజ యోగ
శక్తితో నువ్వు జగత్త్రయాన్ని సృజించినావు. సర్వజ్ఞుడవై, సర్వాత్ముడవైన, సమ
నీ లీలలు ఊహాతీతాలే కాదు, అత్యద్భుతాలు కూడ, కల్పతరు సమమైన నీ స్వభావం
భక్తులయందు అనిర్వచనీయ వాత్సల్యాన్ని చూపుతూ వుంటావు. కనుకనే నీలో భక్తుల
పక్షపాతమూ, భక్తి హీనులయందు విముఖత్వమూ గోచరమవుతూ వుంటుంది.'

ప్రహ్లాదుని పలుకు లాలకించి వామన మూర్తి "ప్రహ్లాదా! నీకు శుభమగును గాక!
కూడ నీ పౌత్రునితో సుతలానికి వెళ్ళి ఆనందిస్తూ నీ వారందరికీ ఆనందాన్ని కలిగించు.
నువ్వు నన్ను నిత్యం గదా పాణిగా దర్శించ గలవు. నా దర్శన రూపమానంద మగ్న
వడం వల్ల భవదీయ కర్మ బంధ సర్వస్వం పటాపంచల మవుతుంది.'

వామనదేవుని ఆదేశానుసారం ప్రహ్లాదుడు బలిచక్రవర్తితో సహా ఆ దేవదేవునకు ప్రద
క్షణామాలాచరించి సుతలానికి పయనమయ్యాడు. అప్పుడు వామనుడు బ్రహ్మవాదుల
తన సన్నిధిలో ఆసీనుడై కూర్చున్న ఆచార్య శుక్రునితో – 'శుక్రాచార్యా! మీ శిష్యుని
శేషాన్ని పరిపూర్ణం చెయ్యండి. కర్మ లోపం కలిగితే అది బ్రాహ్మణుల కరుణారస
మాత్రంచే పరిపూర్ణ మవుతుంది. అన విని శుక్రాచార్యుడు పలుకుతూన్నాడు – 'దేవా!
స్వ కర్మలనూ, తత్ఫలాలనూ నీకు సమర్పించి యజ్ఞ మూర్తివైన నిన్ను పరిపూర్ణ
ని చేసి ఆరాధించాడు. ఇక కర్మలోప మేముంటుంది. మన్త్ర అనుష్ఠాన, దేశ, కాల,
వస్తువు లన్నింటి లోపం నీ నామ సంకీర్తన మాత్రం చేతనే పరిపూర్ణ మవుతుంది. సర్వ
నూ రూపుమాపి నీ దివ్య నామస్మరణ కర్మ ఫలాన్ని పరిపూర్ణంగా అందిస్తుంది. అయినా
శానుసారం చేస్తాను. నీ ఆజ్ఞను పాలించడమే మానవ మాత్రులకు సర్వ మంగళాలను
స్తుంది. అని పలికి ఆచార్య శుక్రుడు ఋత్విజుల సహకారంతో బలి ఆరంభించిన
న్ని పూర్తిచేశాడు. రాజా! ఈ రీతిగా శత్రు హస్తగతమైన స్వర్గ రాజ్యాన్ని బలిచక్రవర్తి

గహించి పునః మహేంద్రునకు యిచ్చాడు. అంత బ్రహ్మదేవుడు దేవర్షి, పితర, మను, భృగు, అంగిర, సనత్కుమార, శంకరాదులతో కూడిన అదితి కశ్యపుల ప్రసన్నత ర్వజీవాభ్యుదయానికి సర్వలోక పాలనపై అధీశ్వరుడైన వామనమూర్తిని అభిషేకిం ద, దేవ, ధర్మ, యశోలక్ష్మి, మంగళవ్రత, స్వర్గాపవర్గాల సంరక్షకుడుగా సర్వజీవ ం వామనునకు ఉపేంద్ర పదవినిచ్చారు. అప్పుడు సర్వులూ బ్రహ్మానందం చెందారు. ని ఆదేశానుసారం లోకపాల సమేతుడైన మహేంద్రుడు ఉపేంద్రుడైన వామన విమానంపై కూర్చోబెట్టుకుని స్వర్గానికి తీసుకుపోయాడు. ఇంద్రునకు త్రైలోక్య మే గాక శ్రీహరి దేవుని సంరక్షణ కూడ లభించింది. దానితో అతడు స్వర్గ రాజ్యలక్ష్మి నిర్భయంగా ఆనందోత్సవాలు చేసుకున్నాడు. శంకర, బ్రహ్మ, సనత్కుమార మహర్షులూ, పితరులూ, యావద్భూత కోటీ, సిద్ధ చారణాదులూ, కూడ భగవంతుని ్త కార్యాన్ని ప్రశంసిస్తూ హరి లీలను గానం చేస్తూ స్వస్థానాలకు ప్రస్థానించారు.

రీక్షిన్నరపాలా! నీకు పరమ పావనమైన వామనావతార గాథను వినిపించాను. అచ్యు అనంతాలు, మహిమలు అపారాలు, ఆ లీలలను గణించాలనుకోవడమంటే - భూమి కణాలను లెక్కపెట్టా లనుకోవడం వంటిదే. భగవన్మహిమను సంపూర్ణంగా గ్రహిం లేము. ముందు వుండబోదు, ఈ విషయాన్ని మన్త్రద్రష్టయైన వశిష్ఠ మహర్షి ఘోషించాడు. ... దేవతారాధ్యుడూ, అద్భుత లీలాధారీ, అయిన వామనుని లీలావ ... పరమ పదాన్ని అందుకుంటాడు. సుర, నర, పితృ యాగ వేళల్లో ... పఠిస్తే ఆ కర్మలు సఫలాలై సంపూర్ణ ఫలాల నిస్తాయి. ఇది వేదజ్ఞుల ముము.'

—0—

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం-8 అధ్యాయం-21

### మత్స్యావతారము.

పరీక్షిత్తు ప్రశ్నిస్తూ— 'శుకమునీంద్రా! శ్రీహరి మత్స్యావతారుడై ప్రదర్శించిన లీలలను ంచాలనుకుంటున్నాను. తమోగుణ ప్రధానమూ, పరతంత్రమూ, అయిన మత్స్య యోని ము పరమాత్మ ఎందుల కవతరించాడు? సత్పురుష సంస్తవనీయమైన ఆ గాథను వర్ణించి గోరు తున్నాను.' అని అర్థించగా శుకమహర్షి పలుకుతున్నాడు:— 'ఏకమాత్ర ప్రభు పరమాత్మ గో, బ్రాహ్మణ, వేద, దేవ, ధర్మ, సాధు, అర్థాలను సంరక్షించడానికై అనేక లతో ప్రాదుర్భవిస్తూ వుంటాడు. సర్వ శక్తి సంపన్నుడైన పరమాత్మ వాయువులా అనేక లతో సర్వులయందు అంతర్యామి రూపాన వుండి లీలలు ప్రదర్శిస్తూ వుంటాడు. కానీ బుద్ధిగత గుణానుసారం పరిణామం చెందదు. ప్రాకృత గుణాతీతుడైన శ్రీహరియందు ది మేముంటుంది? పూర్వ కల్పాంతంలో బ్రహ్మ నిద్రాగతుడై వుండగా 'బ్రాహ్మ' పేరు గల నైమిత్తిక ప్రళయం ఏర్పడింది. తత్సమయంలో పృథివ్యాది లోకాలన్నీ ంలో మునిగిపోతాయి. ప్రళయవేళ సమీపించడంతో బ్రహ్మ నిద్రావస్థకు గురి అయ్యాడు. నుని నిద్రావస్థలో వేదాలు ఆయన వదన కమలం నుండి బహిర్ముఖ మవుతూంటాయి, పంలోనే వున్న అతి బలశాలి అయిన హయగ్రీవ నామక దానవుడు ఆ వేదాలను రించుకు పోయాడు. భగవానుడు హయగ్రీవ దానవుని నుండి శ్రుతులను రక్షించ మత్స్య మెత్తాడు ఆ కాలంలో భగవద్భక్తుడూ, భగవానునికి అత్యంత ప్రియుడూ అయిన సత్య డనే మహారాజు కేవలం వుదకాలను పానం చేస్తూ తపస్సు చేస్తున్నాడు. అతడే యీ వరాహ కల్పంలో సూర్య కుమారుడైన శ్రాద్ధ దేవ నామ విఖ్యాతు డయ్యాడు. శ్రీహరి విశేషానుగ్రహం వల్ల యిప్పుడు వైవస్వత నామక మనువయ్యాడు. ఓనాడు ఆ రాజర్షి మాలా నదీతీరంలో జల తర్పణం చేసే సమయంలో అతని దోసిలిలో చిన్న చేపపిల్ల ంది. దానిని ఆ మహారాజు మరల నదిలో విడిచేశాడు. వెంటనే ఆ చేపపిల్ల మనుష్య

దీనంగా పలికింది — 'రాజా ! జలచరాలు చిన్నదాననైన నన్ను భక్షించి వేస్తాయని తెలిసి నువ్వు నన్ను జలాల ఎందుకు విడిచివేశావు ? నువ్వు రక్షిస్తావని భయ భీతనై నేను నీ చేరాను.' అంది.

తనను అనుగ్రహించడానికి పరమాత్మయే మత్స్య రూపంలో వచ్చాడని గ్రహించ సత్యవ్రత మహారాజు ఆ మత్స్యాన్ని సంరక్షించాలని సంకల్పించి తన కమండలంలో ఆశ్రమానికి తీసుకు వెళ్ళాడు. ఏకారాత్ర కాలంలో ఆ చేప పిల్ల కమండలం చాలనంత పెరిగిపోయింది. అప్పుడా మత్స్య శాబకం అందుకుని — 'రాజా! నేను అతి కష్టం మీద యా కమండలంలో వుండలేకపోతున్నాను. ఉచితమైన స్థానాన్ని చూపించు.' అనగా సత్య దానిని ఓ నీటిగుంటలో వుంచాడు. అత డలా చూస్తూండగానే అది రెండు ఘడియల హస్తత్రయ ప్రమాణంలో పెరిగిపోయి — రాజా! నా కిదీ సుఖంగా లేదు. సుఖప్రద శాల స్థానంలో నన్ను ప్రవేశ పెట్టు.' అని అర్థించగా సత్య వ్రతుడు దానిని ఓ పెద్ద ంలో వుంచాడు. శీఘ్ర మే క్షణకాలంలో ఆ సరోవరాన్ని ఆక్రమించే దేహంతో పెరిగి అది— యీ తటాకం కూడ నాకు సరిపోవడం లేదు. ఏదైనా పెద్ద సరోవరంలో ఉంచు.' అని సత్యవ్రతుడు ఆ మత్స్య భగవానుని అనేక మహా సరోవరాలలో త్రిప్పి చిట్ట చివరకు సాగరంలో వుంచాడు. తత్సమయాన మత్స్య మూర్తి అయిన శ్రీ హరి సత్యవ్రతునితో — 'రాజా! సత్యవ్రతా! మహా సాగరంలో భయంకర మకరా లుంటాయి. అందు సముద్రంలో విడిచిపెట్టకు.' అన్న పలుకు లాలకించి మాయా మోహితుడైన సత్య — 'మత్స్య రూపాన్ని దాల్చి నన్ను మోహింపజేస్తూన్న నువ్వెవరవు? ఏక దివసంలో శన విస్తీర్ణమైన సరోవరాన్ని ఆక్రమించే మత్స్యాన్ని మేము చూడలేదు. పైగా విన డ. సర్వ శక్తిమంతుడవూ, సర్వాంతర్యామివీ, అవినాశనుడవూ అయిన శ్రీహరివి సర్వులనూ సంరక్షించే సంకల్పంతో నువ్వు యీ జలచర మత్స్య రూపాన అవతరించి రుషోత్తమా! సృష్టి, స్థితి, లయ కారకుడవైన నీకు ప్రణమిల్లు తూన్నాను. ప్రభూ! శ భక్త జనావళికి ఆత్మ రూపుడవూ ఆశ్రయమైన వాడవూ కూడా నువ్వే. నీ లీలావతారా ర్వులకూ అభ్యుదయాన్నే ప్రసాదిస్తాయి. అయినా యిప్పుడీ రూపాన్ని ఎందుకు వో తెలుసుకో గోరుతూన్నాము. కమలనయనా! శరీరాది అనాత్మ వస్తువులయందు

భావంతో చరించునట్టి వారిని ఆశ్రయించడం వల్ల జీవితం వ్యర్థమే అయిపోతుంది. యందూ విశేష, అవ్యాజానురాగం కలిగిన పరమ ప్రియతముడవూ ఆత్మ స్వరూపుడవూ భవదీయాశ్రయం వృథా కాదు. నువ్వు దర్శన మిచ్చిన యీ మహా దివ్య మత్స్యరూపం అత్యద్భుతంగా గోచరమవుతూన్నది. రాజా! భక్తులపై భగవంతుడు అపార ప్రేమను జేస్తూంటాడు.

'సత్యవ్రతా! నేటికి ఏడవనాడు పృథివ్యాది జగత్రయాలు ప్రళయ పయోధిలో మునిగి ు. అప్పుడు నా ప్రేరణవల్ల నీ చెంతకు ఓ పెద్ద నౌక వస్తుంది. నువ్వా సమయంలో ప్రాణుల సూక్ష్మ శరీరాలనూ గైకొని, సప్తర్షులతో ఆ నౌక నధిరోహించు. అల్పా నల్ప హితంగా బీజ ధాన్యాదు లన్నింటినీ నీ వెంట వుంచుకో. తత్సమయంలో భయంకరమైన ఏకైక మహా సాగరం మాత్రమే వుంటుంది. మహర్షుల ప్రకాశమే వుంటుంది. నువ్వా ం యొక్క సహకారంతో ఆ మహా నౌకయందు నలుమూలలా విహరిస్తూ వుండు. మహా రమైన ప్రచండ వాయువుతో ఆ నావ అటూ యిటూ కొట్టబడుతూండగా నేను తత్సమ యీ మహా మీన రూపంతోనే వస్తాను. అప్పుడు మీరంతా వాసుకిని త్రాడుగా చేసి ఆ నా కొమ్ముకు బంధించండి. బ్రహ్మ రాత్రి సమాప్తమై తిరిగి సృష్టి కాలం ఆరంభమయే మహర్షి సమేతుడవైన నిన్ను యీ నావయందు కాపాడుతూ ప్రళయ సాగరంలో నలు ా త్రిప్పుతూ వుంటాను. తత్సమయంలో నువ్వు నన్ను ప్రశ్నిస్తూ వుంటాను. తత్సమ నువ్వు నన్ను ప్రశ్నిస్తూ వుంచే నీ ప్రశ్న లన్నింటికీ సమాధాన పూర్వకంగా ఉపదే యిస్తూంటాను. మదీయానుగ్రహం వల్ల నా యదార్థ మహిమలు నీకు తెలుస్తాయి. తద్వారా హ్మానందానుభూతి కలుగుతుంది. ఆ పై అన్నీ నీకే తెలుస్తాయి.' అని పలికి శ్రీహరి నమై పోయాడు.

తరువాత సత్యవ్రతుడు దైవానుసారం తత్సమయానికై నిరీక్షించ సాగాడు. పూర్వా దర్భలను పరచి వాటిపై పూర్వోత్తర ముఖంగా కూర్చుని మత్స్య మూర్తిని ధ్యానిస్తూ , ఇంతలో ఆ సమయం వచ్చింది. సాగరుడు హద్దులు దాటి వర్ధిల్ల సాగాడు. ప్రళయ ఘాలు భయంకరంగా వర్షించ సాగాయి. చూస్తూండగానే భూమండలమంతా సాగరంలో ో సాగింది. మత్స్యావతారుని ఆదేశాన్ని స్మరిస్తూన్న సత్యవ్రతుని దగ్గరకు దైవ ప్రేరిత

౨ాక వచ్చింది. సర్వ విధ ధాన్య బీజాదులతో సత్యవ్రతుడు సప్తర్షులను వెంటబెట్టుకుని ఆ
క్కాడు. మహర్షులు వాత్సల్య ప్రేమలతో సత్యవ్రతుని తిలకించి — "రాజా! నువ్వా భగ
ధ్యానించు. ఈ విపత్సాగరం నుండి అతడే మనలను రక్షించి శుభాలను చేకూరుస్తాడు."
).

సప్తర్షుల ఆదేశానుసారం సత్యవ్రతుడు మత్స్యమూర్తిని ధ్యానించాడు. అదే సమయంలో
స్ఫటలు కలిగి చతుర్లక్ష యోజన విశాలమైన దేహంతో, దానికి గల శృంగంతో మత్స్య
ఆ ప్రళయ జలంలో దర్శన మయ్యాడు. భగవదాదేశానుసారం సప్తర్షుల సహకారంతో
ద్వారా ఆ నౌకను మీన శృంగానికి బంధించి మీనావతారుడైన శ్రీమన్నారాయణ భగవా
లా స్తుతించ సాగాడు. — "అనాదియైన అవిద్యచే ఆవృతమై సంసారుల జ్ఞానం ఉండ
వారు అనేక యాతనలకు గురి అవుతూన్నారు. వారిపై నీ అవ్యాజానుగ్రహం కలుగు
వారు నిన్ను శరణు వేడ గలుగుతారు. యదార్థానికి బంధన విముక్తి కలిగించి మోక్షాన్ని
గారికి ప్రసాదిస్తూ వుంటావు పరమ గురుడవు నీవే అయి వున్నావు. అజ్ఞానియైన వాడు
ద్ధుడై సుఖాన్ని వాంఛిస్తూ దుఃఖాలను కలిగించే కర్మ లాచరిస్తూ వుంటాడు. అయ్యజ్ఞాన
శనం కావాలంటే నిన్నే సేవించి నీ దయకు పాత్రులు కావాలి. అట్టి సర్వ శక్తి సంపన్నా!
ా హృదయ గ్రంథిని విచ్ఛిన్నం చేసి నన్ను అనుగ్రహించెదవు గాక! అగ్ని దగ్ధమైన
జతాలు శుద్ధమైనట్లే నీ సేవ ద్వారా జీవుని అజ్ఞానమలం నాశనం కాగా స్వస్వరూప సిద్ధిని
లుగుతాడు. కనుకనే నువ్వు గురువులకు గురుడవై జగద్గురుడవై భాసిల్లుతూ వుంటావు.
ా, ఆచార్యులూ, సర్వ జీవులూ కలిసి అనుగ్రహిస్తే కూడ నీ అనుగ్రహంలో దశాంశం
ర్వ శక్తి సంపన్నుడవైన నిన్నే శరణు వేడుతూన్నాను. అంధునకు మరో అంధుడు
ర్శకుడైనట్లు అజ్ఞానియైన వానికి మరో అజ్ఞాని ఆచార్యు డవుతూన్నాడు. భాను సమాన
ప్రకాశరూపుడవైన నువ్వే సర్వేంద్రియాలను ప్రేరేపిస్తూ వుంటావు ఆత్మతత్వ జిజ్ఞాసుల
ము నిన్నే గురువుగా వరిస్తూన్నాము. అజ్ఞానులు మూఢులకు బోధించే ప్రబోధాలు కూడా
ంతాలే ఆవుతాయి. వాటివల్ల సంసార రూప ఘోరాంధకారంమే లభిస్తుంది. యదార్థ
న్ని మనుష్య మాత్రుడు తెలుసుకో గలిగినట్టి జ్ఞానోపదేశాన్ని చేయ గల సర్వ సమర్థు
వ. సర్వ సుహృదుడవూ, ప్రియతముడవూ, భగవంతుడవూ, ఆత్మ స్వరూపుడవూ,

ాపదిష్ట జ్ఞానమూ సర్వమూ నీవే అయి వున్నావు. వాంఛా రూప బంధన బంధితులైన వారు ంలయి పోతూన్నారు. నువ్వు వారి హృదయాలలోనే వున్నావన్న జ్ఞానం వారికి లేదు. అవ ం సయితం ఆరాధనీయుడవైన పరమాత్మవు నువ్వు. నీ ద్వారా జ్ఞానాన్ని పొందాలని నిన్ను ం వేడు తూన్నాను. పరమార్ధ ప్రకాశితమైన భవదీయ వాణి ద్వారా మదీయ హృదయ ని విచ్ఛిన్నం చేసి స్వస్వరూప సిద్ధిని ప్రసాదించెదవు గాక!" అని సత్యవ్రతుడు ప్రార్థించగా ్యవతారుడైన పరమాత్మ పళయపయోధిలో విహరిస్తూ వారికి ఆత్మ తత్త్వోపదేశం చేశాడు. ్యమూర్తి సత్యవ్రతునకు తన సంపూర్ణ స్వరూప, రహస్య, జ్ఞాన, భక్తి, కర్మ యోగాదు పురాణ రూపంలో ప్రబోధించాడు. అదియే మత్స్య పురాణ నామంతో విఖ్యాత మయింది. ్షి సమేతంగా సత్యవ్రతుడు ఆ నౌకలో కూర్చుని పరమాత్మ ద్వారా సనాతన బ్రహ్మ న్ని గ్రహించాడు. తరువాత పూర్వ కల్పం సమాప్తమై బ్రహ్మ మేలుకొనిన మీదట ్య రూప పరమాత్మ హయగ్రీవాసురుణ్ణి సంహరించి వేదాలను బ్రహ్మదేవున కిచ్చాడు. సత్య ు దైవ కృప వల్ల జ్ఞాన విజ్ఞానయుతుడై యీ కల్పంలో వైవస్వత మను వయ్యాడు.

నిజ యోగ మాయా సమేతుడైన పరమాత్మ మత్స్య రూపంలో వున్న వేళ ప్రళయ ంలో—సత్యవ్రత మత్స్యమూర్తుల సంవాదం విన్న మానవుడు పరమ పదం పొందుతాడు. ం సాగరంలో బ్రహ్మ దేవుడు నిద్ర పోతూన్నాడు. బ్రహ్మ సృష్టి అంతమై పోయింది. ంయాన అతని వదనం నుండి వేదాలు బహిర్గత మయ్యాయి. హయగ్రీవుడా వేదాలను అప ంకుని పాతాళానికి పోయాడు. శ్రీమన్నారాయణ భగవానుడు మీనావతార మెత్తి హయ అంతం చేసి బ్రహ్మకు వేదాలను ప్రసాదించాడు. అంతే కాకుండా సప్తర్షి సహితుడైన నునకు బ్రహ్మ తత్త్వోపదేశం చేశాడు. కారణ కారణుడైన లీలా మయ మత్స్యావతారునకు ంణమిల్లు తూన్నాను.

అష్టమ స్కంధము సమాప్తము.

—0—

శ్రీకృష్ణ పరమాత్మనే నమః

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-1

పరీక్షిన్మహారాజు శుకమహర్షికి ప్రణమిల్లి "మహాత్మా! సర్వ మన్వంతరాలూ, వాటి
ప జరిగే పరమాత్మ లీలలూ, అవతారాలూ వర్ణించి చెప్పారు. పూర్వ కల్పంలో ద్రవిడ దేశా
న సత్యవ్రతుడే యీ కల్పంలో వైవస్వత మను వయ్యాడు. అతని పుత్రులే ఇక్ష్వాకాది
్యలని వర్ణించి చెప్పారు. యోగి పుంగవా! దయ చేసి తమరు వారి వంశ విస్తారాన్ని ఆ
ల వృత్తాంతాలనూ విశదంగా చెప్పండి. నాకు సర్వదా హరికథలు ఆలకించాలని వుంటూన్నది.
్రత మన్వంతరంలో యీ మను వంశంలో యితః పర్యంతం జరిగిన వృత్తాంతాలూ
త్తులో జరుగబోవు నట్టి వారి పావన గాథలూ విశదీకరించి చెప్పండి" అని అర్థించగా
మర్మజ్ఞుడైన శుకమహర్షి బదులు పలుకు తూన్నాడు:-

రాజా! శతాధిక సంవత్సరాల కాలం వర్ణించి చెప్పినా అంతంకాని మను వంశీకుల గాథ
ంక్షిప్తంగా చెబుతాను. ఆలకించు. ప్రళయ వేళలో సర్వాంతరాత్మ అయిన పరమ పురు
మాత్రమే ఉంటాడు. తత్సమయంలో యీ పృథ్వి కానీ, మరి ఏ వస్తువు కానీ వుండదు.
మ పురుషుని నాభీ కమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ ప్రాదుర్భవించాడు. బ్రహ్మ మానస
గా మరీచ్యాదులూ, వారి వల్ల కశ్యపుడు, అతని వల్ల అదితి వల్ల సూర్యనారాయణుడు
ంచారు. ఆ సూర్యునకు సంజ్ఞా దేవి వల్ల శ్రాద్ధ దేవుడు పుట్టాడు. అతడే వైవస్వత మను
. అతని ధర్మపత్ని పేరు శ్రద్ధా దేవి. ఆ పుణ్య దంపతులకు ఇక్ష్వాకు, నృగ, శర్యాతి,
ృష్ట, కరూష, నరిష్య, పృషధ్ర, నభగ, కవి అన్న నామాలతో పది మంది కుమారులు

ఆదిలో వైవస్వత మనువుకు సంతానం కలగక పోవడం వల్ల వశిష్ఠ మహర్షి అతని చేత
ప్రాప్త్యర్థం మిత్రావరుణ నామకమైన యాగం చేయించాడు. యాగారంభంలో ఆ దంప

పయోవ్రతం సాగిస్తున్న శ్రద్ధ హోతను సమీపించి – ప్రణమిల్లి తనకు పుత్రిక కావాలని
ంది. అధ్వర్యుని ప్రేరణ వల్ల హోతగా వున్న భూసురోత్తముడు శ్రద్ధ అభీష్టానుసారం
చిత్తుడై వషట్కారోచ్చారణ చేసి హోమం చేశాడు. ఆ రీతిగా విపరీత కర్మను హోత
గించడం వల్ల – కుమారునికి బదులు కుమార్తెయే జన్మించింది. అది చూసిన శ్రాద్ధ దేవుడు
ంచ లేదు. మనువు శీఘ్రమే వశిష్ఠుని సమీపించి "ఆచార్య దేవా! మీ రందరూ బ్రహ్మ
రిష్ఠులైనా యీ కార్యం ఏల విపరీత ఫలాన్ని యిచ్చింది? వైదిక కార్యం వ్యతిరేక ఫలా
ాదే? ఇది బాధాకరంగా వుంది. మంత్రవేత్తలూ, తపో ధనులైన పరమ పావన మూర్తులూ,
ియులూ అయిన మీ ద్వారా అమరుల యందు అసత్యం ఆపాదించునట్టి – వ్యతిరేక ఫలం
చ్చింది?" అని అనగా వశిష్ఠ మహర్షి – "రాజా! నీ హోత యొక్క విపరీత సంకల్పం వల్ల
ంకల్పం విఫలమయి పోయింది. ఇప్పుడు నేను మదీయ తపశ్శక్తితో నీకు పుత్రుని ప్రసా
." అంటూనే ఆ బ్రహ్మర్షి 'ఇల, నామకమైన ఆ కన్యనే పురుషునిగా మార్చాలని శ్రీ
స్తుతించాడు. శీఘ్రమే ప్రసన్నుడైన మాధవుడు వశిష్ఠుని అభీష్టానుసారం ఆ కన్యను పుత్రిగా
డు. అతడే సుద్యుమ్న నామ చక్రవర్తి అయ్యాడు.

రాజా! సుద్యుమ్నుడు సైంధవ అశ్వారూఢుడై మంత్రులతో సహా వేటాడ అడవులకు
. కరవాల, బాణ, కవచ ధారియై ఆతడు హరిణ సమూహాలను అనుసరించి పురోగమిస్తూ
. ఆ వనంలో అడుగిడుతూండగానే ఆతడు స్త్రీ రూపాన్ని దాల్చడం, తన పురుషాశ్వం
డ గుఱ్ఱంగా మారిపోవడం గ్రహించాడు. అంతే కాదు అతనితో వచ్చిన వారందరి కందరూ
గా మారిపోవడం గ్రహించాడు. అందరి కందరూ ఒకరి ముఖాలు వేరొకరు చూసు
ంటూన్నారు.

పరీక్షిన్నరపాలా! పురాతన కాలంలో ఒకానొకనాడు సదాశివ సందర్శనార్థం – తపోధను
మహర్షి బృందం స్వప్రకాశంతో ఆ వనంలోని అంధకారాన్ని రూపుమాపి దానిని తేజరిల
అక్కడకు విజయం చేశారు. తత్సమయంలో వివస్త్రగా వున్న అంబిక లజ్జతో – మహా
అంకం నుండి లేచి చీర కట్టుకుంది. ఆ విధంగా పార్వతీ పరమేశ్వరులు విలాసంలో
చూసిన ఋషు లందరూ వెనుకంజ వేసి – నర నారాయణ తపో భూమి అయిన బదరి

ం చేరారు. తత్సమయంలో మహాదేవ భగవానుడు–పార్వతీదేవి ఆనందార్థం – "నేడాదిగా
నంలోకి వచ్చిన ఏ పురుషుడైనా స్త్రీగా మారిపోవును గాక !" అని శాసించాడు. ఆ నాటి
నర, జంతు భేదం లేకుండ అక్కడకు ఎవరు వచ్చినా ఆడవారిగా మారి పోతారు.

సుద్యుమ్నుడు అనుచర వర్గంతో నారీ రూపాలలోనే ఓ వనం నుండి మరో వనానికి పరి
స్తా వున్నాడు. అదే సమయంలో బుధుడా స్త్రీని చూచి నా ఆశ్రమ సమీపంలో సంచరించే
ందరాంగి నాది కావాలని వాంఛించాడు. ఆమె కూడ బుధుని వరించినది. వారిరువురి శృంగార
పురూరవుడు ప్రభవించాడు. ఆ రీతిగా మను కుమారుడైన సుద్యుమ్నుడు నారీ రూపంలో
ని తెలిసిన వశిష్ఠ బ్రహ్మర్షి – అతనికి పురుష రూపాన్ని ప్రసాదించాలని మహాదేవుని
చగా ప్రసన్నుడైన పరమ శివుడు–"బ్రహ్మర్షీ! తన పలుకు అసత్యం కారాదనీ, నీ యజ
ఓ మాసం స్త్రీగానూ మరో మాసం పురుషుడు గానూ వుంటాడని పలికి అంతర్ధానమై
ు. అలా పురుషాకృతిని సంపాదించి సుద్యుమ్నుడు భూమండలాన్ని శాసించ సాగాడు.
జలు అతణ్ణి అభినందించ లేక పోయారు. అతనికి, ఉత్కల, గయ, విమల నామా
ుమారులు ముగ్గురు కలిగారు. వారు ముగ్గురూ దక్షిణా పథానికి ప్రభువు లయ్యారు.
సమీపించడంతో సుద్యుమ్నుడు పురూరవునకు రాజ్య భారాన్ని వప్పగించి తాను
స్థాశ్రమానికి వెళ్ళి పోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9  అధ్యాయం-2

### పృషధ్రాదుల వంశ వర్ణన.

శుకమహర్షి పలుకుతున్నాడు :- రాజా! సుద్యుమ్నుడు తపో భూమికి వెళ్ళిన తరువాత ు పుత్ర సంతానార్థియై యమునా తీరంలో శత సంవత్సరాలు తపస్సు చేశాడు. అనంతరం పుత్ర ప్రాప్తికై శ్రీమన్నారాయణుని ప్రార్థించి పది మంది కుమారులను కన్నాడు. లో ఇక్ష్వాకుడు జ్యేష్ఠుడు. అందులో ఒకని పేరు పృషధ్రుడు. వీరి కుల గురువైన వశిష్ఠుడు గోరక్షణ యందు నియోగించగా అతడు రాత్రి వేళల్లో సావధానుడై. వీరాసనాధిష్ఠితుడై ను సంరక్షిస్తున్నాడు.ఓ నాడు రాత్రి సమయంలో వర్షం పడుతూండగా గోశాలలో పెద్దపులి ంచడంతో ఆవులన్నీ లేచి ఆ శాల యందే యిటూ, అటూ పరుగెత్త సాగాయి. భయంక బలవంతమైన ఆ పెద్ద పులి అందులో ఓ ఆవును కరచి పట్టింది. ఆ గోవు ప్రాణ భీతితో ంతో పృషధ్రుడు పరుగెత్తుకుని అక్కడకు వచ్చాడు. అది రాత్రి వేళ, పైగా వర్షం, దశ అంధకార బంధురాలై వుండగా కన్నూ మిన్నూ కానరాని తత్సమయంలో పృషధ్రుడు పాణియై పులి అని తలచి గోమస్తకాన్ని ఖండించి వేశాడు. కత్తి మొన తగిలి చెవి నరక తో ఆ పులి పరుగెత్తి పారి పోయింది. పులి సంహరించబడిన దని సంతసించిన పృషధ్రుడు తెల్లవారగా వెలుగు రేఖలలో తను సంహరించినది గోవు నని గ్రహించి విశేషంగా పరిత . పొరబాటుగా జరిగినా అతని వల్ల జరిగిన గోహత్యానేరం కారణంగా పురోహితుడైన -ఆతణ్ణి శపిస్తూ-గోహత్య కారణంగా నీ యందు క్షాత్రం నశించి శూద్రుడవై పోయె క!" అని శపించాడు.పృషధ్రుడు ఆచార్యుని శాపాన్ని-నత మస్తకుడై స్వీకరించి-ముని ప్రీతిపాత్రమైన నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించాడు. సర్వ జీవరాశియందూ కమైన హితం కలవాడై సర్వ మానవ శ్రేయోభిలాషతో భక్తితో- సర్వాత్ముడూ విశు అయిన వాసుదేవుని యందు పరమ ప్రేమ కల వాడయ్యాడు. అతనిలో సర్వాసక్తులూ,

ప్రలూ నాశనమై పోయాయి. ఇంద్రియాలు ఆతనికి స్వాధీన మయ్యాయి. యదృచ్ఛా లాభ
ష్టుడై సంగ్రహ, పరిగ్రహాలను త్యజించి వేశాడు. ఆత్మ జ్ఞాన తృప్తుడై చిత్తాన్ని భగవదా
ం చేసి సమాధి మగ్నుడై విశేష కాలాన్ని గడిపివేస్తూ జడ, బధిర, అంధ, మూకాదులతో
గా పరిభ్రమిస్తూన్నాడు. అలా కాలం గడుపుతూండగా ఓ నాడు దావానలం వల్ల అతడున్న
్య మంతా దగ్ధమై పోతూ వుంటే అందులో దేహం దగ్ధం కాగా అతడు పరమాత్మను
ు.

మను కుమారులలో చిన్నవాడైన కవి నామకుడు పిన్న వయస్సులోనే విరక్తుడై రాజ్యాన్ని
డి బంధు సహితంగా అడవులకు పోయి నిజ హృదయంలో స్వప్రకాశ స్వరూపుడైన పర
్ను ధ్యానిస్తూ పరమ పదం చేరుకున్నాడు. మను పుత్రులలో కరూష నామధేయుడు
్మణ భక్తి ధర్మాన్ని అనుసరించి ఉత్తరా పథ సంరక్షకు డయ్యాడు. ధృష్టుని కుమారు
ఖాస్టుకు సాధన ద్వారా విప్రు డయ్యాడు. నృగ నందనుడైన సుమతికి ప్రభవించిన వాడు
జ్యోతి - వాని కుమారుడు వసువు, వసునందనుడైన ఓఘవంతునకు– ఓఘవంతుడనే
హా, ఓఘవతి అనే పుత్రికా కలిగారు. ఓఘవతి సుదర్శనుని పరిణయ మాడింది. మను
డైన నరిష్యంతునికి చిత్ర సేనుడు. ఆతనికి ఋక్షుడు, ఆతనికి మీఢవంతుడు, ఆతనికి
్డు, కూర్చునికి ఇంద్రసేనుడు కలిగారు. ఇంద్రసేనునికి వీతిహోత్రుడు, ఆతనికి సత్య
ా కలిగారు. సత్యశ్రవునకు ఉరుశ్రవుడు–అతనికి దేవదత్తుడూ కలిగారు. దేవదత్త నంద
అగ్ని వేశుడు. ఇతనికే కానీన, జాతు కర్ణ్య నామాలు ఏర్పడ్డాయి. స్వయంగా జాతవేదుడే
కు కాగా–విప్రులకు యీతని వలననే అగ్నివేశ్యాయన గోత్రం వర్ధిల్లినది. ఇక దిష్ట వంశ
ం విను. దిష్టుని పుత్రుడు నాభాగుడు, యీతడు స్వకర్మలు కారణంగా వైశ్య డయ్యాడు.
కుమారుడు భలనందుడు. అతని పుత్రుడు ప్రమతి, ప్రమతి నందనుడైన ఖినత్రునకు పుట్టి
పేరు చాక్షుడు కాగా, యితని కుమారుడు వివింశతి. అతని కుమారుడు రంభుడు, అతని
ు ఖనీ నేత్రుడు, వీరందరూ పరమ ధార్మికులే. ఖనీ నేత్రుని కుమారుడు కరంధముడు,
నందనుడు ఆవీక్షిత్తు. ఆవీక్షిణ్ణందుడు మరుత్తు. అతడు చక్రవర్తి అయ్యాడు. అంగిరస
ుడైన సంవర్తుడు మరుత్తుచే చేయించిన యాగంతో సమంగా యాగాలు ఎవరూ చెయ్యలేదు.
నల్ప భేదరహితంగా ఆ యాగంలో వినియోగించిన పాత్రలన్నీ హేమ నిర్మితాలే. మరుత్తు

యాగంలో ఇంద్రుడు సోమపాన తృప్తుడై మత్తుడయ్యాడు. దక్షిణ లందుకొన్న భూ
త్తము లందరూ పరిపూర్ణ తృప్తు లయ్యారు. ఆ యాగాన్ని పరివేష్టించి మరుద్గణ విశ్వే
తేజరిల్లినారు.

దమ నామధేయుడు కూడ మను కుమారులలోని వాడే. అతనికి రాజ్య వర్ధనుడు, అతనికి
తి, అతనికి నరుడు, అతనికి కేవలుడు, అతనికి బంధు మానుడు, అతనికి వేగవంతుడు, అత
ంధువు, బంధువుకు తృణ బిందువు పుట్టారు. తృణ బిందువు ఆదర్శ గుణాలు కలవాడు కావ
ల్లి అప్సరసయైన అలంబుష ఆతణ్ణి వరించినది. తృణ బిందువుకు — అలంబుష యందు
మంది కుమారులూ, ఇడవిడ అనే కన్య కలిగారు. పులస్త్య బ్రహ్మనుండి విశ్రవ మహర్షి
ప విద్యలు అనేకంగా పొంది-ఇడవిడ వల్ల కుబేరుని కన్నాడు. తృణ బిందునకు ధర్మపత్ని
శాల, శూన్య బంధు, ధూమ్రకేతు నామక కుమార త్రయం కలిగారు. వీరిలో విశాలుడు
రు డయ్యాడు. విశాలునకు— హేమ, చంద్రుడు, అతనికి ధూమ్రాక్షుడు అతనికి సంయ
అతనికి కృశాశ్వుడు, అతనికి సోమదత్తుడు, కలిగారు, సోమదత్తుడు అశ్వమేధ యాగాల
యజ్ఞేశ్వరుని ఆరాధించి యోగీశ్వరులను ఆశ్రయించి ఉత్తమ గతిని పొంద గలిగాడు.
డునకు సుమతి, అతనికి జనమే జయుడు కలిగారు. వీరందరి కందరూ తృణ బిందు
ప్పను వర్ధిల చేసి విశాల వంశ రాజు లయ్యారు.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం—9 అధ్యాయం—3

## శర్యాతి వంశ వర్ణన-సుకన్యాచ్యవనుల గాథ.

శుకమహర్షి పలుకుతూన్నాడు :— "రాజా! మను కుమారుడైన శర్యాతి రాజేంద్రుడు వేద
పారగామి అయిన విద్వాంసుడు. అంగిరస గణం కొనసాగించిన సత్రయాగంలో

దివస కర్మ యీయనే కొనసాగించాడు. ఈ శర్యాతి పుత్రియే సుకన్య. ఓనాడు శర్యాతి పుత్రితో సహా అరణ్యాలలో సంచరిస్తున్నాడు. సుకన్య చెలికత్తెలతో వన శోభను తిలగా ఓ పుట్టను చూసింది. ఆ పుట్టలోని రంధ్రాల నుండి భాస్కర సమ ప్రభలతో కాంతులు తూన్నాయి. విధి ప్రేరణానుసారం–రెండు ముళ్ళను తీసుకుని సుకన్య ఆ రెండు రంధ్రా కాంతులు వచ్చే చోట పొడిచింది. అంతే వెంటనే రక్తం ప్రవహించింది. సరిగ్గా అదే సమ శర్యాతి సైన్యాలకు మలమూత్రాలు బంధించబడి పోయాయి. ఆశ్చర్య పొందుతూనే సైనికులను చూసి–"సైనికులారా! యీ తపోధనుని ఆశ్రమంలో మీరు అనుచిత కార్య య్యలేదు కదా! మన వారిలో ఎవరో ఒకరు యీ అనుచితం చేయకపోతే యిట్టి పరి ప్రదేది కాదు." అంటూన్న తండ్రి పలుకులు విని సుకన్య భయభీతయై తండ్రికి దగ్గరగా జనకా! పుట్టలో రెండు జ్యోతులను చూచి నేనే తెలియక ముళ్ళతో పొడిచాను." అంది. రంపిత గాత్రుడైన శర్యాతి పుత్రిక మాటలు ఆలకించి ఆ పుట్ట దగ్గరకు వెళ్ళి చ్యవన ప్రార్థించి ఆయన అభిప్రాయాన్ని గ్రహించి సుకన్యను ఆతని కిచ్చి పెళ్ళి చేశాడు. ం సైన్యాలకు స్వస్థత ఏర్పడింది. చ్యవనాదేశానుసారం శర్యాతి సపరివారంగా రాజధా లి పోయాడు.

కాలం గడచి పోతూన్నది. సుకన్య సావధాన చిత్తయై పరమ కోపిష్ఠి అయిన చ్యవనుని ఆయన మనస్సునను సరించి వ్యవహరించ సాగింది. కొంత కాలానికి అమర వైద్యు శ్వినీ కుమారులు చ్యవనాశ్రమానికి విచ్చేశారు. వారికి సముచిత రీతిని చ్యవనుడు అతిథి ను చేసి – "అమర వైద్యులారా! సర్వ సమర్థులైన మీరు అకాల మరణం పొందిన పునర్జీవితులను చేయ గల సమర్థులు. యువతీ జన ప్రియమైన యౌవనాన్ని నాకు ప్రసా . అలా మీరు చేయ గలిగితే సోమపానార్హత లేని మీకు అమరులతో సమంగా సోమ తను ప్రసాదించ గలను." అన విని అశ్వనీ కుమారులు పరమానంద భరితులయ్యారు. . ముని జరా పీడితమై నరాలూ, ఎముకలూ కనిపిస్తూన్నాయి. శరీర మంతా ముడతలు ంది. వెంట్రుకలు తెల్లబడి పోయాయి. వయో వృద్ధుడైన చ్యవనుని వెంట బెట్టుకుని ద్యులు సిద్ధ కుండంలో మునిగారు. ఆ కుండం నుండి సమాన వయో రూప సౌందర్యాలు పుషులు ముగ్గురు బయటకు వచ్చారు. పద్మ మాలలు ధరించి మకర కుండలాలతో వారు

ల్లు తూన్నారు. దివ్య వస్త్రాభరణాలను ధరించి వనితా జనప్రియ్మపదులై ఆకర్షణీయంగా న్నారు. భాస్కర సమ తేజంతో వారు ఏకాకృతిలో వున్నారు. వారు ముగ్గురినీ తిలకించి కో తన భర్తను గుర్తించ జాలని సుకన్య అశ్విని దేవతలను ప్రార్థించగా వారు ఆమెకు ముని పరిచయం చేసి–ఆ మహర్షి ఆదేశానుసారం విమాన మెక్కి స్వర్గానికి వెళ్ళి పోయారు.

కాలం గడచి పోతూన్నది. శర్యాతి మహారాజుకు యాగం చెయ్యాలన్న సంకల్పం కలి ఆ మహారాజు చ్యవనాశ్రమం చేరి కుమార్తె దగ్గర నవ యౌవ్వన సుందరాంగుని చూసి రు పందాడు. తండ్రికి నమస్కరించ వచ్చిన సుకన్యను చూసి అతడు కస్కొర జేసి-"దుష్ట ఇదేమి పని! సర్వ జన వందనీయుడైన మహర్షికి ద్రోహం చేశావా ? వృద్ధుడు పనికి విడిచి జారునితో వుంటూన్నావా? ఉన్నత వంశ సంజాతమైన నీకీ దుర్బుద్ధి ఎలా పుట్టింది? వర్తన మన వంశానికే కళంకమైనది నీ కృత్యం పుట్టి నింటికీ, మెట్టి నెంటికీ కూడ నర ప్రాప్తింపజేసేదే అవుతుంది." అని అతడు యింకా ఏదో మాట్లాడ బోతూంటే నిర్దోషి సుకన్య నిర్భయంగా తండ్రితో–"జనకా! యీయన మీ జామాత చ్యవనుల వారే." అంటూ వృత్తాంత మంతా వినిపించ సంతసించిన శర్యాతి మహానందంతో కుమార్తెను హృదయా త్తుకున్నాడు.

శర్యాతి చేత సోమ యాగం చేయించ సంకల్పించిన చ్యవనుడు సోమపానాధికారం లేక నా అమర వైద్యులకు సోమపానార్హతను కలిగించడం చూసి ఆగ్రహోదగ్రుడైన మహేం వజ్రపాణియై శర్యాతిని సంహరించ వజ్రాన్ని పైకెత్తగా చ్యవన ఋషి ఇంద్రుని హస్తాన్ని మేతంగా స్తంభింప జేసి వేశాడు. వైద్యులన్న భావంతో సోమపానార్హత లేకుండ చేసిన దాదులు చ్యవనుని మహిమ వల్ల అమర వైద్యులకు సోమపానాధికారాన్ని ప్రసాదించి అనుగ్రహానికి విశేష పాత్రులై అమర ధామానికి వెళ్లిపోయారు.

"పరీక్షిన్నరేంద్రా! శర్యాతి మహారాజుకు ఉత్తాన బర్హి, ఆనర్త, భూరిషేణ నామాలతో కుమారులు కలిగారు. అందులో ఆనర్తునకు కలిగిన రేవతు డనే వాడు సాగరంలో నామక నగరాన్ని నిర్మించి అక్కడే వుంటూ ఆనర్తకాది దేశాలను శాసించేవాడు. కు సత్పాత్రులైన కుమారులు నూర్గురు కలిగారు. అందులో జ్యేష్ఠుడు కకుద్మి. అతనికే

నన్న పేరు కూడ వుంది. అతడు తన పుత్రి అయిన రేవతికి వివాహం చెయ్యాలని వరాన్వేషణలో బ్రహ్మ లోకం చేరాడు. అక్కడి కోలాహల వాతావరణంలో సంభా అవకాశం లేక క్షణం ఆగవలసి వచ్చింది. తరువాత అతడు చతుర్ముఖునికి ప్రణమిల్లి ున కారణం తెలియజేయగా – బ్రహ్మదేవుడు మందస్మితం చేసి – "రాజా! నువ్వు ఎవరి యోచించినా వారందరూ కాల సర్ప కబళితులైన వారే. వారి వంశాలే అంతరించాయి. నువ్వు భూతలానికి వెళ్లు, ప్రస్తుతం – శ్రీమన్నారాయణ భగవానుని అంశావతార మూర్తి ుడు భూతలంలో తేజరిల్లుతూన్నాడు. అతడు తన నామ లీలాగుణ స్మరణ మాత్రం చేత నూ పవిత్రం చేయ గల వాడు. సమస్త జీవ కోటికీ జీవన సర్వస్వమైన పరమాత్మయే న్ని హరించ అంశావతరంగా బలరామరూపంలో అవతరించాడు. ఆ పురుషశ్రేష్ఠుడు నీ న్యా రత్నానికి అనుకూలమైన భర్త కాగలవాడు. నీవీ కన్యను బలరామున కర్పించి డ వయ్యెదవు గాక!" అన్న బ్రహ్మదేవుని వచనాలు ఆలకించిన అతడు చతుర్ముఖుని ిందాలకు ప్రణమిల్లి పుత్రీ సమేతంగా స్వనగరం చేరాడు. అప్పటికే స్వవంశీయులు కు భయపడి ప్రాణాలతో పారిపోయి దొరికిన చోట తలదాచుకున్నారు. కకుద్మి మహారాజు ్రి అయిన రేవతిని బలశాలి అయిన బలదేవున కిచ్చి పరిణయం చేసి నరనారాయణాశ్రమ ంచరి కాశ్రమానికి తపస్సార్థం వెళ్ళి పోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-4

### నాభాగ, అంబరీషుల చరిత్ర.

శుకమహర్షి పలుకుతూన్నాడు :— "పరీక్షిన్నరేంద్రా! మను పుత్రుడు నభగుడు, ఆతని కుడు నాభాగుడు. చిరకాలం బ్రహ్మచర్యవ్రతదీక్షితుడైన నాభాగుడు మరలి వచ్చే సరికి అగ్రజు లందరూ సంపద అన్నింటినీ తాము పంచుకుని—సోదరుడు, విద్వాంసుడు అయిన ని వంతుగా తండ్రిని వప్పగించారు. అంత నాభాగుడు తండ్రిని చేరి ప్రణమిల్లి "పితృదేవా! సోద రా వాటాగా నాకు మిమ్ముల నిచ్చారు." అనగా నభగుడు — పుత్రుని ఓలకించి — "వత్సా! వారి మాటలను లెక్క చెయ్యకు. మహా విద్వాంసులూ, విప్ర శ్రేష్ఠులు, అంగిరస గోత్రీ అయిన వారిప్పుడు మహా యాగం చేస్తూ వున్నారు. వారు షష్ఠ దివస కర్మను మరచి న్నారు. నువ్వు వారి షష్ఠ దివస కర్మ సంబంధమైన వైశ్వ దేవ సూక్త ద్వయాన్ని వల్లె దానితో వారు స్వర్గానికి పయనించే సమయంలో నీకు యాగ శేష ద్రవ్యాన్ని యిస్తారు." నాభాగుడు యాగ వాటిక చేరి వైశ్వ దేవ సూక్తులు వల్లెవేయడంతో అంగిరస విప్రులు న్నలై యాగ శేష ద్రవ్యాన్ని నాభాగున కిచ్చి వారు స్వర్గం పైపు వెళ్ళి పోయారు. ఆ న్ని తీసుకోవాలని నాభాగుడు ద్రవ్యం దగ్గరగా వస్తూండగా ఉత్తర దిక్కు నుండి ఓ కాల డు వచ్చి యాగ శేష ద్రవ్యం "నాది" అన్నాడు.

వాని వచనాలకు నాభాగుడు—"కాల పురుషా! మహర్షులు యీ ద్రవాన్ని నాకు యిచ్చారు." వుంటే ఆ కాల పురుషుడు—"మన యీ సమస్యను మీ తండ్రిగారే తీర్చాలి." అన్నాడు. నభగుని కోరగా అతడు — "వత్సా! దక్షయజ్ఞంలో జరిగిన తీర్మానానుసారం శేషం రుద్రునకే చెందాలి." అనగా నాభాగుడు యాగశాలలో కాల పురుషునకు ప్రణమిల్లి —రుద్ర దేవా! యాగశేష ద్రవ్యం తమకే చెందుతుందని మా చెప్పారు. తెలియక అపరాధం చేసిన నన్ను క్షమించుడని" ప్రార్థించగా రుద్రదేవుడు —

। నీ జనకుడు ధర్మానుకూలంగా చెప్పాడు. నువ్వు కూడ సత్యమే పలికావు. ఆదిలోనే వేదార్థాన్ని గ్రహించినావు. ఇప్పుడు నీకు సనాతన బ్రహ్మ తత్వ, జ్ఞానాన్ని ప్రసాదిస్తూ అంతేకాదు యాగ శేష ద్రవ్యాన్ని కూడ నీకే యిస్తూన్నాను. తీసుకో." అని పలికి వుడు అంతర్థాన మయ్యాడు. ప్రాత స్సంధ్యా సమయాలలో ఏకాగ్ర చిత్తుడై యీ ఉపా న్న స్మరించేవాడు ప్రతిభా సంపన్నుడై వేదజ్ఞుడు కావడమే గాక స్వస్వరూప జ్ఞానాన్ని గొందుతాడు. ఈ నాభాగ నందనుడే అంబరీష చక్రవర్తి. మహోదారుడూ, భగవద్భక్తుడూ ధార్మికుడూ అయి ఖ్యాతి గాంచాడు. విప్ర శాపం సయితం అతణ్ణి ఏమీ చేయలేక పోయింది." పరీక్షిత్తు తన అనుమానాన్ని వ్యక్తం చేస్తూ అడిగాడు.

"శుక మునీంద్రా! మహా జ్ఞాని అయిన అంబరీష రాజర్షి గాధను ఆలకించాలని నిరోధించ వీలు కాని విప్ర శాపాన్ని అంబరీషుడు ఎలా వారించ ు. విప్ర శాపాన్ని అంబరీషుడు ఎలా హరించ గలిగాడు. విప్ర శాపం కూడ అతణ్ణి ేయలేక పోవడం ఆశ్చర్యంగా ఉన్నది. ఆ సంగతులను విశదీకరించి చెప్పండి" అని అర్థిం ుకమహర్షి అంబరీషోపాఖ్యానాన్ని అందుకున్నాడు. "రాజా! చతుస్సముద్ర వేలా వలయిత ండలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించే చక్రవర్తి అయి కూడ అంబరీషుడు సంపద ంటినీ స్వప్న తుల్యంగా భావించి సంచరించాడు. శ్రీహరి దేవుని యందు అనన్య భక్తి కల హరి భక్తుల యందు విశేష ప్రేమ కలిగి వ్యవహరించే వాడు. అతడు మనస్సును శ్రీ చరణార విందాల యందూ, వాక్కును ఆ దేవ దేవుని గుణాను సంకీర్తనంలోనూ, కరాలను మందిర సేవలోనూ, కర్ణాలను కరిరాజ వరదుని గాధా శ్రవణ మందూ సంలగ్నం చేసే ముకుంద మందిర సందర్శనంలో నయనాలను లగ్నం చేసే వాడు. భగవద్భక్తుల అంగ ్పదులలో అంగాలనూ, భగవచ్చరణారవింద తులసీ దివ్య గంధా ఘ్రాణంలో ఘ్రాణేంద్రి ్న, భగవదర్పిత దివ్య ప్రసాద రసా స్వాదనలో రస నేంద్రియాన్నీ లగ్నం చేసే వాడు. క్రవర్తి పాదాలు హరి క్షేత్ర సందర్శనంలో పురోగమించేవి. ఆ దేవ దేవుని పాదారవింద నానికై అతని శిరస్సు ఉపయోగపడేవి. అతని భోగ సామగ్రి సర్వస్వమూ హరిచరణారవిం యందే అర్పించ బడేవి. విషయ వాసన లన్నవి ఆ చక్రవర్తిలో లేవు. పరమాత్మ యాదా న భక్తుల యందే నివసిస్తూవుంటాడు. అట్టి శ్రీహరికి నివాసార్హమైన లక్షణాలన్నీ అంబరీష

న్నాయి. అలా సచ్ఛీలుడైన అంబరీషుడు ఇంద్రియాతీతుడూ యజ్ఞ పురుషుడూ అయిన త్మనే సర్వాత్మ, సర్వ స్వరూపుడూ అని భావించి కర్మలన్నీ భగవంతునకే అర్పించి, క్తులూ విద్వాంసులూ అయిన వారి ఆదేశానుసారం రాజ్య పాలన చేస్తూ వుండే వాడు. ామకమైన నిర్జన ప్రదేశంలో సరస్వతీ నదీ తీరాన, వశిష్ఠ, అసిత, గౌతమాది ఆచార్య ద్వారా సర్వాంగ పరిపూర్ణమైన భూరి దక్షిణా యుక్తమైన అశ్వమేధాలు అనేకంగా తద్ద్వారా యాగపతి అయిన పరమాత్మను ఆరాధించే వాడు. అంబరీషుని యాగానికి ునట్టి సుర, ముని, నర భేద రహితంగా దివ్య పురుషుడైన అతనినే దర్శిస్తూ వుండే వారు. కందరికి అతడు దేవ సమునిగా గోచరించే వాడు. అతని ప్రజలందరూ హరి లీలనూ ూ వింటూ, పాడుకుంటూ బ్రహ్మానందం పొందే వారు. ఇలా అంబరీషుని పాలనలోని అమరులకు సైతం ప్రియమైన స్వర్గాన్ని కూడ కోరకుండ సుఖిస్తూన్నారు. స్వహృదయా అనంత ప్రేమను ఉత్పన్నం చేయు నట్టి శ్రీమన్నారాయణ భగవానుని సందర్శిస్తూండే మహా సిద్ధులకు సయితం దుర్లభాలైన భోగ సామగ్రులు కూడ వారికి ఆనందాన్ని కలుగ లేక పోతూన్నాయి. ఆత్మానందమే లభించగా యీ భోగాలన్నీ అట్టివారి దృష్టికి తుచ్ఛాలుగా ాయి. ఈ విధంగా అంబరీష చక్రవర్తి తపోయుక్తంగా భక్తి యోగాన్ని అవలంభించి ్తమైన ప్రజా పాలన ద్వారా భగవంతుని ప్రసన్నుని చేసుకుంటూ క్రమక్రమంగా సమస్త ల యందలి ఆసక్తినీ విడనాడ సాగాడు. గృహ దార, పుత్ర, సోదర, బాంధవ, రథ, తురగ, పదాతివర్గ, అక్షయ రత్నాభరణ, అయుధ, కోశాగారాదులన్నీ అసత్యాలే. ప్రపం భగవంతుడు వినా సత్య పదార్థమేదీ లేదని గ్రహించి దృఢ నిశ్చయంతో సంచరించే వాడు ీషుడు. అతని అనన్య శ్రద్ధ, భక్తి, విశ్వాసాలకు సంతుష్టుడైన శ్రీహరి ఆ రాజర్షిని సంర నిమిత్తమై సుదర్శన చక్రాన్ని నియుక్తం చేశాడు. శత్రు సంహారం, భక్త జన సంరక్షణ- ైన చక్ర ప్రధాన లక్షణము.

అంబరీష చక్రవర్తి పత్ని కూడ భర్తతో సమాన లక్షణాలు కలదియై సంసార విరక్తయై ాలై వుంది. ఒకానొకప్పుడు కృష్ణ భగవత్ ప్రీత్యర్థం అంబరీషుడు పత్నీ సమేతంగా శీ ప్రధానమైన ఏకాదశీ వ్రతం ఆరంభించాడు. సంవత్సరకాల పర్యంతం ఆ నియమాన్ని

నాలని ఆతని సంకల్పము. వ్రత సమాప్త్యనంతరం కార్తీక మాసంలో అంబరీషుడు రాత్రి ఉపవాస దీక్ష సాగించాడు. ఓ నాడతడు యమునా నదిలో స్నానం చేసి హరిని ఆరాధించి షేక విధ్యనుసారం సర్వ సంపదలతో విశేషార్చన చేశాడు. తన్మయ భావంతో వస్త్రా, చందనార్ఘ్య మాలాదులతో ఇష్ట దేవుని ఆరాధించాడు. భూసురోత్తములకు భూరి దక్షిణలే అంబరీషుడు వారందరికీ అధిక దక్షిణ లిచ్చి ఆదరించాడు; అంతతో పూరుకో లేదు వారికి భోజనాలను పెట్టి సంతుష్టులను జేశాడు. వారి సదనాలకు ఆరుకోట్ల గోవులను తరలించి స్వర్ణ శృంగాలతో, రజత ఖురాలతో, సాధు స్వభావం కల ఆ గోవులన్నీ వస్త్రాద్యలంకృతాలై అధికంగా క్షీరాలను అందించునట్టివియై యున్నాయి. క్షీరపాత్రలను భూసురులకు అంబరీషుడే పంపాడు. విప్రశ్రేష్ఠులను అట్లు తృప్తులను చేసి వారి ఆజ్ఞను ఆ రాజు పారణ చేయ సిద్ధమైన సమయానికి నిగ్రహానుగ్రహ శక్తి సంపన్నుడైన మహర్షి అతిథి రూపంలో అక్కడకు విజయం చేశాడు.

అపర రుద్రునిగా విజయం చేసిన దుర్వాస మహర్షిని తిలకించి అంబరీషుడు లేచి నిలబడి చ్చి అర్ఘ్య పాద్యాదు లిచ్చి అతిథి సత్కారం చేసి భుజించుడని కోరినాడు. అంగీకరించిన డు నిత్య కృత్యార్థం నదీ తీరానికి వెళ్ళి యమునలో స్నానం చేస్తున్నాడు. ఘడియ కాలంలో ద్వాదశి వెళ్ళి పోనున్నది. ధర్మజ్ఞుడైన అంబరీషుడు ధర్మ సంకటంలో చిక్కి లతో యోచించ సాగాడు—"భూసురోత్తములారా! జలపానం—భుజించినట్లూ, భుజించ కాడ అవుతుందని శ్రుతి చెబుతున్నది. కనుక నేను జలాలను మాత్రం పానం చేసి ద్వాదశి చేస్తానని నిశ్చయించుకొని శ్రీహరిని మనసా స్మరిస్తూ జలాలను పానం చేసి దుర్వాస ఆగమనానికి నిరీక్షించ సాగాడు. దుర్వాసుడు నిత్య కృత్యాలు నెరవేర్చుకుని సమక్షంలో అంబరీషుని తదేకంగా చూసి యితడు పారాయణ చేశాడని అనుమానించి—అది నిశ్చయం తో క్షుద్బాధతో వేదన పడుతూన్న దుర్వాసుడు క్రుద్ధుడై — "ధన మదోన్మత్తుడై యీ గ్వారుడై తానే మహా సమర్థుడ నని భావించే యీతడు భక్తుడా? ధర్మోల్లంఘన చేసిన యీ డు మహాపరాధమే చేశాడు. సదస్యులారా! చూశారా? నేనీతనికి అతిథిగా వచ్చాను. ఆతిథ్య వ నన్ను పిలచి ఆతిథ్య మీయకనే తాను పారణ చేశాడు." అంటూనే క్రోధోద్రిక్తుడైన

సుడు తన జటనొక దానిని ఊడ పెరికి అంబరీషుని అంతం చెయ్యాలని "కృత్య" నొక సృజించాడు. అది ప్రళయాగ్నిలా ప్రజ్వలిస్తూ ఖడ్గహస్తయై అంబరీషునిపైకి పరుగు పదఘట్టన మాత్రంచే పృథ్వి కంపిస్తూన్నా అంబరీషుడు మాత్రం చలించక యథా వుండి పోయాడు. శ్రీమన్నారాయణుడు ఆదిలోనే అంబరీషుని సంరక్షణార్థం సుదర్శన ్ని ఆదేశించి ఉండడం వల్ల ప్రజ్వలితాగ్ని సర్వాన్నీ భస్మం చేసినట్లు ఆ కృత్యను భస్మం న మీదకు వస్తూన్న సుదర్శన చక్రాన్ని చూసి భయభీతుడై ప్రాణ రక్షణేచ్ఛతో పరుగు ాగాడు. మహోన్నత దావానల జ్వాలలు వెన్నంటి వచ్చినట్లే సుదర్శన చక్ర జ్వాలలు సుని వెన్నంటి వస్తూన్నాయి. అది చూసిని దుర్వాసుడు మేరు పర్వత గుహలలో తల ాలని పరుగెత్తాడు. అక్కడ రక్షణ దొరకని కారణం వల్ల దిశలు, ఆకాశ, పృథివి, వితలాది అధో లోకాలూ, ఆ లోకపాలురూ వారి ద్వారా రక్షించబడుతూన్న లోకాలూ, పర్యంతం అతడు పరుగెత్తాడు. కానీ ఎక్కడకు వెళ్ళినా తీవ్ర వేగంతో సుదర్శనం వెన్నంటి వుంది. అతనికి రక్షకుడు ఎక్కడా దొరక లేదు. భయం పెట్టింపు కాగా అతడు సత్య చేరి బ్రహ్మదేవుని దర్శించి—"పితామహా! స్వయం ప్రభుడవైన నువ్వు శ్రీహరి సుద నుండి నన్ను కాపాడు దేవా!" అని ప్రార్థించగా బ్రహ్మదేవుడు బదులు పలుకుతూన్నాడు.

"దుర్వాసా! నా ద్విపరార్థ అవసాన వేళలో కాల స్వరూపుడైన భగవంతుడు సృష్టి లీల ుయ మొనర్చి విశ్వాన్ని భస్మం చేయదలచి నప్పుడు ఆ భగవంతుడు భ్రూభంగ మాత్రంచే కంతో సహాయాద్విశ్వమూ లయమై పోతుంది. నేనూ, మహాదేవుడు, దక్ష, భృగ్వాది ప్రజా ా భూతేశ్వర, దేవేశ్వరాదులూ—అందరి కందరమూ ఏ జగన్నాథుని శాసనానికి బద్ధులమై ాజ్ఞను శిరసావహించి జగత్తులకు కళ్యాణాలు చేకూరుస్తూంటామని బ్రహ్మ చెప్పగానే సుడు శంకర భగవత్ సన్నిధికి పరుగు తీశాడు.

సమక్షంలో నిలచిన దుర్వాసుని తిలకించి శంకరుడు — "మహర్షి! ఎవనిలో బ్రహ్మాది జీవ ంతా జనిస్తుందో? లయ వేళలో సర్వం ఎవని యందు నామ రూపాలు లేకుండా లయమై ందో, ఏ బ్రహ్మాండంలో మా వంటి అనేకులు పరిభ్రమిస్తూంటారో అట్టి అనంతకోటి ్మండ నాయకుని విషయమై నేను మీకు సహకరించజాలను. నేనూ, సనత్కుమారాదులు,

హిరణ్యగర్భ, కపిల, అపాంతరతమ దేవల, ధర్మ, ఆసురి, మరీచ్యాది అనేకులైన
రులు కూడ హరి మాయను గుర్తించజాలరు. అందరి కందరూ తన్మాయా మోహితులై
న. ఈ సుదర్శనచక్రం శ్రీజగన్నాథుని శస్త్రము. ఈ సుదర్శనాన్ని వారించే శక్తి
వవరికీ లేదు. నువ్వా శ్రీహరినే వేడుము! అని పరమ శివుడు చెప్పగా నిరాశతో
సుడు వైకుంఠం చేరాడు.

లక్ష్మీ సమేతంగా శ్రీమన్నారాయణ భగవానుడు అక్కడే విరాజిల్లు తున్నాడు. సుదర్శన
జ్వాలలకు తపించి పోతూన్న దుర్వాసుడు శ్రీమన్నారాయణుని పాదారవిందాలపై పడి–
! అనంతా / అచ్యుతా సజ్జనులచే అభిలషించబడు వాడవూ, విశ్వానికి జీవన దాతవూ అయిన
అపరాధినైన నన్ను కాపాడెదవు గాక! నీ మహా ప్రభావం తెలియక నీ భక్తుని అవమా
ను. నీ దివ్య నామస్మరణ మాత్రంచే నరలోకంలోని వారు కూడ ముక్తులవుతూంటారు.
శకా! నన్ను కాపాడు దేవా!' అని ప్రార్థించగా – శ్రీహరి పలుకుతున్నాడు– "దుర్వాసా!
క్తుల అధీనంలో సర్వదా ఉంటాను. నేను స్వతంత్రుడను కాను. సజ్జనులైన నా భక్తుల
దయాన్ని వారి అధీనంలో ఉంచుకుని నన్ను ప్రేమిస్తారు. వారిని నేను ప్రేమిస్తాను.
! భక్తజనులకు ఏక మాత్రాశ్రయుడనైన నేను స్వభక్త జనులను ప్రేమించినట్లు నా
కూడ ప్రేమించను. దార, పుత్ర, గృహ, గురు, ప్రాణ, ధన, ఇహపరాదు లన్నింటినీ
నన్నే శరణు వేడిన నా భక్తుని పరిత్యజించి నే నెట్లుండ గలను?! పాతివ్రత్యంతో పతివ్రత
ర్తను స్వాధీనమందుంచుకొనునట్లు భక్తులు అనన్య భక్తిభావంతో నన్ను బంధించి స్వాధీ
వుంచుకుంటారు. నన్ను సేవించినంత మాత్రానికే నా అనన్య భక్తులు తాము కృతకృత్యుల
భావిస్తారు. వారు నా సేవా రూప ఫలమైన సారూప్య సాలోక్యాది ముక్తులను కూడ
చరు. ఇక నాశనమే ప్రధాన లక్షణంగా గల యీ విశ్వ భోగ సామగ్రితో వారికి పని యేమి?
సా! నేను నీ కేమని చెప్పుదును? నా హృదయంలో నా ప్రియ భక్తులూ, ఆ భక్త జనుల
యాలలో నేనూ ఉంటాము. నా కన్న భిన్నమైన వస్తువును నా భక్తులు ఎరుగరు. నేనూ
ంచె అన్యులను ఎరుగను. మునీంద్రా! నేనో వుపాయం చెబుతాను. ఏ అంబరీషునికి అప
తలచినంతమాత్రాన నీకు అనిష్టం కలిగినదో ఆ విపత్తును దూరం చేయ అంబరీషునే ఆశ్ర
. నిరపరాధులైన సజ్జనులకు అనిష్టాన్ని తలపెడితే వారికే ఆపదలు కలుగుతాయి. ఇందులో

హం లేదు. విప్రులకు తపస్స్వాధ్యాయాలే పరమ కళ్యాణ దాయకాలు. అట్టి విప్రుడు ఉద్దం అన్యులకు అపకారం తలపెడితే అతడే దుష్ఫలితాలు పొందుతాడు. మునీశ్వరా! నువ్వు నే అంబరీషుని ఆశ్రయించు. నీకు శాంతి లభిస్తుంది.''

—0-

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–5

### దుర్వాసుని ఆపద నివారణ.

శుకమహర్షి పలుకు తున్నాడు. "రాజా! శ్రీమన్నారాయణ భగవానుని పలుకు లాలకించి ్న చక్ర జ్వాలలచే తపించి పోతూన్న దుర్వాసుడు అంబరీషుని సమీపించి అతనిపాదాలపై యాడు. ఆ దృశ్యాన్నిచూచి సిగ్గుపడ్డ అంబరీషుడు సుదర్శనాన్ని స్తుతిస్తూ–"సుదర్శన చక్ర నువ్వు అగ్ని స్వరూపుడవే కాదు. సర్వశక్తి సంపన్నుడవైన సూర్యస్వరూపుడవు కూడ, జ్యోతి పతిపతి అయిన చంద్ర స్వరూపుడవు కూడ నువ్వే. పృథ్వి వ్యాపస్తేజో వాయురాకాశాలూ, న్మాత్రలూ, ఇంద్రియ స్వరూపమూ కూడా నీ స్వరూపమే. భగవంతునకు విశేష ప్రీతి డవైన సహస్రార చక్రదేవా! నీ కివే నా ప్రణామాలు. సర్వ శస్త్రాస్త్రాలనూ అంతం చేయ ర్వ శక్తి సంపన్నా! పృథ్వీ సంరక్షకా! ఈ భూసురోత్తముని సంరక్షించు. ధర్మమూ, వచనమూ–నీవే. యాగాధిపతివీ, యాగానివీ నువ్వే, సర్వలోక సంరక్షకుడవూ, సర్వలోక పుడవూ నువ్వే. పరమపురుష పరమాత్మ సంబంధమైన ఉత్కృష్ట తేజస్స్వరూపుడవు నువ్వే. మర్యాదల నన్నింటినీ సంరక్షించునట్టివాడవు నువ్వు. దురాత్ములైన రాక్షసాసికాన్ని భస్మీ చేయడంలో నువ్వు ప్రచండాగ్ని స్వరూపుడవు. విశుద్ధతేజోమూర్తివై, మనోవేగాన్ని ంచే వేగం కలవాడవై జగత్త్రయ సంరక్షకుడవైన నువ్వు అత్యద్భుత కర్ముడవు. నీకు ం చేసి ప్రార్థిస్తున్నాను. ధర్మమయమైన నీ విశేష తేజస్సు ద్వారా అంధకారం నాశన

ంది. సూర్యాది ప్రకాశానికి రక్షక మవుతుంది. అపారమైనది నీ మహిమ. అల్పానల్ప భేద ముక్తమైన కార్యకారణ రూపమైన యీ విశ్వమంతా నీ స్వరూపమే. సుదర్శనా! నిన్ను పగలవా రెవరూ లేరు. నిరంజనుడైన పరమాత్మ-దానవులపై నిన్ను ప్రయోగించిన వేళ-వారి సర్వాంగాలనూ ఖండించే వేళలో విశేషంగా భాసిల్లుతూ వుంటావు. జగద్రక్షకా! గంలో ఏ ప్రహారాన్నైనా నువ్వు సహించ గలవు కానీ ప్రహారాన్ని సహించగల వీరులు స్త్రాస్త్రాలు కానీ లేవు. నువ్వు నన్నూ, నా వంశాన్నీ అనుగ్రహించి దూర్వాసునికి రక్షణను దవుగాక! నేను దానధర్మ యాగాదులు చేసిన వాడనే అయితే, మా వారందరూ భూసుర తలుగా భావించి ఆరాధించునట్టివారే అయితే నువ్వు దుర్వాసుని అనుగ్రహించెదవు గాక! పాణులయందూ—నేను పరమాత్మను సందర్శించునట్టి వాడనేఅయితే దుర్వాసుని తాపం పనుగాక!'' అని అర్థించాడు. ఆశ్చర్యం. అంబరీషుడలా ప్రార్థించడంతో సుదర్శచక్రం ంది. దానితో దూర్వాసుడు శాంతచిత్తుడై అంబరీషుని పరి పరి విధాల ఆశీర్వదించి

•

"భగవద్భక్తుల మహిమను తిలకించి నేను ధన్యుడనయ్యాను, అంబరీషా! నీకు నేను మహా ం చేసినా నువ్వు నా శుభాన్నే కోరినావు. భక్తజనవత్సలుడైన పరమాత్మ చరణార ఆశ్రయించినవారికి కష్టకార్యమేముంటుంది? సజ్జనులు పరిత్యజించ జాలని దేముంటుంది? మయమైన భగవన్నామ శ్రవణ మాత్రాన జీవుడు మలిన రహితుడు — పాప దూరు డవు అట్టి దశలో ఆ దేవ దేవుని రాజీవ చరణాలను ఆశ్రయించిన దాసునకు కర్తవ్య మేమి ది? రాజా! అంబరీషా! కరుణారసహృదయా! నా అపరాధాన్ని మన్నించి ప్రాణ దానం న్న కాపాడినావు.'' అన్నాడు.

శుకుడు — "రాజా! దుర్వాసుడు పరుగెత్తి వెళ్ళింది మొదలు ఆ క్షణం వరకూ అంబ భుజించ లేదు. అతనికై నిరీక్షిస్తూ వుండి పోయాడు. అప్పుడతడు ఆ మహర్షి చరణాలకు ల్లి భోజనం చేయించాడు. అతిధికి యోగ్యమైన ఉత్తమ వస్తువులనే పెట్టాడు. తృప్తుడైన డు ఆదరంగా పలికాడు—''రాజా! ఇక నువ్వు భుజించు. పరమ భక్తా! అంబరీషా! నీ

ం, స్పర్శ, సంభాషణ, ఆతిథ్యాదులచే నేను విశేషంగా సంతసించాను. అమరధామంలో
ు కాంతలు నీ విమలోజ్జ్వల యశస్సును పదే పదే గానం చేసెదరు గాక! భూమండల మంతా
వన యశస్సు వ్యాప్త మగును గాక!''

సంతుష్టుడైన దుర్వాసుడు అంబరీషుని కీర్తిస్తూ అతని అనుమతిపై నిష్కామ కర్మ
లు పురోగమించునట్టి సత్య లోకం వైపు పయనం సాగించాడు. సుదర్శన చక్ర భీతితో
సుడు లోకాలన్నీ పరిభ్రమించి తిరిగి అంబరీషుని సదనం చేరు నాటికి పూర్తిగా సంవత్సర
గడచి పోయింది. అంత కాలమూ అతడు జలపాన మాత్రంతో సంతుష్టు డయ్యాడు.
సుడు వెళ్ళిన తరువాత పవిత్రమైన శేషాన్నాన్ని భుజించి ధన్యు డయ్యాడు. తన వల్లనే
సునకు కలిగిన దుఃఖ, దుఃఖ విముక్తులకు — భగవన్మహిమయే కారణమని అతడు భావించి
ఆ మహారాజులో భగవన్మహిమాభివర్ధకమైన గుణా లెన్నో వున్నాయి. బ్రహ్మలోక
తంగా గల భోగాలన్నీ నరక ప్రాయాలే అని భక్తి భావంతో అంబరీషుడు గ్రహించాడు.

చివరకు అంబరీషుడు సత్పాత్రులైన పుత్రులకు రాజ్యాన్ని వప్పగించి అరణ్యాలకు పోయి
స్వరూపుడై పరమాత్మ యందు మనస్సును లగ్నం చేసి గుణ ప్రవాహ రూప సంసార
ల నుండి విముక్తి పొందాడు.

పరమ పవిత్రమైన యీ అంబరీషోపాఖ్యానాన్ని మానవుడు పఠించినా, ఆలకించినా భగ
ుడై తరిస్తాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9    అధ్యాయం-6

### మాంధాత-సౌభరి ఋషుల గాథలు.

శుకమహర్షి పలుకుతున్నాడు- "పరీక్షన్నరపాలా! విరూప కేతుమంత శంభు నామాలుగల ా అంబరీషుని పుత్రులే. అందులో విరూపునకు పృషదశ్వుడుపుట్టగా వానికి రథీతరుడు ాడు రథీతరునికి సంతానంలేదు. అంత అతడు వంశాభివృద్ధికై అంగీరసమహర్షిని ఆశ్రి ా ఆ మహాతపోధనుడు - రథీతరుని భార్యయందు బ్రహ్మతేజస్సంపన్నులైన అనేక ప్రభవింపజేశాడు. వారందరూ అంగీరసగోత్రీకులయ్యారు. వారే రథీతర వంశప్రవర్తకు ు, వీరు క్షత్రియోప భూసురులు కావడంవల్ల - నాటినుండీ క్షత్రియ - బ్రాహ్మణులు యీ ారితో బాంధవ్యాలు ఏర్పరచుకున్నారు.

మనువు తుమ్మగా - ఆతని నాసికనుండి ప్రాదుర్భవించినవాడు 'ఇక్ష్వాకువు' గాఖ్యాతి ). ఆతనికి శతసంఖ్యలో పుత్రులు కలిగారు. అందులో వికుక్షి, నిమి, దండకులు ముగ్గురూ ు ఇక్ష్వాకు నందనులలో యిరవై ఐదుగురు ఆర్యా వర్త పూర్వభాగానికి, యిరవై ఐదు శ్చిమభాగానికి, జ్యేష్ఠులూ ముగ్గురూ మధ్యభాగానికీ మిగిలిన నలభైఏడుగురూ దక్షిణాది ాలకూ అధిపతులయ్యారు. ఒకానొక సమయంలో మహారాజైన ఇక్ష్వాకువు అష్టకశ్రాద్ధం ుకుక్షిని పిలిచి పవిత్రమైన పశుమాంసం తెమ్మని నియోగించాడు. వికుక్షి - జనకుడైన ు ఆదేశానుసారం వనాలకుపోయి వేటాడుతూ శ్రాద్ధధర్మం మరచి ఆకలితో కుందేలు ున్ని తినేశాడు, తరువాత గృహం చేరాడు. శ్రాద్ధ పదార్థాలపై జలప్రోక్షణ వేళలో యీ ు - భుక్త శేషాలు, శ్రాద్ధయోగ్యాలు కావన్నాడు. కులగురువైన వశిష్ఠుడు ఇక్ష్వాకురాజు ు తెలిసికుని ధర్మోల్లంఘనకారణంగా వికుక్షిని రాజ్యాన్నుండి బహిష్కరించాడు. ఆనంత ్వాకువు - వశిష్ఠునిద్వారా జ్ఞానంపొంది యోగంద్వారా దేహత్యాగంచేసి పరమపదం పొందిన

రాత - వికుక్షి నిజరాజధానికివచ్చి భూమండలాన్ని శాసించసాగాడు. వికుక్షికి శశాదనుడని పేరు ప్రఖ్యాతమయింది. అతడు అనేక యాగాలద్వారా భగవంతుని ఆరాధించాడు. వికుక్షి ఃరుడు పురంజయుడు అతనికి ఇంద్రవాహి, కుత్స్థ - అనే నామాలున్నాయి.

సత్య యుగాంతంలో జరిగిన సురాసుర సంగ్రామంలో అమరులు పరాజితులై పురంజయుని ముం కోరగా అతడు-"ఇందుృడు నాకు వాహనమయితే నేనీయుద్ధం చేస్తాను" అన్నాడు,ఆదిలో ంద్రుడు వ్యతిరేకించినా - పరమాత్మ ఆజ్ఞకు బద్ధుడై వృషభరూపాన్ని ధరించి పురంజయు ాహనమయ్యాడు. పరమాత్మ నిజానంత శక్తితో పురంజయుని అనంతశక్తి సంపన్నుణ్ణి ు. శక్తిసంపన్నుడైన ఆ మహావీరుడు శరశరాసన కవచధారియై వృషభవాహానాన్ని అధిరో ాగానే అమరులు అతణ్ణి ప్రశంసిస్తూ ఆయుధధారులై అతన్ని వెంబడించారు. వృషభ ురానికి 'కకుత్' అన్న పేరువున్నది. దానిని అధిష్ఠించడం వల్ల అతనికి 'కకుత్స్థ' నామం మయింది, అతనివల్లనే తద్వంశానికి కకుత్స్థవంశమన్న పేరువచ్చింది. పురంజయుడు అసు ఎదిరించి ఘోరంగా పోరసాగాడు. అతని కెదురైనిలచిన రాక్షసవీరుడల్లా యమసదనం ంటున్నాడు. ఆ చక్రవర్తి ప్రళయకాల ప్రచండాగ్ని సన్నిభంగా శరాలనువర్షింప జేస్తు . రాక్షససైన్యం చెల్లాచెదురై పలాయనం సాగించింది.అసురులందరికందరూ నిజనివాసాలు ిలు దాచుకున్నారు. అలా రాక్షసులందరినీ జయించి పారద్రోలి పురంజయుడు సర్వై సంపన్నమైన స్వర్గరాజ్యాన్ని మహేంద్రునికి సమర్పించాడు. పురంజయుడు పురాలను పడం కారణంగా పురంజయుడనీ, ఇంద్రుడు వాహనం కావడంవల్ల ఇంద్రవాహుడనీ, ుయొక్క కకుత్స్థస్థానం అధిష్ఠించిన కారణంగా 'కకుత్స్థుడనీ అతడు ప్రసిద్ధిచెందాడు. ుని కుమారునిపేరు సేనుడు, అతనికుమారుడైన పృథునకు విశ్వరంధి, అతనికిచంద్రుడు నకు యువనాశ్వుడు, అతనికి శాబస్తి కల్గినారు. అతడు నిర్మించిన నగరానికి శాబస్తీనగర పువచ్చింది. శాబస్తికి బృహదశ్వుడు, అతనికి కువలయాశ్వుడు కవిగారు. ఉత్తంకమహర్షి ర్థం కువలాయాశ్వుడు తనఇరవై ఒక్కమంది కుమారులనూ వెంటబెట్టుకుని ధుంధుమార ాక్షసుణ్ణి అంతంచేశాడు. నాటినుండీ అతడు ధుంధుమారుడన్న పేరుతో ఖ్యాతి గాంచాడు. మారుని ముఖాగ్నితో - కుమారులందరూ భస్మంకాగా దృఢాశ్వ। కపిలాశ్వ భద్రాశ్వఅనే ు మాత్రమే బ్రతికారు. దృఢాశ్వునకు కృశాశ్వుడు, వానికి సేనజిత్తు, అతనికి యువనా

ు జన్మించారు. శతపత్నులుకల యువనాశ్వుడు సంతానశూన్యుడు కావడం వల్ల భార్యలనంద
ెంటబెట్టుకుని అరణ్యాలకుపోయి మహర్షులను ఆశ్రయించాడు. అనుగ్రహించిన మహర్షులు
కి సంతానాన్ని ప్రసాదించే సంకల్పంతో అతనిచే మహేంద్రయాగం చేయించారు. ఓ నాటి
దాహపీడితుడైన ఆరాజు యాగశాలలో మహర్షులు నిద్రావస్థలోవుండగా మంత్రపూతమైన
ను పానంచేశాడు. మరునాడు వుదయం మహర్షులు లేచిచూసేసరికి పాత్రలో మంత్రపూత
ం లేక పోవడంతో-వాటిని పానం చేసినవారెవరని ప్రశ్నించగా యువనాశ్వుడు తానే పానం చేశా
ుడు పలికాడు. అంత మహర్షులు విధి బలీయమన్నారు. ప్రసవకాలం సమీపించేసరికి
నాశ్వుని దక్షిణపువైపు కుక్షిని చీల్చుకుని ఓ బాలుడు వుదయించాడు. పాలకోసం ఏడ్చేబాలుని
ఎవరిద్వారా వీనికి పాలనిప్పించాలని మహర్షులు యోచిస్తూండగా మహేంద్రుడు వచ్చి తన
ు వాని నోటిలోవుంచాడు. 'మాం ధాతా' అంటూ మహేంద్రుడే అనుగ్రహించడంవల్ల ఆత
ాంధాత నామం ఏర్పడింది. గర్భం చీరబడినా మహర్షుల ప్రభావం వల్ల యువనాశ్వుడు
ంచ లేదు. అతడు వనాలలోనే వుంటూ తపస్సు చేసుకుంటూముక్తిని పొందాడు. రావణాది
ుకు యీబాలుడు భయంకరుడవుతాడని తెలిసిన దేవేంద్రుడు - అతనికి 'త్రసదస్యు' అని
రణం చేశాడు. 'ప్రసదస్యు' అనే మారుపేరుకల మాంధాత భగవదనుగ్రహపాత్రుడై
ు వర్ధిల్లగా యావత్ భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా పాలించాడు. ఆత్మజ్ఞాని అయిన
జు తనకు కర్మాసక్తి లేకపోయినా బహుదక్షిణలతో కూడినయాగాలు అనేకంగాచేశాడు,
యాతీతుడూ, సర్వాత్ముడూ, సర్వదేవతాస్వరూపుడూ, అయిన యజ్ఞపురుషుని అతడు
ధనచేసాడు. భగవదతిరిక్తమైన వస్తువన్నదేదీలేదు. యాగసామగ్రి, మంత్ర, విధివిధాన,
యజమాన,ఋత్విజ, దేశ,కాల ధర్మాదులన్నీ భగవత్ స్వరూపాలే అయివున్నాయి.సూర్యో
సూర్యాస్తమయ పర్యంతంగా గల పృధ్వి అంతా మాంధాత ఏలుబడిక్రిందఉంది.

శశిబిందురాజపుత్రి అయిన బిందుమతిని మాంధాత పరిణయంచేసుకున్నాడు. ఆమెవల్ల
తకు పురుకుత్స, అంబరీష, ముచుకుందులనేవారు జన్మించారు. అంతేకాక యాభైమంది
లు కూడ ఆ దంపతులకు కలిగారు. వారందరి కందరూ మహర్షిఅయిన సౌభరిని వరించి
ం చేసుకున్నారు.

తపోధనుడైన సౌభరియమునలో మునిగి జలస్తంభన శక్తితో తపస్సు చేస్తున్నాడు. పరి
పత్నీ పుత్ర సమేతంగా మత్స్యరాజు ఆనందంగా విహరించడం గమనించి సౌభరి వివాహ
య్యాడు. తపస్సుమాని మాంధాత చక్రవర్తి దగ్గరకువచ్చి – "రాజా! నీ పుత్రికలలో ఒక
ాకిచ్చి పెళ్ళిచెయ్యి." అని కోరగా– "మునీంద్రా! స్వయంవరంలో నా కుమార్తెలలో నిన్ను
వ దానిని నువ్వు పెళ్ళిచేసుకో" అన్నాడు. సర్వజ్ఞుడైన సౌభరి మాంధాత మనస్సు గ్రహించాడు
ునైన నాకు యీ రాజు తనపుత్రికనీయగోరడంలేదని తెలుసుకున్నాడు. శరీరం ముడతలు
ాలు తెల్లపడి, అస్తవ్యస్తరూపంలో వుండే నాకు తన సుకుమార పుత్రికనిచ్చి వివాహంచేసి
్రీ నన్ను ప్రేమించలేదు. తద్వారా ఆమె భ్రష్టకావచ్చును. ధార్మికుడు కావడం వల్ల యీ
ర్తి స్వధర్మరక్షణ భావంతో సక్రమంగానే సలహా నిచ్చాడు." అనుకుంటూ సౌభరి ఋషి
కాంతలు సయితం ఆకర్షించునట్టి సుందరయౌవన రూపంలో తన ఆకారాన్ని తపఃశక్తితో
కుని అపర మన్మధునిలా సాక్షాత్కరించాడు.

తరువాత అంతఃపుర సంరక్షకులు సౌభరిని అంతఃపురంలో ప్రవేశపెట్టగా చూసిన ఆ
్యలందరూ ఆతణ్ణివరించారు. సోదరీభావాలను కూడ విస్మరించి సౌభరిని తాను ప్రేమించా
తానువరించినానంటూ తలదించుకోసాగారు. అది గమనించిన సౌభరి – చక్రవర్తిని అంగీ
కేసి యాభైమంది రాజపుత్రికలనూ తానేవివాహం చేసుకుని తీసుకువెళ్ళాడు. తన అపూర్వ
ోపశక్తితో ఆ మహర్షి అమరావతిని మైమరపించే నగరాన్ని సృష్టించాడు. అందులో
ఉద్యానవనాలూ, బహుమూల్యాలైన వస్తువాహనాలూ, నిర్మలజలయుక్త సరోవరాలూ,
ంక కమలాలూ, దివ్య శయ్యాసనాలూ, వస్త్రాభరణ, స్నాన, అనులేపన మాల్యాదులూ,
ు భోజనపదార్థాలూ, కలిగి సర్వసంపద్యుక్తుడైన సౌభరి ఆ స్త్రీలందరితో కలసి భోగాలన్నీ
ంచసాగాడు. ఒకచోట పక్షుల కిలకిలరాగాలూ, మరొకచోట భ్రమరనాదాలూ కలిగి,
గ సుందరులైన దాసదాసీజనం సేవిస్తూవుండగా వందిమాగధులకైవారాలతో మహేంద్రుణ్ణి
ం మురిపించేరీతిలో సౌభరి ఆనందిస్తూన్నాడు. ఆతనిగార్హస్థ్యజీవితాన్ని తిలకించిన మాంధాత
ర్తి కూడ ఆశ్చర్యచకితుడయ్యాడు.

ఋగ్వేదజ్ఞుడైన సౌభరి ఓ నాడు ఏకాంతంలో ప్రశాంతంగా కూర్చొని – "మత్స్య రాజు
గన్ని తిలకించి పులకించిన నేను మాయా వశుడనై మహోత్తరమైన నా తపశ్శక్తి నంతనూ
చేసుకున్నాను. అన్ని విధాలా అధఃపతనమై పోయాను. మదీయ బ్రహ్మతేజస్సు నాశ
పోయింది. కనుక మోక్షాసక్తుడు భోగాసక్తుల సంగాన్ని కూడ త్యజించాలి. ఇంద్రియాలను
లం కూడ బహిర్ముఖం కానీయ రాదు. ఏకాంత వాసంతో చిత్తాన్ని ఏకాగ్రంగా వుంచు
చిత్తాన్ని భగవదాయత్తం చెయ్యాలి. భగవత్ భక్తుల సాంగత్యమే చెయ్యాలి కానీ
సాంగత్యం ఎన్నటికీ పనికి రాదు. ఏకాంతంగా జలాలలో వుండి తపస్సు చేసుకునే నేను
మత్స్య పరివారంతో సాంగత్యం ఏర్పడి–ఏకాకినైన నేను వివాహం చేసుకుని యాభై
ను. సంతానంతో లెక్క వేయగా యిప్పుడు నా పరివార సంఖ్య ఐదు వేలకు మించింది.
వాసనల యందు సత్యత్వ బుద్ధి కలుగడం వల్ల మాయ నా బుద్ధిని హరించి వేసింది.
పార లౌకిక సుఖాసక్తిలో చిక్కుకుని, ఆశాపాశ బంధితుడనై భోగాసక్తిని అధిగమించ
త దుఃస్థితిలో పడిపోయాను." అని పరి పరి విధాల యోచించి పరితపిస్తూనే సౌభరి మరి
కాలం గృహంలోనే వుంటూ చివరకు విరక్తుడై సన్యసించి అడవులకు వెళ్ళి పోయాడు.
తమకు సర్వస్వమని భావించిన అతని పత్నులు కూడ అతనితో అడవులకు వెళ్ళి
రు. గత విశేషానుభవం కల సౌభరి సంయమి కావడం వల్ల శీఘ్ర కాలంలో శరీరేంద్రి
లను శుష్కింపజేసి ఆహవనీయాది అగ్నులతో కూడ తనకు తానుగా పరమాత్మతో
సుకున్నాడు. తమ భర్త మహోన్నత స్థితిని గుర్తించి సౌభరి పత్నులందరూ అతని
ంతో అతనితో సహగమనం చేసి అతడు పొందిన గతినే పొందారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-7

### త్రిశంకు, హరిశ్చంద్రుల గాథలు

శుకమహర్షి—"పరీక్షిన్నరపాలా! మాంధాత పుత్రులలో అంబరీషుడు శ్రేష్ఠుడని చెప్పినాను కదా! పితామహుడైన యువనాశ్వుడితణ్ణి పుత్రునిగా స్వీకరించాడు. అంబరీష నందనుడు యువనాశ్వ పుత్రుడయ్యాడు. యౌవనాశ్వునికి హారీతుడు కలిగాడు. మాంధాత వంశంలో యీ ముగ్గురూ అవాంతర గోత్రీకులయ్యారు. తమ సోదరి అయిన నర్మదను నాగులు పురుకుత్సునకు యిచ్చి పెళ్ళి చేశారు. వాసుకి ఆదేశానుసారం - నర్మద పురుకుత్సుని రసాతలం చేర్చగా భగవత్ శక్తియుతుడైన పురుకుత్సుడు వధార్హులైన గంధర్వులను అంతం చేశాడు. ఈ ప్రసంగాన్ని స్మరించిన వారికి వాసుకి అనుగ్రహం వల్ల సర్పభీతి వుండదు. పురుకుత్సునకు త్రసదస్యుడు, త్రసదస్యునకు అనరణ్యుడు, వానికి హర్యశ్వుడు, ఆతనికి అరుణుడు, ఆతనికి త్రిబంధనుడు కలిగారు. త్రిబంధన పుత్రుడు సత్యవ్రతుడు. త్రిశంకు నామ విఖ్యాతుడీతడే. గురుశాపం వల్ల త్రిశంకుడు చండాలుడయ్యాడు. విశ్వామిత్రానుగ్రహం వల్ల త్రిశంకుడు సశరీరంగా స్వర్గానికి పురోగమిస్తూండగా, దేవతలు యీతణ్ణి క్రిందకు త్రోసివేయ, విశ్వామిత్రుడు తన తపఃశక్తితో యితడు క్రిందకు పడిపోకుండ నిలపడం వల్ల యీతడు నేటికీ ఆకాశంలో వుండి పోయాడు.

ఈ త్రిశంకు పుత్రుడే హరిశ్చంద్రుడు. ఈతని కోసమే విశ్వామిత్ర, వశిష్ఠులిద్దరూ పక్షి రూపాలతో యుద్ధం చేశారు. ఎంత కాలం గడచినా తనకు సంతానం కలగక పోవడంతో హరిశ్చంద్రుడు వుదాసీనుడై—చిట్టచివరకు దేవర్షి నారదుని ఉపదేశానుసారం—సంతానార్థియై వరుణుణ్ణి ఉపాసించి "నాకే పుత్రుడు కలిగితే ఆతణ్ణే పశువుగా వరుణ దేవతాత్మకమైన యాగం చేస్తానన్నాడు. అంగీకరించిన వరుణుడు ప్రసన్నుడై 'నీకు పుత్రుడు కలుగును గాక!' అని వరమిచ్చి అంతర్ధానమయ్యాడు. వరుణుడు యాగం చేయుమంటూంటే హరిశ్చంద్రుడు అనేక రకాలుగా అనేక పర్యా

ు వాయిదాలు వేస్తూ వచ్చాడు. ఆ విషయం గ్రహించి రోహితుడు ప్రాణ సంరక్షణేచ్ఛతో
్యాలకు వెళ్ళి అక్కడ పరిభ్రమిస్తూ వుండగా వరుణుని ఆగ్రహం వల్ల తన తండ్రి మహో
్యాధితో బాధ పడుతూన్న వార్త విని స్వనగరానికి మరలి వస్తూండగా — సంతుష్టుడైన
ంద్రుడు — "రోహితా! యాగ పశువుగా అంతం కావడం కంటే తీర్థ యాత్రల ద్వారా
్న సద్వినియోగం చేయడం మంచి దంటాడు. ఇంద్రాదేశానుసారం రోహితుడు ఆరు సంవ
ం వరకూ అడవుల వెంబడి తీర్థ యాత్రలు చేసుకుంటూ సప్తమ వర్షంలో స్వనగరానికి
పోతూ—అజీగర్త నందనులలో మధ్యముడైన శునశ్శేపుని — ధనానికి కొని తండ్రికి ప్రణ
యాగ పశువుగా స్వీకరించుడని తండ్రికి వప్పగిస్తాడు. కీర్తిశాలియైన హరిశ్చంద్రుడు రోగ
ై—పురుషమేధంతో వరుణాది దేవతలను ఆరాధిస్తాడు. ఆ యాగానికి జమదగ్ని అధ్వర్యం
ంగా విశ్వామిత్రుడు హోతృ స్థానంలో వుంటాడు. వశిష్ఠుడు బ్రహ్మగా, అయాస్యుడు
ా వుంటారు. సక్రమంగా చేసిన ఆ యజ్ఞానికి మెచ్చి దేవేంద్రుడు హరిశ్చంద్రునికి
 రథాన్ని బహూకరించాడు. రాజా! శునశ్శేపుని మాహాత్మ్యం ముందు చెబుతాను. హరి
ని సత్య వ్రతానికి సంతసించి విశ్వామిత్రుడు అతనికి అవినాశనమైన జ్ఞానాన్ని కృప
ు. దాని వల్ల హరిశ్చంద్రుడు మనస్సును పృథ్వియందూ పృథ్విని జలమందూ జలాన్ని
లోను, తేజస్సును వాయువులోను దానిని ఆకాశమందు, దానిని అహంకారమందూ, దానిని
త్త్వంలోనూ దానిలో జ్ఞాన కళనూ ధ్యానించి అజ్ఞానాన్ని అంతం చేశాడు. అనంతరం
సుఖాను భూతిని పొంది జ్ఞాన కళను సయితం త్యజించి సర్వ బంధ ముక్తుడై అనిర్వచ
, అనుమాన ప్రమాణాతీతమైన స్వస్వరూప సంధానం ద్వారా విముక్తు డయ్యాడు.

—0—

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–8

### సగరోపాఖ్యానం.

శుకమహర్షి పలికాడు – రాజా! రోహిత పుత్రుడైన హరితునకు చంపుడు కలిగాడు. ని మీదనే చంపాపురం నిర్మించబడింది. చంపుని పుత్రుడైన విజయునకు కలిగిన భరుకు కుడు పుట్టాడు. వానికి పుట్టిన బాహుకుని శత్రువులు ఓడించగా అతడు పత్నీ సమేతంగా పాలయ్యాడు. వార్ధక్య భారంచే మరణించిన వానితో గర్భవతి అయిన అతని భార్య సహగమనం చేయ సంసిద్ధురాలు కాగా ఔర్వుడనే మహర్షి ఆమెను వారించాడు. సవతులు గర్భవతి అని తెలుసుకుని ఆహారంలో ఆమెకు విషం పెట్టారు. గర్భ శిశువుపై – దైవ ల్ల ఆ విషం పనిచేయ లేదు. కానీ అతడు విషంతో కలిసి జన్మించడం వల్ల మహర్షులా 'సగరుడు' అని పిలవసాగారు. ఆ సగరుడు పెరిగి పెద్దవాడై యశోధనుడై చక్రవర్తి డు. సగర చక్రవర్తి ఆచార్యుడైన ఔర్వ మహర్షి ఆదేశానుసారం – ఆయన ఘ, యవన, శక, హైహయ, బర్బరాది జాతుల వారిని శిక్షించాడు. కొందరిని లుగా, కొందరిని గడ్డాలూ మీసాలూ కలవారినిగా, మరికొందరిని ఖండించిన అరకేశాలు నిగా, మరికొందరిని విడివడిన కేశాలు కలవారిగా చేశాడు కౌపీన ధారులనుగా కొందరినీ, ధరించే వారినిగా కొందరినీ శాసించాడు. తరువాత సగర చక్రవర్తి ఔర్వ మహర్షి సారం – సర్వాత్మమయుడైన భగవంతుని అనుగ్రహార్థం – అశ్వమేధ యాగం చాడు. ఆ యజ్ఞంలో అతని ద్వారా విడువబడ్డ యాగాశ్వాన్ని మహేంద్రుడు అపహ . అప్పుడు సగర నందనులైన అరవై వేలమందీ – పితృాదేశానుసారం యాగాశ్వాన్ని ంచుకుంటూ గర్వంతో–పృథ్వినే త్రవ్వుకుంటూ ఈశాన్య దిశగా వెళ్ళి అక్కడ కూర్చుని చేస్తూన్న కపిల మహర్షి దగ్గరగా యాగాశ్వాన్ని చూసి–యితడే అశ్వాన్ని అపహరించా లు పెట్టుకుంటూ పరుగులు తీశారు, అంతతో ఆగక కేకలు వేస్తూ – "అశ్వాన్ని అ.హ

మే కాకుండ యితడు కళ్ళు మూసుకుని దొంగ తపస్సు చేస్తూన్నాడు." అన్నారు. పైగా
; ఇతడే–యితడిణ్ణి అంతం చెయ్యండి." అన్న కోలాహల పూర్ణమైన వారి పలుకులకు కపిల
కనులు తెరచాడు. తత్సమయంలో మహేంద్రుడు వారి బుద్ధిని హరించడంతో వారు కపిల
ని అవమానించ సాగారు. ఆ మహాపరాధం కారణంగా వారి దేహాలయందే అగ్ని
ప్రజ్వరిల్లి వారందరూ అక్కడే భస్మమై పోయారు. కపిలుని క్రోధాగ్నికి వారు
అయిపోయారంటే అది సముచితం కాదు. శుద్ధ సత్త్వ గుణాశ్రయుడైన కపిలునిలో
ణ ప్రధానమైన క్రోధానికి స్థానం లేదు. పృథ్వీ రజం ఎన్నడైనా అంబరాన్ని చుంబించ
మో కానీ కపిల మహర్షికి మాత్రం క్రోధం రాదు. ఈ సంసార సాగరంలోని వారికి
; శాస్త్ర రూప దృఢ నౌకను నిర్మించి అనుగ్రహించాడు. సాంఖ్య శాస్త్రజ్ఞుడు అవశ్యం
ు. కపిల మహర్షి స్వయంగా జ్ఞాని మాత్రమే కాదు, సాక్షాత్తూ పరబ్రహ్మయే. శత్రు
భావాతీతుడైన కపిలునియందు – సగర నందనులను అంతం చెయ్యాలన్న భావం ఎలా
ుంది ?

సగర చక్రవర్తి ద్వితీయ పత్ని అయిన 'కేశి' యందు 'అసమంజసుడు' అనే కుమా
లిగాడు. అతనికి కలిగిన కుమారుని పేరు అంశుమంతుడు. అంశుమంతుడు పితామహుని
ఆతని ఆదేశానుసారం సంచరిస్తూన్నాడు. గతించిన జన్మలో యోగి అయిన అసమంజ
– సాంగత్య విచలితుడై యీ జన్మ పొందాడు. అయినా పూర్వ జ్ఞానంతో – సంగ
డై బంధు మిత్రాదులకు వ్యతిరేకంగా వెర్రి పనులు చేస్తూన్నాడు. ఆటలాడుతూ తోటి
సరయూ నదిలో పారవేస్తూ ప్రజలకు వుద్విగ్నతను కలిగిస్తూండడం చూసిన అసమంజ
కుపితుడై అతని తండ్రి వాణ్ణి పరిత్యజించగా–అసమంజసుడు నిజయోగ బలంతో–నదిలో
యబడిన వారందరినీ పునర్జీవితులను చేసి అడవులకు వెళ్ళి పోయాడు. అది చూసి అయోధ్యా
ు అందరూ పరమానందం చెందారు. తమ బిడ్డలు తిరిగి రావడం చూసి వారి తల్లిదండ్రులు
ు ఆనందానికి మేరయే లేదు. యోగసిద్ధుడైన పుత్రుని పరిత్యజించి నందులకు చక్రవర్తి
పశ్చాత్తాపం చెందాడు. తరువాత పౌత్రుడైన అంశుమంతుని, అశ్వాన్వేషణకై పంపాడు.
న్వేషణకై బయలుదేరిన అంశుమంతుడు పిన తండ్రుల ద్వారా త్రవ్వబడిన సాగరతీరం
పురోగమించి–వారు భస్మమైన చోట అశ్వాన్ని చూసి, తత్సమీపంలోనే ఆసీనుడై యున్న

ంహర్షి చరణారవిందాలకు వందనం చేసి దోయిలించిన హస్తాలతో ఆయనను స్తుతించ
. — "బ్రహ్మ కంటె పరమైన దేవా ! నిన్ను ప్రత్యక్షంగా ఎంత వారైనా చూడ జాల
ు. అట్టి దశలో అజ్ఞానులమైన మా వంటి వారు నిన్ను ఎలా తెలుసుకో గలరు? సత్వ
ుగణాత్మకమైన, అసంఖ్యా జీవజాలమూ—మేలుకొన్నప్పుడు గుణమయ పదార్థాలనూ,
ాన్నీ విషయాలనూ, సుషుప్తినీ, అజ్ఞానాన్నీ తిలకిస్తూంటారు, బహిర్ముఖులై, భవదీయ
మోహితులైన వారందరూ బాహ్య వస్తువులనే తిలకించ గలరు. కానీ అంతర్దృష్టితో సర్వ
ూంతర్వర్తివైన నిన్ను చూడ జాలకున్నారు. అజ్ఞాన దూరులైన సనకసనందనాది మహ
ర్వదా నిన్నే ధ్యానిస్తూ వుంటారు. మూఢుడనైన నేను నిన్నెలా ధ్యానించ గలను. మాయ,
గుణాలూ, తద్ద్వారా నిర్మితమైన లింగ శరీరం నీ యందు లేవు. నువ్వు నామ రూపాతీతు
ర్య కారణాతీతుడవైన సనాతనుడవు. జ్ఞానోపదేశానికై శరీరాన్ని ధరించిన నీకు నేను
ల్లు తున్నాను. ఈ సంసారంలో — సత్య భ్రాంతి కలవారై మానవులు ఈర్ష్య, లోభ
ులకు వశులై దేహ గేహ మోహంలో చిక్కుకుని పరిభ్రమిస్తూ మాయా నిర్మితమైన
చక్రంలో పడి పరిభ్రమిస్తూంటారు. సర్వ భూతాంతరాత్ముడవైన నీ దర్శనం వల్ల
ం నాశనమై నాకు ఆనందం కలిగింది.

శుకమహర్షి పలుకు తున్నాడు — "రాజా! అలా అంశుమంతుడు స్తోత్రం చెయ్యగా కపి
ంతుష్టుడై—"వత్సా! ఈ హయం నీ పితామహుని యాగ పశువు. దీనిని నువ్వు తీసుకు
నీ పిన తండ్రులు గంగాజలం వల్ల పవిత్రులు కావాలే కానీ అన్య మార్గమేదీ లేదు."
ని అంశుమంతుడు ఆనందించి కపిల భగవానునికి వందనం చేసి యాగాశ్వాన్ని వెంట బెట్టు
తగారికి సమర్పించగా సగరుడు యాగ శేషాన్ని పూర్తి చేసి అంశుమంతునికి రాజ్యాన్ని
ంచి విషయ వాసనల యందు నిస్పృహుడై ఔర్వ మహర్షి ఉపదేశానుసారం చరించి పరమ
ొందాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-9

### భగీరథోపాఖ్యానం - గంగావతరణ గాథ.

శుకమహర్షి పలుకుతూన్నాడు-"పరీక్షిన్నరపాలా! గంగను తీసుకురావడం కోసం అంశు
చిరకాలం తపస్సు చేసి కృత కృత్యుడు కాకుండానే తనువు చాలించాడు. అంశుమంతుని
దిలీపుడు. అతడు కూడ తపో మార్గంలో ఉండి కృతకృత్యుడు కాకనే అంతమై
. దిలీప నందనుడు భగీరథుడు. అతడు చేసిన ఘోరమైన తపస్సుకు ప్రసన్నురాలైన
రం కోరుకోమంటే-నువ్వు భూలోకానికి రావాలని అర్థించాడు. అంత ఆమె భగీరథుని
-వత్సా! నేను స్వర్గాన్నుండి భూతలం మీదకు ప్రవేశించే వేళలో నా తీవ్రతర వేగాన్ని
సమర్థులు వుండాలి. అలా కాని నాడు నేను మహా వేగంతో పృథ్విని చీల్చుకుని రసాతలా
పోతాను. భూతల వాసులందరూ తమ పాప సర్వస్వాన్నీ నాలో క్షాళన చేసుకుంటారు.
గం కూడ పాపమే కదా! అంది.

ఉపర్యుక్త రీతిని పలికిన గంగ పలుకు లాలకించి భగీరథుడు బదులు పలికాడు -"మాతా!
రాలనూ దారా పుత్ర ధనాదులనూ, వాంఛా సర్వస్వాన్నీ త్యజించి-స్వస్వరూపాను సంధా
బ్రహ్మ నిష్ఠులయిన జ్ఞానులు లోకాలను పావనం చేస్తూ పరోపకార పరాయణులై వుంటారు.
త్పురుషుల హృదయ మందిరాలలో శ్రీహరి సర్వదా విరాజిల్లుతూ వుంటాడు. వారి అంగ
నిన్నంటిన పాపాలు కూడ నశించి పోతాయి సర్వ చరాచర జీవకోటికీ ఆత్మ స్వరూపుడైన
భగవానుడే నీ వేగాన్ని భరించ కలడు. సూత్రంలో వస్త్రం ఓతప్రోతమైన రీతిగానే
శ్వమూ మహాదేవునిలోనే లీనమై యుంది." అంటూ పలికి భగీరథుడు మహాదేవుని
ని చేసుకోవాలని తీవ్రంగా తపస్సు చేసి అతణ్ణి మెప్పించి తన మనోభీష్టాన్ని వ్యక్తం

అంత ఆశుతోషుడు 'తథాస్తు' అంటూ గంగను శిరస్సున ధరించాడు. తరువాత భగీ
ఆ గంగను తన పితరులు భస్మమై పడివున్న ప్రదేశానికి తీసుకు వెళ్ళాడు. వాయువేగం
ాన్ని అధిరోహించి భగీరథుడు ముందుకు దూసుకుపోతూ వుంటే – అతన్ని అనుసరించి
మహా వేగంతో పల్లెలనూ, పట్టణాలనూ పవిత్రం చేస్తూ సగర కుమారులు హతమై భస్మ
దాల్చిన ప్రదేశం చేరింది. భూసురోత్తములను అవమానించడం వల్ల సగర పుత్రలు
పోయారు. గంగాజల సంపర్కం మాత్రంచే వారు పునీతులై స్వర్గం పొందారు. నియమ
ంగా గంగను సేవిస్తే లభించే పుణ్యాన్ని గురించి ఏమని ఎంతని వర్ణింతును ? ఇందులో
ం ఏమీ లేదు. శ్రీహరి చరణారవిందాలనుండి గంగా ప్రాదుర్భావం జరిగింది. ఆమెను
భక్తులతో స్మరించే వారు మహా ఋషు లవుతూన్నారు. నిర్మలు రవుతూన్నారు. అఖండ
తిగుణ బంధాన్ని సైతం త్రెంచుకుని శీఘ్రంగా భగవత్ స్వరూపు లవుతూన్నారు. అటి
ందు గల మహాత్మను సందేహించ బనిలేదు.

భగీరథుని కుమారుడు శ్రుతుడు, అతని పుత్రుడు నాభుడు. వీని కుమారుడు సింధు
, యితని పుత్రుడు అయుతాయువు. అయుతాయు నందనుడు ఋతుపర్ణుడు. ఋతుపర్ణుకీ
విశేష మైత్రి వుండేది, ఋతుపర్ణుడు నలునకు అక్ష విద్య చెప్పి అతని దగ్గర అశ్వ
యం నేర్చుకున్నాడు, ఋతుపర్ణ పుత్రుడు సర్వ కాముడు, అతని నందనుడు సుదాసుడు,
డు యితని పుత్రుడే. ఇతనికే మిత్ర సహుడన్న నామాంతరం వుంది. కొందరు యితణ్ణి
పాదు డంటారు. సౌదాస పత్ని మదయంతి. వశిష్ఠ మహర్షి శాపం వల్ల సౌదాసుడు
డయ్యాడు." అన్న శుకమహర్షిని పరీక్షిత్తు ప్రశ్నించాడు.

"మునీంద్రా! సౌదాసుడు మహాత్ముడు కదా ! అట్టి వాణ్ణి వశిష్ఠ మహర్షి ఎందుకు
పలసి వచ్చింది ?"

శుకమహర్షి బదులు పలుకుతూన్నాడు – "రాజా ! సౌదాసు డొకానొకప్పుడు వేటాడ
కు వెళ్ళాడు, అక్కడొక రక్కసుని అంతంచేసి వాని తమ్ముని వదిలివేశాడు. వాడు
దరుని మరణానికి ప్రతీకారం చెయ్యాలని తలచి సౌదాసుని పాక శాలలో కపట హృద
వంటల వానిగ చేరాడు. కాలం గడుస్తూండగా ఒకానొక నాడు వశిష్ఠ మహర్షి సౌదాసుని

రానికి అతిథిగా విచ్చేశాడు. తత్సమయంలో ఆ రాక్షసుడు వశిష్ఠునికి నరమాంసం వండి
గాడు. సర్వజ్ఞుడైన వశిష్ఠుడు అది గ్రహించి సౌదాసుని—'రాక్షసుడవై పో' అని శపించాడు.
'త యదార్థం గ్రహించి వశిష్ఠుడు ఆశాపం ద్వాదశ వర్ష పర్యంతం పరిమితం చేసి సౌదాసుని
గహించాడు. అంతా గ్రహించిన సౌదాసుడు అన్యాయంగా శపించిన వశిష్ఠుని శపింప సంసి
దోసిట నీళ్ళు పట్టి ఉండగా మదయంతి భర్తను వారించింది. సర్వే సర్వత్రా ప్రాణికోటి
న్నదని గ్రహించిన సౌదాసుడు కరుణతో ఆ జలాలను తన పాదాలమీదనే పోసుకోగా
పాదాలు నల్లబడ్డాయి. అందులకే అతనికి కల్మాష పాదుడన్న నామం వచ్చింది. అప్పుడే
సహుడన్న పేరు కూడ వచ్చింది అపై రాక్షసత్వ మేర్పడ అతడు అడవులలో తిరుగుతూ
యూతమై ఆనందిస్తూన్న బ్రాహ్మణ్య దాంపత్యాన్ని చూసి ఆకలితో పీడింపబడుతూన్న
షపాదుడు ఆ విప్రుణ్ణి పట్టుకున్నాడు. ఆనందానుభూతిలో యింకా తృప్తి పొందని ఆమె—
! నువ్వు రాక్షసుడవు కాదు మదయంతీ నాథుడవు, ఇక్ష్వాకు వంశంలో ప్రభవించిన మహా
వు. నేను సంతానేచ్ఛతో వున్నాను. మా దంపతుల కింకా కోరిక తీరలేదు. మమ్మల్ని
ట్టు. గుణశీల విద్యా తపో ధర్మాలు కలవాడు నా భర్త. చతుర్విధ పురుషార్థ సాధనమైన
గానవుణ్ణి హత్య చేస్తే పురుషార్థాలను అన్నింటినీ అంతం చేసినట్లే శక్తి సంపన్నుడవూ,
ధర్మజ్ఞుడవూ అయిన నువ్వు — పరమాత్మ సేవలో వున్న బ్రాహ్మణోత్తముడైన నా
సంహరించడం నీకు న్యాయమేనా ? తండ్రి ద్వారా పుత్రుడు అంతం కాకపోవడం వంటిదే
న నీ చేతిలో యీ బ్రాహ్మణోత్తముడు అంతం కాకపోవడమూను. సజ్జన సమాజంలో
పొందిన నువ్వు నా నాథుని అంతం చెయ్యడం ధర్మమని ఎలా భావిస్తూ వున్నావు ?
డైన యీతణ్ణే నువ్వు భక్షించాలనుకుంటే ముందు అతణ్ణి విడిచి నన్ను భక్షించు. నాథుడు
ని బ్రతికీ చచ్చినదానినే." అని ఆ భూసుర పత్ని రోదిస్తూన్నా వినకుండ గురు శాప
కుడైన సౌదాసుడు ఆతణ్ణి భక్షించి వేశాడు. అంత ఆ బ్రాహ్మణి ఆ రాక్షసుణ్ణి శపిస్తూ—
దాంపత్య సుఖానుభవంతో వుండగా నువ్వు నా భర్తను భక్షించినావు కనుక నువ్వు నీ
పొందుతూనే మరణింతువు గాక !'' అని శపించింది. తరువాత ప్రజ్వలితాగ్నిలో
చాలించింది.

కాలగర్భంలో పన్నెండేళ్లు గడచిపోయాయి. శాపవిముక్తుడై సౌదాసుడు స్వగృహం చేరి

ను కలియబోతూండగా విప్ర పత్ని శాపం స్ఫురణకు వచ్చి ఆగిపోయి కర్మ ఫలాన్ని
వవిస్తూ విధి వైపరీత్యానికి చింతిస్తూ సంతాన హీనుడై కాలం గడుపు తూన్నాడు. సంతా
సై అతడు కులాచార్యుడైన వశిష్ఠ మహర్షిని అర్థించగా ఆతపోధనుని దివ్యానుగ్రహం వల్ల
మంతి గర్భవతి అయింది. ఆమె గర్భం సప్త సంవత్సరాల వరకూ అలాగునే వుండి
ంది. అంత వశిష్ఠ మహర్షి ఆమె గర్భాన్ని ఆశ్మంతో (రతి)తో చేదించగా ఓ బాలుడు
డు. వానికి అశ్మకుడని నామకరణం చేశారు. వానికి మూలకుడు కలిగాడు. పరశురాముడు
ండలంలో క్షత్రియ నాశనం చేయు వేళ 'అశ్మకు'ని స్త్రీలు దాచి రక్షించడం వల్ల యితనికి
వచు డన్న పేరు కూడ వచ్చింది. జగత్తు క్షత్రియ హీనం కాగా యీతని వల్లనే పునః
శం వల్ల యితణ్ణి మూలకు డన్నారు. మూలకుని పుత్రుడు దశరథుడు. అతనికి ఐడవిడుడు,
విశ్వ సహుడు, అతనికి ఖట్వాంగుడు పుట్టారు. ఈ ఖట్వాంగుడే అమరుల అభ్యర్ధనపై
సంహారం చేశాడు. తరువాత తన ఆయుర్దాయం రెండు ఘడియలే ఉన్నదని గ్రహించిన
ంగుడు భగవంతునియందు మనస్సు లగ్నంచేసి మనసా యోచించ సాగాడు. నా వంశానికి
త్తములే ఇష్ట దేవతలు. వారిని అధిగమించి నేను నా ప్రాణాలకు సయితం విలువ
దారాపుత్రులు, ధన సంపదలూ, రాజ్యమూ కూడ నాకు విప్రోత్తములకన్న ప్రియ
కావు. బాల్యంలో కూడ నా మనస్సు అధర్మం వైపు మరల లేదు. పరమాత్మను వినా
శ్వంలో ఎక్కడా దేనినీ నేను చూడలేదు. అమరాధిపతులు వరం కోరుకోమంటే-విషయ
లోలుడనై నేను వరాలు కోరలేదు. సర్వ జీవన దాతయైన పరమాత్మనే సేవించాను.
లు సహితం సర్వత్రా విరజిల్లే పరమాత్మను గ్రహించజాలకున్నారు. అట్టి దశలో
ర్త్యులు పరమాత్మను ఎలా గ్రహించగలరు? చరాచర జగద్వస్తు జాలమంతా మాయా
మే. ఇంద్రజాలకుడు ఆకసంలో గంధర్వ నగరాన్ని సృజించినట్లే యీ విశ్వమంతా
కల్పితమైనదే. ఈ లోకం అసత్యమైనదే, లేనిదానిని ఉన్నట్లుగా చేసేది అజ్ఞానమే.
భావనయందు లయమై నేను సర్వాన్నీ పరిత్యజించాను. కేవలం పరమాత్మనే శరణు
." అనుకున్నాడు.

తాజా: దేహాత్మ భావం నాశనం కావడంతో ఖట్వాంగుడు స్వస్వరూపానుభూతిని పొంద

డు. సూక్ష్మతి సూక్ష్మమై, శూన్యం కాని పరమ సత్యమైనదే పరబ్రహ్మం. అట్టి బ్రహ్మను
గలిగాడు ఖట్వాంగుడు.

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–10

శుక మహర్షి పలుకుతూన్నాడు – "రాజా! ఖట్వాంగ పుత్రుడైన దీర్ఘ బాహువు విశాల
సంపన్నుడైన రఘు మహారాజుకు జనకు డయ్యాడు. రఘు నందనుడే అజమహారాజు.
పుత్రుడే దశరథ చక్రవర్తి. బ్రహ్మాది బృందారక సందోహ ప్రార్థనపై సాక్షాత్పర
అయిన శ్రీమన్నారాయణ భగవానుడు అంశాంశ రూపాన చతుర్ధాత్మనా దశరథునికి
లక్ష్మణ, భరత, శత్రుఘ్న నామాలతో అవతరించాడు. జానకీ పతి అయిన శ్రీరామ
ని దివ్య లీలా వైభవాదులను తత్త్వవేత్తలైన మహర్షులు అనేక విధాల వర్ణించినారు.
విషయాలు నువ్వు కూడ అనేక పర్యాయాలు ఆలకించియే వున్నావు.

శ్రీరామచంద్రుడు పితాదేశానుసారం రాజ్య వైభవాదులను పరిత్యజించి అడవులకు
. శిరీష సుమ సమ కోమలాంగుడైన ఆ పురుషోత్తముడు అరణ్యాలలో పాదచారియై
స్తూ వుంటే హనుమల్లక్ష్మణులు అతని పాదాలు వత్తుతూ వుండేవారు. శూర్పణఖ యొక్క
కర్ణాలను ఖండించడం కారణంగా రామచంద్రునికి సీతా వియోగం కలిగింది. పత్నీ వియోగ
క్రోధానల జ్వాలలకు సాగరు నంతటివాడు భయకంపితుడైపోయాడు. తరువాత సేతు
ం చేసి రావణుని నగరంలో ప్రవేశించి రాక్షస దూపారణ్యాన్ని దావాగ్ని సమంగా భస్మీ
చేసిన కౌశల్యా నందనుడైన శ్రీరామచంద్రమూర్తి మనలను సంరక్షించును గాక!

* * * *

విశ్వామిత్రుని యాగంలో శ్రీరామచంద్రుడు లక్ష్మణ సమేతంగా మారీచ సుబాహు
గా గల పద్నాలుగు వేల మంది రాక్షసులను సంహరించాడు. వారందరూ మహా మాయావులు.
లాపురంలో జరుగబోయే జానకీ స్వయంవరానికి అన్ని దిశలనుండీ వీరాధి వీరులు అనేక
ది విజయం చేశారు. స్వయంవర వేదిక సన్నిధికి శివ చాపం తీసుకు రాబడింది. పన్నెండు
ాల బండిమీద ఆ ధనుస్సును అతి కష్టంమీద మూడు వేల మంది మహా వీరు లయిన
లు తీసుకు వచ్చారు. మత్తగజం అవలీలగా చెరకు గడను రెండు ముక్కలుగా విరిచివేసినట్లు
చంద్రుడు ఆ ధనుస్సును రెండుగా ఖండించి వేశాడు. శ్రీహరి వక్షఃస్థల విరాజమాన అయిన
క్ష్మియే జనకుని సదనంలో సీతగా భాసిల్లుతూన్నది. ఆమె — గుణ శీల వయో రూప
శ్యాలలో శ్రీరామచంద్రునకు అనురూపవతియై వుంది. సీతను పరిణయమాడి రామచంద్రుడు
ధ్యా నగరానికి మరలి వస్తూండగా మధ్యే మార్గంలో 21 పర్యాయాలు క్షత్రియాధములను
మాడిన భార్గవరాముడు ఎదురైనాడు. రామ పరశురాములకు సంవాదం జరిగింది. పర్యవ
న రామచంద్రుడు పరశురాముని తేజస్సు హరించాడు. ఆ తరువాత పితృవాక్య పరిపాల
అడవులకు బయలుదేరాడు. పూర్వం దశరథుడు కైకకు ప్రదానం చేసిన వరద్వయం
ంగా రామునికి వనవాస క్లేశం కలిగింది. రాజ్యలక్ష్మినీ, బంధు బాంధవ వైభవోపేత భవన
గ్యాన్నీ పరిత్యజించి అతడు సీతా లక్ష్మణ సమేతంగా అరణ్యాలకు వెళ్ళాడు. పూర్ణ
ు, ఆత్మ స్వరూపి అయిన శ్రీరామునికి దేనియందూ ఆసక్తి లేకపోవడం నైసర్గికమే.
వాస వేళలో కామ కలుషితాంత రంగయైన శూర్పణఖ నాసికా కర్ణాలను ఖండించి విరూపిని
చాడు. దానితో ఆ రాకసి సోదరులయిన ఖర, దూషణ, త్రిశిర నామాలు కల రాక్షసులు
ంగు వేలమంది అసురులతో సహా వచ్చి ఎదిరిస్తే వీర రాముడు ఏకాకిగా వారి నందరినీ
సంహరించివేశాడు, క్లేశ భూయిష్ఠమైన ఘోరారణ్యంలో నల్దిశలా పరిభ్రమిస్తూ వారు
గడుపుతూండగా సీతా సౌందర్య రూప లావణ్య విషయాల నాలకించిన రావణాసురుడు —
హితుడై మాయ లేడి రూపంలో మారీచాసురుని పర్ణశాల సమీపానికి పంపగా — జానకీ
భీష్టానుసారం రామచంద్రుడు ఆ లేడిని వెన్నంటి దూరంగా వెళ్ళాడు. తరువాత మాయ
పంలో వచ్చినవాడు కపట రాక్షసుడని గ్రహించి రామచంద్రుడు మారీచుని అంతం చేశాడు.
పర్ణశాలకు దూరం కావడమూ, లక్ష్మణుడు కూడ సీత దగ్గర లేకపోవడమూ గ్రహించి

షరుడు సీతాదేవిని అపహరించుకుని లంకా నగరానికి తీసుకు వెళ్ళిపోయాడు.రామచంద్రుడు
తి పర్ణశాలలో లేకుండుట గ్రహించి తమ్ముళతో సహా అడవులన్నీ వెతుకుతూ దీనుని
స్త్రీలయందు విశేషాసక్తు లయిన వారి గతి యిదే అన్నట్లు జగత్తుకు అదర్శప్రాయంగా
స్తూ పరిభ్రమిస్తూన్నాడు. క్రమంగా తన భక్తుడై, సర్వ కర్మ బంధ విముక్తుడైన జటా
దహన సంస్కారం చేసి, కబంధ రాక్షసుని అంతం చేసి సుగ్రీవాది వానరులతో
చేసి ఏక మాత్ర బాణంతో వాలిని నేలకూల్చి వానర పరివార సహకారంతో జానకీ
అన్వేషణ ఆరంభించాడు. బ్రహ్మేంద్రాది బృందాకర జన సందోహంచే వందనా లందు
న్న పరబ్రహ్మ శ్రీరామచంద్రుడు కపీ సేనా పరివృతుడై సాగర తీరం చేరాడు. ఉపవా
ద్వారా సాగరుడు ప్రసన్నుడు కాకపోవడంతో క్రోధోద్దీపిత నేత్రుడైన శ్రీరామ
ప కాలోత్తాల తరంగ ఘోషతో రాజిల్లే సాగరుడు భయ కంపితుడై స్వస్వరూపంతో
విధేయుడై శాంతంగా విచ్చేసి చేతులు జోడించి రామచంద్రులకు పాదాక్రాంతుడై —
! చరాచర జగన్నాథా! ఆది కారణా! పరివర్తన శీలమైన విశ్వంలో ఏకమాత్ర రస
డమైన నిన్ను ఎలా గ్రహించగలము? సర్వ గుణాధి నాథా! నువ్వు సత్త్వ గుణాన్ని
వగా అమరులు రజో గుణాన్ని గ్రహిస్తే ప్రజాపతులూ, తమోగుణ గ్రహణ మాత్రాన
ణాలూ ప్రాదుర్భవిస్తూన్నాయి. వీర శ్రేష్ఠా! స్వేచ్ఛగా నన్ను దాటి రావణుని అంతం
నకీదేవిని గ్రహించెదవు గాక! నాపై వారధిని నిర్మించి పయనం చేస్తే నీ కీర్తి దిగంత
మై ఆచంద్ర తారార్క మవుతుంది భవిష్యత్కాలంలో దిగ్విజయ యాత్రలు సాగించే
రాజు లందరూ యిక్కడకు విచ్చేసి సేతుబంధన రూపమైన నీ పవిత్ర కీర్తిని గానం
' అన్నాడు.

అనంతరం రామచంద్రుడు వీర వానర సేనా సహకారంతో వృక్ష పర్వత శిఖరానీకాన్ని
వారథి నిర్మాణం చేయించాడు. అతి బల పరాక్రమ సంపన్ను లయిన వానర వీరులు
ాహంతో గిరి శిఖరాలను పెల్లగించి తెస్తూ వుంటే వాటిపై గల మహా తరువులూ
ా కంపించి మహా ధ్వనులు కలిగాయి. సేతుబంధనానంతరం — రామచంద్రుడు విభీషణు
యమిచ్చి — అతని సలహాపై సుగ్రీవాంగద జాంబవంత, హనుమంత, నల నీలాదు
డి వానర మహా సేనలతో లంకాపురాన్ని ముట్టడించాడు. అంతకుముందే హనుమంతుని

లంకాపురం ధగ్ధం చేయబడింది. వానర సైన్యం లంక ముట్టడించి విహార ప్రదేశ, ద్వార, ప్రాకార, కోశాగార, ధన, ధాన్యాగారాదులనూ, ఆయుధ శాలలనూ ధ్వంసం చేసే — మత్తేభాలు నదిని కలచివేసేటట్లు లంకా నగర మంతా ఛిన్నాభిన్నమై అస్తవ్యస్తం కాసాగింది. అది చూసిన రావణాసురుడు కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, దుర్ముఖ, సురాంతక, ప్రహస్త అతికాయ, వికంపనాది మహా వీరులైన అనుచరులనూ ఇంద్రజిదాది పుత్రులను, ... — సోదరుడు. జగద్భక్షకుడైన కుంభకర్ణునీ కూడ యుద్ధానికి పంపాడు. ఆ రాక్షస సైన్యం త్రిశూల, కరవాల, ధనుర్బాణ, ప్రాస, ఋష్టి, శక్తి, తోమర, గదాది సర్వాయుధాలు ధరించి రణరంగంలో అడుగుపెట్టడంతో — రామచంద్రుడు — సుగ్రీవ, లక్ష్మణ, హనుమ, గంధ మాదన, నీల, అంగద, జాంబవంత, పనసాది మహా వీరులతో — రాక్షస సైన్యాన్ని ఎదిరించాడు. శ్రీరాముడు సేనాధిపతులైన అంగదాదులూ, రథ గజ తురగ, పదాతి వర్గంతో ... సైన్యాన్ని ఎదిరించి గిరి శిఖరాలతోను వృక్షాలతోనూ సంహరిస్తున్నారు. సీతా స్పర్శ ...ంచే నష్ట మంగళుడైన రావణుని— సైన్యం గతిమందే తేజోహీనమై ఉంది. కనుకనే కపి ...వణ సేనను సునాయాసంగా జయించ గలిగింది.

అసుర సేన అంతా అంతమవడం చూసి క్రుద్ధుడైన దశకంఠుడు పుష్పక విమానం ఎక్కి ...గా యుద్ధ సన్నద్ధు డయ్యాడు. ఇంద్ర సారధి మాతలి తీసుకు వచ్చిన ఇంద్రుని దివ్య ...ఎక్కి శ్రీరామచంద్రుడు సంసిద్ధంగా వున్నాడు. రావణుడు నిశిత శరాలతో రామచంద్రుని ...సాగాడు. అప్పుడు దశరథ రాముడు వానికి అభిముఖంగా నిలచి — "నీచుడా! యాగ ...ం నుండి శునకం పురోడాశాన్ని అపహరించినట్లు నేను లేని వేళ నా అర్ధాంగిని అపహ... నీ దుర్మార్గం హద్దులు మీరింది. నీవలె సిగ్గులేని పనులు చేసినవా డెవడున్నాడు? నన్ను ... అతిక్రమించ గలవా డున్నాడా? అహంకారంతో చేసిన కర్మ ఫలాలను అనుభవించక ... నీచే యిప్పుడే స్వకర్మ ఫలాన్ని అనుభవింప జేస్తాను." అంటూ వీర రామచంద్రుడు ...తం నిశిత శరాన్ని ప్రయోగించగా రావణుని హృదయ మర్మను రామబాణం విదీర్ణం ...డు పది ముఖాలనుండీ రుధిరాన్ని వమనం చేస్తూ కర్మ ఫలానుభవానంతరం పుణ్యాత్ములు ... నుండి నేల కూలినట్లు విమానం మీద నుండి తలక్రిందులుగా పృథ్విపై పడిపోయాడు.

ఞయంలో పురజన సహితంగా వాని పరివారమంతా 'అయ్యో అయ్యో!' అని రోదించ
ి. అనంతరం అసుర నారీ జన పరివేష్టితురాలై విలపిస్తూ మండోదరి రణరంగానికి విచ్చే
వారందరూ రామ లక్ష్మణ శరాగ్నులకు దగ్ధమై రణరంగంలో పడివున్న స్వజనులకై
చసాగారు. "నాథా! ప్రభూ! నీతోబాటు నేడు మేమందరం హతమై పోయినట్లే. ఒకా
డు లోకాలన్నీ నీ మహా పరాక్రమానికి భయం వల్ల కంపించి పోయాయి. యావత్
కోటీ 'రక్షించు — రక్షించు.' అని నిన్ను వేడుకుంది. నేడు నువ్వు అంతమైపోవడం వల్ల-
ర వైధవ్యం వల్ల యీ మహా నగరానికి యీ దుర్దశ ఏర్పడింది. ప్రభూ! సర్వమూ వున్న
కామాధీనుడవై — మహా సాధ్వి అయిన సీతాదేవి మహిమను గుర్తించ జాలక యీ
ం చిక్కుకున్నావు. ఈ రాక్షస కులమూ, మేమూ కూడ ఆనంద సాగరంలో మునిగి
. మాకూ, యీ నగరానికీ కూడ నేడు వైధవ్యం ఏర్పడింది. భోగ భాగ్యాలన్నీ అనుభ
వి యీ శరీరం నేడు శునక, శృగాల, గృధ్ర వాయసాలకు ఆహారమైతూన్నది. స్వకర్మల
నువ్వే పాప లోకాలను సృష్టించుకున్నావు. కేవలం కామాంధత్వం కారణంగానే నీకీ దుర
ఏడింది."

అనంతరం రామాదేశానుసారం విభీషణుడు రావణాది స్వజనులకు పితృ తర్పణాలంద
ృ మేధ విధ్యనుసారం అంత్యక్రియలు నిర్వర్తించాడు. తరువాత అశోకవనంలో శింశుపా
లంలో విరహ పీడితమై, కృశించిన దేహంతో ఉన్న పత్నిని చూశాడు. తన అర్ధాంగి
మలిన వస్త్రాన్ని ధరించి వుండడం చూసిన ఆతని హృదయం కరుణ రసంతో నిండి
ి. భర్తను సందర్శించిన జానకీదేవి హృదయ కమలం ప్రేమానందాలతో ప్రఫుల్లితమై
ి. తరువాత రామచంద్రుడు విభీషణుని లంకా రాజ్యాధిపతిగా చేసి,కల్పాంతం వరకూ గల
యాన్ని అనుగ్రహించి సుగ్రీవాది పరివేష్టితుడై సీతా లక్ష్మణ సమేతంగా పుష్పక విమానాధి
పద్నాలుగేండ్లు అరణ్య వాస దీక్ష సమాప్తమయే నాటికి అయోధ్యానగరం వైపు పయనం
డు. మధ్యే మార్గంలో సీతారాములపై బ్రహ్మాదులు పూలవాన కురిపించారు. ఇక్కడ
చంద్రుని అనంత కళ్యాణ గుణాలను చతుర్ముఖాది దేవతలు గానంచేస్తూ వుండగా-అక్కడ

గ్రామంలో భరతుడు గోమూత్ర పక్వమైన యవాగునే పానం చేస్తూ జటావల్కాల ధారియై
పై పయనిస్తూ వుండడం చూసిన రామచంద్రుని హృదయం కరుణతో నిండి పోయింది.
గమనాన్ని తిలకించిన భరతుడు — మంత్రి పురోహిత, పురజన పరిజన పరివేష్టితుడై
ామ లక్ష్మణాదులకు స్వాగతం పలుక ఎదురై వెళ్ళాడు. భూసుర శ్రేష్ఠులు వేద మంత్రాల
స్తూండగా వాడికి తోడై మంగళ వాద్యాలు దశ దశలా ప్రతిధ్వనించ సాగాయి. హేమ
ధ్వజ పతాకాలతో కూడిన రథాలూ, సర్వాంగాలంకృతాలయిన హయాలూ, సువర్ణ నిర్మిత
ారులయిన వీర సైనికులూ, లక్ష్మీ సంపన్నులయిన వైశ్య బృందమూ ఆభరణాలు అనే
అలంకరించుకున్న సుందర వీరాంగనలూ పదాతి వర్గమూ, మహారాజ యోగ్యాలైన ఛత్ర
ాదీ వస్తు సామగ్రితో భరతుని అనుసరించి ఆనందోత్సాహాలతో పురోగమిస్తున్నారు. రామ
ం మాత్రంచే భరతుని గళం గద్గద మయింది. శరీరం రోమాంచితమైనది. కనుల నుండి
ే బాష్పాలు జల జల రాల సాగాయి. ఆ త్యాగమూర్తి తీవ్రాతురతతో రామ పాద కమలా
వాలిపోయాడు. తత్సమయంలో ఉత్తర కోసల దేశ వాసులందరూ — తమ ప్రభువు
ం చిరకాలానికి కలగడంతో — ఆనంద పారవశ్యాన తను ఉత్తరీయాలను గాలిలో ఎగుర
జానకీ రాములపై పూల జల్లులు కురిపిస్తూ ఆనందంతో ఆడుతూ పాడ సాగారు,
ు పాదుకలను భరతుడు, చామరాన్ని విభీషణుడు, సుగ్రీవుడు వ్యజనాన్నీ, శ్వేత
న్ని హనుమంతుడూ ధరించి వున్నారు. ధనుర్బాణ తూణీరాలను శత్రుఘ్నుడూ, సీతా
ంభరిత కమండలాన్నీ, అంగదుడు ఖడ్గాన్నీ, జాంబవంతుడు డాలునూ చేబూని మహో
ో పాల్గొన్నారు. అందరినీ వెంటబెట్టుకుని శ్రీరామచంద్రుడు పుష్పక విమానాన్ని
హించాడు. నారీ జనం స్వస్థానాలలో ఆసీను లయ్యారు. వందిమాగదులు స్తోత్ర
సాగిస్తూన్నారు. గ్రహ, తారాదుల మధ్య చంద్రుడు భాసిల్లినట్లు తత్సమయంలో
ంచంద్రుడు వారందరిమధ్యా భాసిల్ల సాగాడు,

అభిమాను లందరి అభివందన, అభినందన లందుకుంటూ ఆ రఘువంశ సోముడు
ంచంద్రుడు అయోధ్యలో అడుగు పెట్టాడు. తత్సమయంలో అయోధ్యా నగరమంతా
ోత్సవ సంభరితమైపోయింది. రాజ భవనంలో ప్రవేశించిన శ్రీరామచంద్రుడు కౌశల్యాది
ా వశిష్ఠాది గురువులకూ ప్రణమిల్లి సమవయస్కులను మిత్రులను తన కన్న చిన్న

యథాయోగ్యంగా మధురంగా పలకరించి వారి గౌరవాదరాలు స్వీకరించి వారిని ఆనంద సాగ ఓలలాడించాడు. రఘురాముని అనుసరించి సీతా లక్ష్మణులు వ్యవహరించారు. తరువాత మహర్షి విధి విధానానుసారం. రామచంద్రుని జటలను తీయించి – సుధన్వాది గురు జనుల సహకారంతో చతుస్సాగరోదకాలతో అభిషేకించాడు. అనంతరం రఘురాముడు చీని చీనాం ధరించి అమూల్యాభరణ మాల్యాదులు ధరించాడు. అల్లే లక్ష్మణ భరత శత్రుఘ్నులూ, పీ కూడ సుగంధ ద్రవ్యాలతో స్నానాదులు చేసి అమూల్య వస్త్రాభరణ భూషణాదుల ంతు, సర్వజన పరివేష్టితుడై రామచంద్రుడు నవ్య దివ్య శోభలతో భాసిల్ల సాగాడు. రామ ని పాద కమలాలపై వ్రాలి భరతుడు సింహాసనాన్ని అధిష్ఠించుమని అర్థించడంతో ఆ ప్రభువు సింహాసనాసీను డయ్యాడు. సామ్రాజ్యాధీశుడై వర్ణాశ్రమ ధర్మానుసారం ప్రజ న్న తండ్రిలా ధర్మంగా పాలిస్తూ వుంటే అతని ప్రజలు కూడ అతణ్ణి పితృ సమంగా ంగా భావించి గౌరవించ సాగారు. సర్వజన సుఖ ప్రదాత అయిన రామచంద్రుడు రాజ్య చేసిన కాలం త్రేతాయుగమే అయినా – ఆ పరమ ప్రభువు కారణంగా కృతయుగ లక్ష గోచరించ సాగాయి. నద నదీ పర్వతారణ్య సాగరాదులన్నీ రామరాజ్యంలో కామధేను ంగా ప్రజల కోర్కెలు నెరవేర్చ సాగాయి. ఆ రామరాజ్యంలో ఆధివ్యాధు లేవీ లేవు. , దుఃఖ, భయ, దుర్బలత్వ, శ్రమాదులన్న వేవీ నామ మాత్రంగా కూడ లేవు. మర రహితంగా వారికి మృత్యువు కూడ కలగడం లేదు. ఏకపత్నీ వ్రతుడై రామచంద్రుడు పావనుడు, సర్వ ధర్మాలనూ ప్రజలకు బోధించడానికే శ్రీహరి రామావతార మెత్తి పురుషోత్తమునిగా ఖ్యాతి గాంచాడు. సీతా మహాసాధ్వి శ్రీరామచంద్రుని అంతరం రం సంచరించేది. శీల, ప్రేమ, సేవల ద్వారా, వినయ లజ్జ, బుద్ధుల ద్వారా ఆమె రామ ని మనస్సునే హరించింది.

—0—

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–11

### రామ రాజ్య పాలన.

శుకమహర్షి రామోపాఖ్యానాన్ని కొనసాగిస్తూ వున్నాడు–"పరీక్షిన్నరేంద్రా! శ్రీరాముడు య వశిష్ఠునే గురువుగా వరించి యాగానీకం ద్వారా సర్వ దేవ స్వరూప స్వయం ప్రకాశ పమైన ఆత్మనే ఆరాధించినాడు. శ్రీరాముడు హోత, బ్రహ్మ, అధ్వర్యు, ఉద్గాతలకు ంగా తూర్పు, దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలను దక్షిణలుగా సమర్పించాడు. మిగిలిన మధ్య గాన్ని ఆచార్యునికి సమర్పించాడు. భూమండలానికి నిస్పృహులైన భూసురోత్తములే అధి ని ఆ ప్రభువు అభిప్రాయము. అలా యావత్ భూమండలాన్నీ దానం చేసి తాను కట్టిన భరణాలతో నిలబడి పోయాడు. సీత కూడ కట్టు బట్టలతో, ఆభరణాలతో నిలబడి పోయింది. యిష్ట దేవతలనుగా భావించి రామచంద్రుని తిలకించిన ఆచార్యాది ఋత్విగ్గణానికి ప్రేమో వల్ల హృదయాలు ద్రవించ వాడు ప్రసన్నులై పృథ్వీ రాజ్యాన్ని పునః శ్రీరామచంద్రు మర్పించి – 'రామ ప్రభూ! జగత్రయానికి ఏకమాత్రుడవైన ఏలికవు నీవే. మా య మందిరాలలో భాసిల్లుతూ – ఆత్మ జ్యోతితో నువ్వు మా అజ్ఞానాంధకారాన్ని నాశనం

అట్టి దశలో నువ్వు మా కీయని దేమున్నది? అనంత జ్ఞాన సంపన్నా! పావన యశ ష్ణులలో నువ్వు సర్వ శ్రేష్ఠుడవు, సర్వ జీవరాసియందూ ప్రేమ కలిగి ఎవ్వరినీ హింసిం రికి నువ్వు స్వయంగా నీ శ్రీచరణ కమలాలను ప్రసాదిస్తూ వుంటావు. భూసుర శ్రేష్ఠు ష్ట దేవతలనుగా భావించడం నీ ఔదార్యానికి తార్కాణమే. నీ రామ రూపానికి మేము ల్లు తూన్నాము.

* * * *

కాలం గడుస్తూన్నది.

ఓనాడు శ్రీరామచంద్రుడు మారువేషంతో ప్రజాభిప్రాయ, స్థితిగతులను తెలిసికోవాలని ంలో సంచరించ సాగాడు. తత్సమయంలో ఒకడు తన భార్యను మందలిస్తూ — 'దుష్ట : నువ్వింతవరకూ పరగృహంలో వుండి వచ్చావు. నారి లోలుడైన రామునిలా నేను నిన్ను రిస్తా ననుకున్నావా? ఎన్నడూ నిన్ను స్వీకరించను.' అన్న మాటలు విన్న రామచంద్రుడు పవాద భీతితో సీతాదేవిని అడవులలో విడిచిపెట్టించాడు. వాల్మీకి ఆశ్రమం చేరుకున్న సీత వతి కావడంవల్ల నవమాసాలూ నిండడంతో కవల పిల్లలను కన్నది. మహర్షి సీతా సుతులకు ర్మాదులు పూర్తి చేసి కుశలవులని నామకరణం చేశాడు. లక్ష్మణునకు అంగద, చిత్ర కేతులూ, నకు తక్ష, పుష్కలులూ, శత్రుఘ్నునకు సుబాహు శత్రుసేనులూ వుదయించారు. భర అనేకమంది గంధర్వులను మట్టుపెట్టాడు. వారి ధనరాసులన్నీ తెచ్చి రామచంద్రునకు ంచాడు. శత్రుఘ్నుడు లవణాసురుని అంతం చేసి మధురా నగరానగర నిర్మాణం చేశాడు. పరిత్యక్త అయిన జానకీదేవి పుత్రులైన కుశవులను వాల్మీకి మహర్షికి వప్పగించి రామ రవింద ధ్యానంతో భూమాతలో కలిసిపోయి తత్సమాచారాన్ని ఆలకించిన రామచంద్రుడు - దందహ్యమాన మానసుడై సమర్థుడై కూడ దుఃఖాన్ని అపుకోలేక పోయాడు. కారణం? సీతా ణ గణాలు ఆతని మదిలో నిరంతరం మెదల సాగాయి, నర నారీ సంబంధం — సర్వత్ర, లోకాల్లోనూ దుఃఖ ప్రదమే కానీ సుఖప్రదం ఎంతమాత్రం కాదు. సమర్థులూ, తత్త్వ అయినవారే యిలా శోకిస్తూంటే సామాన్యుల విషయం వేరే వర్ణించాలా?

తరువాత రామచంద్ర బ్రహ్మచర్య వ్రతంతో సుదీర్ఘ కాల పర్యంతం రాజ్యం చేస్తూ గ్నులను ఉపాసించాడు. తరువాత దండకారణ్య కంటక వేధను పొందిన తన చరణారవిందా భక్తజన హృదయార విందాలలో స్థాపించాడు. తరువాత స్వయం ప్రకాశ జ్యోతిర్మయు చేరాడు. అమరజన ప్రార్థితుడై లీలా గృహీత దేహుడైన భగవంతునితో సముడైన వంతుడు లోకంలో మరెవడూ లేడంటే రామచంద్రుని మించి ప్రతాపవంతుడు మరి ఎవ డు? అట్టి దశరథరాముడు రాక్షస సంహార, సేతు నిర్మాణమునూ చేయడంలో మహత్తర ంది? ఆ మహాత్మునికి శత్రు సంహార విషయంలో వానర సహకార మేల? ఇతంతా ఆ వుని లీలయే అని గ్రహించాలి.

రామచంద్ర పరమాత్మ యశస్సు పాపాలను అన్నింటినీ నాశనం చేస్తుంది. రఘురాముని దశదిశా వ్యాప్తి కావడం వల్ల ఆ మహోజ్జ్వల కాంతితో అష్ట దిగ్గజాల శరీరగత శ్యామ ం ప్రకాశించ సాగింది. ఆ దేవ దేవుని యశస్సును స్వర్గమందలి అమరులూ, భూతలమందలి ర్షులూ విశేషంగా గానం చేస్తున్నారు. నేను అట్టి శ్రీరామచంద్రుని శరణు వేడుతూన్నాను. ం రామచంద్రుని శరణు వేడుతూన్నాను. ఎవరు రామచంద్రుని దర్శన, స్పర్శలు చేశారో ? వారితో సహవాసం చేశారో ? వారూ, చివరకు కోసల దేశీయులూ కూడ పరమ యోగులు దే గతిని పొందినారు. రామ చరిత్రను ఆలకించేవాడు కోమల, సరళ స్వభావు డవుతాడు. కాదు సర్వ కర్మ విముక్తు డవుతాడు.

ప్రశ్నిస్తూన్నాడు — మునీంద్ర చంద్రా ! రాముడు తన అనుజులతో హరించినట్లే అతని సోదరులూ వ్యవహరించారా ?" అని ప్రశ్నించగా ఆయన బదులు పలుకు న్నాడు — "రాజా ! జగత్త్రయ నాథుడైన రామచంద్రుడు సింహాసనమెక్కి సోదరులను జయార్థం పంపాడు. నగరాన్ని స్వయంగా తాను చూసుకుంటూ పురవాసులకు తన సందర్శన న్ని అందజేస్తూ అనుచరులతో సంచరించసాగాడు. తత్కాలంలో అయోధ్యా పురవీధులన్నీ ధ జలాలు చల్లబడి మదించిన ఏనుగుల మదజల కణాలతో నిండి వున్నాయి. రామ ప్రభు సందర్శించి అయోధ్యా నగరం మదించి ఉన్నదా? అన్నట్లుంది వాతారణము గోపుర ాద మార్గ సభా చైత్య గృహాదులు కాంచన కలశలతోనూ, ధ్వజ పతాకాదులతోనూ, తూన్నాయి. దర్పణ, చిత్ర విచిత్ర తోరణ, వస్త్రాలతో పురమంతా నయనానంద దాయ వుంది. బహు మూల్య పురస్కారాలతో పురజనులు రామచంద్రుని అర్చించి — యిలా స్తూన్నారు. "స్వామీ! ఆదికాలంలో వరాహావతార మెత్తి నువ్వే యీ పృథ్విని ఉద్ధరించినావు. ాతలాన్ని యిప్పుడు నువ్వే పాలించాలి, రామచంద్ర దర్శనాభిలాషులయిన నర నారీ ిశాలోన్నత భవనాలు ఎక్కి నిర్నిమేష నేత్రాలతో అతన్ని దర్శిస్తూ పూల జల్లులు స్తూన్నారు. రాముడా రీతిగా ప్రజలకు దర్శనమిస్తూ రాజమందిరం చేరుతూ వుండేవాడు. ు వంశీయులకు ఆ రాజ మందిరం పరంపరగా వచ్చింది. అపార ధనరాసులతో, సర్వ గి యుక్తమై అది వుంది. స్ఫటిక, మరకత, వజ్ర, వైడూర్య ఖచిత కవాటాలతో ఆ

సుందర భవనం రాజిల్లేది. చిత్ర విచిత్ర సుమమాలలతో, మణిభూషణాలతో సుగంధ ధూప
తో సర్వాభరణ భూషితులై, సేవా ధర్మపరాయణులైన నర నారీ జనంతో నిండి సందడిగా
జ భవనం వుండేది. సర్వ జన సేవ్యుడైన రామచంద్రుడు ధర్మ మర్యాదానుసారం రాజ్య
చేశాడు.

-0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–12

### ఇక్ష్వాకు వంశీయులలో శేషించిన వారి వర్ణన.

శుకమహర్షి పలుకుతున్నాడు – రాజా! కుశునకు జన్మించిన వాని పేరు అతిథి, అతనికి
నిషధునకు నభుడు, నభునకు పుండరీకుడు, అతనికి క్షేమ ధన్వుడూ ప్రభవించారు, క్షేమ
కు దేవానీకుడు, వానికి అనీహుడు, అనీహునికి పారియాత్రుడు, వానికి బలస్థలుడు,
వజ్రనాభుడూ కలిగారు. వజ్రనాభునకు ఖగనుడు విధృతి, వానికి
నాభుడు, వానికి విధృతి, అతనికి హిరణ్య నాభుడూ కలిగారు. హిరణ్య
యాజ్ఞవల్క్యులకు సంబంధం ఏర్పడినది అధ్యాత్మ యోగం హృదయ గ్రంథిని విచ్ఛిన్నం
మ సిద్ధిని ప్రసాదిస్తుందని గ్రహించాలి. హిరణ్య నాభునికి పుష్యుడు, వానికి ధృవ సంధి
సుదర్శనుడు, వానికి అగ్నివర్ణుడు, వానికి శీఘ్రుడు, అతనికి మరుత్తూ కలిగారు. యోగ
మరుత్తు నేటికీ కలాప గ్రామంలో వున్నాడు. కలియుగాంతంతో సూర్య వంశం నాశ
గా–పునః అది యీ మరుత్తు వల్లనే వర్ధిల్లుతుంది. మరుత్తునకు ప్రసుశ్రుతుడు–అతనికి
అతనికి అమర్షణుడు వానికి మహస్వంతుడూ, అతనికి విశ్వ సాహ్వయుడు, ప్రభవించినారు.
ప్రసేన జిత్తు, అతనికి తక్షకుడు, వానికి బృహద్బలుడు కలిగారు. ఈ బృహద్బలునే నీ
న అభిమన్యువు కురుక్షేత్రంతో సంహరించాడు.

పరీక్షిన్నరేంద్రా! ఇక్ష్వాకు వంశంలో ఋుంత వరకూ యీ రాజులు అయి పోయారు, భవి ష్యత్తులో రాబోయే రాజ వంశాన్ని వర్ణిస్తాను ఆలకించు. బృహద్బలునికి బృహద్రణుడు కలిగాడు. కి ఉరుక్రియుడు, అతనికి వత్స వృద్ధుడు, వానికి ప్రతి వ్యోముడు, వానికి భాను, అతనికి సేనా దివాకాటులు జన్మించారు. దివాకటునికి సహదేవుడు, వానికి బృహదశ్వుడు, వానికి భాను డు, వానికి ప్రతీకాశ్వుడు, అతనికి సుప్రతీకుడు కలిగారు. సుప్రతీక నందనుడు—మరుదేవుడు కుమారుడు సునక్షత్రుడు వానికి పుష్కరుడు, అతనికి అంతరిక్షుడు, అతనికి సుతపుడు — అమిత్రజిత్తూ పుట్టారు. అమిత్రజిత్తుకు బృహద్రాజు, వానికి బర్హి, అతనికి కృతంజయుడు- కి రణంజయుడు, వానికి సంజయుడూ కలిగారు. సంజయునికి శాక్యుడు, వానికి శుద్ధోదనుడు, లాంగలుడు, అతనికి ప్రసేన జిత్తు, వానికి క్షుద్రకుడూ కలిగారు. క్షుద్రకునకు రణకుడు- సురథుడూ కలిగారు. సురథ నందనుడైన సుమిత్రునితో యీ వంశం అంతమైనది. వీరం బృహద్బల వంశధరులే. ఇక్ష్వాకు వంశం సుమిత్రుని పర్యంతం వర్ధిల్లి కలియుగంలో మై పోయింది.

—0—

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-13

### నిమి వంశాభి వర్ణన.

శుకమహర్షి పలికాడు — "రాజా! ఇక్ష్వాకు నందనుడైన నిమికి యాగం చెయ్యాలని ం కలిగింది. అతడు ఋుత్విక్కునిగా వశిష్ఠుని వరించాడు. కానీ అంతకు పూర్వమే ఇంద్రు ట ఋుచ్చిన వశిష్ఠుడు—మహేంద్రుని యాగం పూర్తి చేసుకు వస్తానని అంత వరకూ వేచి పనీ అనగా నిమి నిరుత్తరుడై నిలబడిపోయాడు. విచార శీలుడైన నిమి — "జీవితం ్తనది. ఆలసించడం ధర్మం కాదని గ్రహించి వశిష్ఠుడు మరలి వచ్చే వరకూ యితరులైన

ఋక్కులను వరించి యాగం ఆరంభించాడు. వశిష్ఠుడు–ఇంద్ర యాగం పూర్తి చేసుకుని మరలి
సమయానికి నిమి యాగం సాగుతూనే వుంది. తన ఆజ్ఞలను ధిక్కరించి యాగం చేశాడని
గ్రహించిన వశిష్ఠుడు–మనసా "యీ నిమి తాను జ్ఞాని నన్న అహంకారంతో పండితుడనన్న
అభిమానంతో గర్వించాడు. లేకుంటే నా ఆజ్ఞను ఎందుకు ధిక్కరిస్తాడు?" అనుకుంటూ–'నిమీ!
నీ దేహం పతన మగును గాక!" అని శపించాడు. నిమి దృష్టిలో గురు శాపం అధర్మానుకూలమే
అనిపించింది. దానితో అతడు వశిష్ఠునికి ప్రతి శాపమిస్తూ – "మీ దేహం కూడపతనమై పోవును
అన్నాడు. తరువాత ఆత్మ విజ్ఞానవేత్త అయిన నిమి దేహాన్ని విడిచాడు. వశిష్ఠ మహర్షి
దేహాన్ని త్యాగం చేసి పునః మిత్రావరుణుల వీర్యం ద్వారా ఊర్వశీ గర్భం నుండి ప్రాదు
ర్భవించాడు. నిమి యాగంలో ఋత్విజులుగా వున్న తపోధనులు అతని దేహాన్ని సుగంధ
ద్రవ్యాల యందుంచి సంరక్షిస్తూ సత్ర యాగం పరిసమాప్తి చేసిన తరువాత దేవతలను
స్తుతి చేస్తూ – "అమరులారా! సర్వ శక్తి సంపన్నులైన మీరు అనుగ్రహిస్తే నిమి చక్ర
వర్తి పునర్జీవితుడు కాగలడు అన్నారు. వారి స్తోత్రానికి ప్రసన్నులైన దేవతలు – 'నిమి పునర్జీ
వితుడగును గాక!" అనగా నిమి – నేనీ దేహబంధం కోరడం లేదన్నాడు.

విచార శీలురు భగవదాయత్తమైన చిత్తంతో ఆ దేవ దేవుని చరణ కమలాలనే ఆశ్ర
యిస్తారు – క్షణ భంగురమై ఏదోనాడు పతనం కావలసిన జీవితాన్ని గూర్చి యోచించరు; వాంఛిం
చరు. ముక్తి పొందాలనే అభిలషిస్తూ వుంటారు జలంలో మత్స్యాలకు మృత్యువు సన్ని
హితమైనట్లే దేహ ధారులకూ సన్నిహితంగానే వుంటుంది.

అంత అమరులు – "మహర్షులారా! నిమి స్వేచ్ఛగానే ప్రాణుల నేత్రాలలో నివ
సిస్తాడు. సూక్ష్మ దేహంతో కూడ అక్కడ వుంటూ భగవద్ధ్యానంలో వుంటాడు." రెప్ప
పాటులో అతని అస్తిత్వం గోచరమవుతుంది." అన్నారు.

తరువాత మహర్షులు యోచించి – "శాసకుడు లేకుంటే అరాచక మేర్పడుతుందని, –
దేహాన్ని మధించగా ఓ పుత్రుడుదయించాడు. నిమి దేహసంజాతుడు కావడం వల్ల అతణ్ణి
జనకుడన్నారు. విదేహాన్నుండి ప్రభవించడం వల్ల విదేహుడన్నారు. మథనం వల్ల జన్మిం
చడం వల్ల 'మిథి' అనీ అతడు వ్యవహరించ బడ్డాడు. ఈ జనకుడే మిథిలానగర నిర్మాణం

, జనకునకు, ఉదావసువు జన్మించాడు. అతనికి నంది వర్ధనుడు, వానికి సుకేతువు, వానికి
తుడు. వానికి బృహద్రథుడు, వానికి మహావీర్యుడు, వానికి సుధృతి, వానికి దృష్టకేతు,
హర్యశ్వుడు, వానికి మరువు – అన్న కుమారులు కలిగారు. మరునకు ప్రతీకుడు వానికి
థుడు, వానికి దేవ మీఢుడు, వానికి విశ్రుతుడు, వానికి మహాధృతీ కలిగారు, మహాధృతికి
తుడు వానికి మహా రోముడు, వానికి స్వర్ణరోముడు, వానికి హ్రస్వరోముడు, వానికి శీర
కలిగారు. ఇతడు యాగంచేయ భూమిని దున్నుతూండగా హలాగ్రం నుండి "సీత"
ర్భవించింది. అందులకే యితడు శీరధ్వజనామ ప్రసిద్ధుడయ్యాడు. ఇతనికి కుశధ్వజుడు
కి ధర్మధ్వజుడు, యితనికి కృతధ్వజ, మిత్రధ్వ నామ నందనలూ పుట్టారు. అందులో
ధ్వజునికి కేశిధ్వజుడు, మిత్ర ధ్వజునకు ఖాండిక్యుడూ కలిగారు. కేశిధ్వజుడు ఆత్మ
శ్రేష్ఠుడు కాగా, ఖాండిక్యుడు కర్మ విద్యాగ్రేసరుడయ్యాడు. ఇతడు కేశిధ్వజునకు భీతిల్లి
నం చిత్తగించాడు కేశిధ్వజునకు భానుమంతుడు వానికి శతద్యుమ్నుడు, వానికి శుచి,
సద్వాజుడు వానికి ఉరు, అతనికి పురుజిత్తు అతనికి అరిష్టనేమి, అతనికి శ్రుతాయువు అత
పార్శ్వుడు, వానికి చిత్రరథుడు, అతనికి క్షేమనిధి అతనికి సమరథుడు వానికి సత్య
, అతనికి ఉపగురువు – వానికి ఉపగుప్తుడు – అనువారలు కలిగారు. ఉపగుప్తుడు
యొక్క అంశావతారం. ఉపగుప్త నందనుడు వస్వనంతుడు, వానికి యుయుధుడు, అతనికి
, అతనికి జయుడు వానికి విజయుడు అతనికి ఋతుడూ కలిగారు. ఋతునకు సునాషణు
, అతనికి వీతహవ్యుడు అతనికి ధృతి, వానికి బహులాశ్వుడు అతనికి కృతి. వానికి
శి జన్మించినారు.

రాజా! మిథిలను శాసించిన వారి వంశంలో జన్మించిన వారందరూ మైథిలులే.
గార్హస్థ్య ధర్మంలో వున్నా ద్వంద్వాతీతులై యాజ్ఞవల్క్యాది మహర్షుల కృపకు పాత్రులై
క్తు లయ్యారు.

—0—

# మద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-14

### చంద్ర వంశాభి వర్ణన.

శుకమహర్షి — 'ప న్నరపాలా! పురూరవాది చక్రవర్తులు జన్మించి మహత్తర న సముపార్జించిన చంద్ర వంశాన్ని గురించి వర్ణిస్తాను ఆలకించు. అనంతుడైన విరాట్ ని నాభి కమలం నుండి చతుర్ముఖ బ్రహ్మ ప్రభవించాడు. ఆతనికి తనతో సమమైన దులు కల అత్రి మహర్షి ప్రభవించాడు. ఆతనివల్ల చంద్రుడు ప్రాదుర్భవించాడు. దేవుడు చంద్రుని — బ్రాహ్మణ, ఓషధి, నక్షత్రాదులకు అధిపతిని చేశాడు. జగత్త్రయాన్ని రాజసూయ యాగం చేసి చంద్రుడు బల మద గర్వితుడై బృహస్పతి పత్నిని హరిం తన భార్యను తనకిమ్మని బృహస్పతి చంద్రుని ఎన్నోమార్లు యాచించినా అధికార త్తుడైన ఆతడు గురువచనాలను పెడచెవిని పెట్టాడు.

ప్రతి పక్షీయుడైన ఆచార్య శుక్రుడు చంద్ర పక్షం వహించి రాక్షస పరివేష్టితుడై చంద్రుని శాడు. కైలాస నాథుడైన మహాదేవ భగవానుడు బృహస్పతి పక్షం చేరాడు. బృందారక వేష్టితుడై మహేంద్రుడు బృహస్పతి పక్షంలో కలిచాడు. ఆ విధంగా తార గురించి ల మధ్య ఘోర యుద్ధం జరిగింది. యుద్ధా పు చేయించవలసిందిగా మహర్షి అంగి బ్రహ్మదేవుని అర్థించగా — ఆయన చంద్రుని మందలించి తారను బృహస్పతి దగ్గరకు వేశాడు. అప్పుడు గర్భవతిగా వున్న తారను తిలకించి బృహస్పతి — దుష్టురాలా! పర గర్భంలో ధరించినావు. వెంటనే దానిని త్యజించు. నువ్వు భీతిల్ల పనిలేదు. నిన్ను చెయ్యను. నువ్వు స్త్రీ మాత్రురాలవు. నాకు సంతాన వాంఛ వున్నది. అదీ గాక నువ్వు ంగివి కూడ.' అన్నాడు. అయినా పతి మాటలకు లజ్జతో తార, స్వర్ణచ్ఛాయ కల ఓ ని ప్రసవించింది. ఆ బాలునిపై చంద్ర బృహస్పతు లిరువురికీ కోరిక కలిగింది. వానికై రూ తగవులాడుకున్నారు. అప్పుడు అమర శ్రేష్ఠులు వచ్చి — 'తారా! యీ కుమారుడు

ి చెందుతాడు?' అని – ప్రశ్నించగా తార లజ్జతో నతమస్తకురాలయింది. అంత ఆ కుమా
క్రుద్ధుడై – "దురాత్మురాలా! సిగ్గు దేనికే? నిజం నాకు చెప్పు.' అన్నాడు. అంతలో
్మదేవుడు వచ్చి తారకు ఏకాంతంలో ప్రశ్నించగా వీడు చంద్ర పుత్రుడే.' అనడంతో
ుడా కుమారుని తీసుకు వెళ్ళిపోతాడు. గంభీర బుద్ధి సంపన్నుడు కావడం వల్ల చంద్రుడు
కి 'బుధుడ'ని నామకరణం చేశాడు. వాణ్ణి పొంది చంద్రుడు పరమానందపరవశు డయ్యాడు.
'" నామక స్త్రీ ద్వారా చంద్రునికి పురూరవుడు ప్రభవించాడు.

ఒకానొకనాడు దేవర్షి నారదుడు పురూరవుని రూప గుణాదులు వర్ణించగా విన్న ఊర్వశి
క్షత్రిని మోహించి అతని దగ్గరకు వెళ్ళింది. మిత్రా వరుణ శాప కారణంగా భూతలానికి
ి ఊర్వశి కామదేవ సముడైన పురూరవ సన్నిధికి ధైర్యంగా వెళ్ళింది. ఆ సౌందర్య
సందర్శించిన పురూరవున మేను పులకించింది. ఆయన నయనాలు ఆనందంతో వికసించాయి.
కి బ్రహ్మానందమే కలిగింది. పురూరవుడు ఆమెను తదేకంగా తిలకిస్తూ – "సుందరాంగ!
ి మా స్వాగతం. ఈ ఆసనంపై కూర్చో. నేను చేయగలిగినదేమో చెప్పు. నాతో విహ
మన యిరువురికీ శాశ్వత విహారం సిద్ధించాలి." అన విని ఆమె – 'రాజా! సర్వాంగీ
రుడవైన నిన్ను తిలకించి మోహించని స్త్రీ వుంటుందా? దర్శన మాత్రంచే నిన్ను రమించా
ంకల్పం కలిగినా ధైర్య స్థైర్యాలు నాశనమైపోయాయి. రూప గుణాల ద్వారా కీర్తించ
ట్టి వారినే నారీ జనం వరిస్తుంది. నీపై నాకు ప్రేమానురాగాలు కలిగాయి. కానీ నువ్వు నా
ానికి బద్ధుడవై వుండాలి. నీ దగ్గర నేను రెండు గొర్రెలను వుంచుతాను వీటిని నువ్వు
నంగా సంరక్షిస్తూ వుండాలి. మహా వీరా! నేను ఘృతాన్నే పానం చేస్తూ వుంటాను.
వేళలో వినా నువ్వు ఎన్నడూ నాకు దిగంబరంగా కనిపించరాదు." అంది. ఆమె నియమా
ికి అంగీకరించిన పురూరవుడు – 'సుందరీ! అద్భుత సౌందర్యంతో అలౌకిక భావంతో
సర్వులనూ మోహింపజేయగలదానవు. స్వయంగా వరించి నువ్వే వస్తే తిరస్కరించే పురుష
ా? నిన్ను సేవించని బుద్ధిహీనుడు వుండనే వుండడు." అన్నాడు.

కాలచక్రం గిర గిర తిరిగిపోతూన్నది. కామ శాస్త్రానుసారం ఊర్వశి పురూరవునితో
చ సాగింది. అమరుల విహార స్థానాలైన చైత్ర రథ, నందనోద్యానవనాలలో ఆమె

రవునితో విహరించ సాగింది. ఆమె దేహం నుండి పద్మ గంధం బహిర్గతం కాసాగింది. రచి పురూరవుడు ఆమెతో చిరకాలం రత్యానందాన్ని అనుభవించ సాగాడు.

అమరధామంలో ఊర్వశి కానరాక పోవడంతో మహేంద్రుడు గంధర్వులను పిలచి ఆమెను ఃంచు తీసుకు రమ్మని పంపాడు. గంధర్వులు నిశి రాత్రిలో బయలుదేరి పురూరవ మందిరం ? రాజు దగ్గర ఊర్వశి వుంచిన తోడేళ్ళను రెండింటినీ తీసుకుపో సాగారు. వాటి అరుపులు ర్వశి — వచ్చినవారు గంధర్వులే అని తెలిసికొని — నేనీ పౌరుష హీనుని వరించినానే! ఘోరం? ఎంత పొరపాటు జరిగిపోయింది. రెండు తోడేళ్ళనే సంరక్షించజాలని యీతడు త కార్యా లేమి చేయగలడు? ఈతణ్ణి నమ్మి నేను కన్న సంతానంగా పోషిస్తున్న నా ను చోరులు అపహరించారు. హతోస్మి పగలు పురుషునిలా తిరిగే యితడు రాత్రి అయితే డదానిలా నిద్రపోతూ వుంటాడు. మత్తేభాన్ని అంకుశంతో వేధించినట్లు ఊర్వశి పురూ వాగ్బాణాలతో వేధించగా అతడు అసావధాన స్థితిలో దిగంబరిగానే కరవాల పాణియై ర్వలు పోయిన దారిని పోయాడు. తమను ఎదిరించ వచ్చిన పురూరవునిపై మెఱుపులవలె ర్వలు ప్రకాశించ సాగారు. అయినా పురూరవుడు ఆ తోడేళ్ళను వెంటబెట్టుకుని ఊర్వశిని చడంతో ఆ కాంతిలో ఆమె అతణ్ణి దిగంబరంగా చూసి వెనువెంటనే యీ లోకాన్ని వెళ్ళిపోయింది

శయన మందిరం చేరిన పురూరవుడు ఊర్వశి లేకపోవడం చూసి కామంచే మతిహీనుడై అటూ తిరగసాగాడు. ఓనాడు పంచ సఖులతో ఊర్వశి సరస్వతీ నదీ తటాన విహరిస్తూ ం చూసి పురూరవుడు — "ప్రేయసీ! క్షణమాగు, నామాట ఒకటి విను. నేడు నువ్వు ంఖం కలిగించకుండ వెళ్ళకు. నాతో భాషించు. ఇలా వస్తే మన మిద్దరం మాట్లాడుకోవాలి. ం నీకు నాపై దయలేదు. అందుకే నిష్ఠురంగా నన్ను విడనాడిపోయావు. నీ వియోగంలో ృంగి కృశించి పతనమైపోవ గృధ్ర వృకాలు నన్ను భక్షించి వేస్తాయి."

అన విని వూర్వశి — రాజా! పురుషుడవైన నువ్వు భీతిల్లి మరణించకు, యదా యీ తోడేళ్ళు నిన్ను తినజాలవు. ఆడవారికి శాశ్వతంగా ఎవరితోనూ

వుండదు. వృకాల, నారీ జనాల హృదయాలు ఒకే రీతిగా వుంటాయి. నిర్దయులైన నారీ
కు క్రూరత్వం సహజంగా వుంటుంది. వారికి చిన్న చిన్న విషయాలకే కోపం వస్తుంది.
ఖార్థం స్త్రీలు — దుష్టాత్ములై పతి, సోదర భేద రహితంగా ఎవరినైనా అంతం చెయ్య
సజ్జనులను సైతం మోసగించే కపట ప్రేమను ప్రదర్శించి విశ్వసింపజేసి పర పురుష
సాంగత్యం కొనసాగిస్తూ స్వేచ్ఛగా వ్యవహరిస్తూ పతివ్రతలా నటిస్తూ వుంటారు. నువ్వు
గాట్టువు. ధైర్యం వహించు. కంగారు పడకు. ఏడాదికి ఓ రాత్రి మాత్రం నా పొందు నీకు
ంది." అంది.

ఊర్వశి గర్భవతి అని తెలిసిన పురూరవుడు నిజ రాజధానికి మరలి వచ్చాడు. సంవత్సరం
కావడంతో ఊర్వశి తాను ప్రసవించిన వీర కుమారుని వెంట బెట్టుకుని పురూరవుని దగ్గ
చ్చింది. వీరిద్దరూ సరస్వతీ ప్రవంతీ తటంలోనే కలిశారు. తద్రాత్రి పురూరవుడు ఊర్వ
బహ్మానందంగా గడిపిన తరువాత ఆమె వెళ్ళిపోవ చూసి ఆ చక్రవర్తి తీవ్ర వేదన పడు
గా ఆమె పలికింది — "రాజా! నువ్వు విరహ తాపంతో వేదన పడుతూ వృథాగా గడపక-
ర్వలను అర్థిస్తే వారు సంతసించి నన్ను నీకు యిస్తారు." అన విని పురూరవుడు గంధర్వ
ప్రార్థించగా సంతుష్టులయిన గంధర్వు లాతనికి అగ్నిస్థాపన యోగ్యమైన పాత్ర నొక
చ్చారు. ఆ పాత్రను స్వీకరించిన మహారాజు దానినే ఊర్వశిగా భావించి కౌగలించుకుని ఓ
నుండి మరో అడవికి పోయి పరిభ్రమించ సాగాడు. కొన్నాళ్ళకు అతనికి జ్ఞానోదయం
అతడు ఆ స్థాలిని అయ్యడవిలోనే విసర్జించి రాజమందిరానికి మరలి వచ్చాడు. రాత్రి
ఏకాంత సమయంలో ఊర్వశినే ధ్యానిస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. త్రేతా యుగారంభంలో
హృదయంలో మూడు వేదాలూ ప్రాదుర్భవించ అతడు వాటిని గ్రహించి గతంలో అగ్ని
వుంచిన అరణ్య ప్రదేశానికి పోయి చూసే సరికి అక్కడ శమీ వృక్ష గర్భంలో అశ్వత్థ
లేచి వుండడం చూసి తద్వృక్ష కాష్ఠాన్ని గ్రహించి ఆ రెండు అరణులనూ తయారు
ఊర్వశీ స్థానాన్ని పొందాలన్న సంకల్పంతో అధరారణి ఆమె యనీ, ఊర్ధ్వారరణి తాననీ,
దండనం పుత్రుడనీ భావించి వేద మంత్రాలతో మధించి అగ్నిని ప్రజ్వరిల జేశాడు.
నం నుండి జాత వేద నామకాగ్ని ప్రభవించింది. పురూరవుడు తదగ్ని నుండి ఆహవ

, గార్హ్యపత్య, దక్షిణాగ్నులుగా విభజించి పుత్ర రూపంలో స్వీకరించాడు. ఊర్వశీ స్థానాన్ని దే తీవ్ర కాంక్షతో అతడు యీ త్రేతాగ్నుల ద్వారా ఇంద్రియాతీతుడైన యజ్ఞపతి యగు ారిని ఆరాధించాడు. రాజా! కృతయుగంలో ప్రణవమే వేదం కాగా దానియందే వేదశాస్త్ర స్వం అందర్భూతంగా వుండేది. ఏకమాత్ర నారాయణుడే సర్వదేవ స్వరూపుడుగా భాసిల్లే . ఆతడే ఆరాధ్యదేవుడే స్వీకరించబడేవాడు. అన్యదేవతలు లేరు, అగ్ని కూడ ఏకమాత్రుడే; గా లేడు. హంస స్వరూపంలో ఏకమాత్ర వర్ణమే వుండేది. త్రేతాయుగారంభంలో — గ్నులూ, వేదత్రయమూ పురూరవుని ద్వారా లభించాయి. త్రేతాగ్నులనూ పుత్రులనుగా ంచి పురూరవుడు గంధర్వ లోకం చేరాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–15

### ఋచీక, జమదగ్ని, పరశురాముల గాథలు.

శుకమహర్షి పలుకుతున్నాడు — "రాజా! పురూరవునకు ఊర్వశి వల్ల ఆయు, శ్రుతాయు, ు, రయ, విజయ, జయ నామాలతో ఆరుగురు పుత్రులు కలిగారు. శ్రుతాయువుకు వసు ు, సత్యాయువుకు శ్రుతంజయుడు, రయునకు ఏక, జయునకు అమితుడూ అనే పుత్రులు . విజయునకు భీముడు, వానికి కాంచనుడు అతనికి హోత్రుడు, వానికి సాగరాన్నే పానం జహ్ను వానికి పూరు, వానికి బలాకుడు, అతనికి అజకుడూ కలిగారు. అజకునకు కుశుడు. ం, తనయ, వసు, కుశనాభ నామాలతో నల్గురు పుత్రులు కలిగారు. కుశాంబునికి గాధి . గాధి పుత్రి అయిన సత్యవతిని తన కిమ్మని భృగు పుత్రుడైన ఋచీకుడు అర్థించగా — యోగ్యుడు కాడని తలచి గాధి ఋచీకునితో అంటాడు. — "మునిచంద్రా! కుశిక వంశాం న మా కన్య లభించడం కష్టమే. కనుక ఏక కర్ణంగా వున్న శ్వేతాశ్వాలను వేయింటిని

ల్క రూపంలో నాకు తెచ్చి యియ్యి." అన విని ఋచీకుడు వరుణుని దగ్గరకు వెళ్ళి గాశ్వాలను తెచ్చి గాధికి యిచ్చి సత్యవతిని పరిణయ మాడాడు. ఒకానొక సమయంలో ి, ఆమె జననీ – యిద్దరూ పుత్ర ప్రాప్తికై ఋచీక మహర్షిని ఆశ్రయించారు. వారి ను మన్నించి ఋచీకుడు వేరు వేరు మంత్రాల ద్వారా హవిస్సులను రెంటిని తయారు ్నానార్థం వెళ్ళాడు. తన అర్ధాంగి కోసం ఋచీకుడు ఉత్తమ హవిస్సును పక్వం చేసి తని భావించి గాధి పత్ని పుత్రితో నీ హవిస్సు నాకిమ్మని అర్థించగా ఆమె తన భాగం చ్చి, తల్లి భాగాన్ని తాను తీసుకుంది. అది గ్రహించిన ఋచీకుడు భార్యను పిలిచి – సతీ! నువ్వు మహానర్థ దాయకమైన పని చేశావు. నీ వల్ల పుట్టే కుమారుడు క్రూర – ప్రజలను దండించు నట్టి ఘోర కర్ము డవుతాడు. నీ తమ్ముడు తపోధనుడైన బ్రహ్మ అవుతాడు. అన విని సత్యవతి నా కట్టి పుత్రుడు వద్దు. తపోధనుడైన బ్రహ్మవేత్తయే '' అనగా 'తథాస్తు! నీ పౌత్రుడు మాత్రం ఘోర కర్ము డవుతాడు.'' అన్నాడు. ప సకాలంలో సత్యవతికి జమదగ్ని పుట్టగా రేణుకను జమదగ్ని పరిణయమాడాడు. ఆ దంపతులకు వసుమంతాది పుత్రులు తొమ్మండుగురు కలిగారు. వారిలో కనిష్ఠుడైన పరశు ప జగత్త్రయ ఖ్యాతి పొందాడు. హైహయ కులనాశనార్థం భగవదంశగా పరశురాముడు ంచాడు. ఈ భార్గవరాముడే ఇరవై ఒక్క మార్లు భూతలంలోని దుష్ట క్షత్రియులను చేశాడు. పరశురాముని అవమానించిన క్షత్రియులనే కాక ఆతడు ఆ కాలంలోని దురా న క్షత్రియాధములను భూమికి భారంగా వున్న వారందరినీ సంహరించి – ధర్మ రక్షణ

.

పరశురామావతార గాథను సవిస్తరంగా అర్థించిన పరీక్షితుకు శుకమహర్షి బదులు పలుకు ుడు.

రాజా! ఆ కాలంలో హైహయ వంశంలో కృతవర్త నందనుడైన వీర్యార్జునుడు భూ ంగా ఖ్యాతిగాంచాడు. శ్రీమన్నారాయణాంశావతారుడైన దత్తాత్రేయుని సేవించిన యీతడు స బాహువులను, లోక సర్వస్వాన్నీ జయించునట్టి అపార శక్తినీ, ఇంద్రియ బల, అపార లనూ, యశోవీర్య తేజస్సులనూ, విశేష దేహ బలాదులనూ పొంది యోగీశ్వరుడై ంతి సూక్ష్మ స్థూలాతి స్థూల రూపాన్ని ధరించగల మహైశ్వర్య సంపన్ను డయ్యాడు.

సిద్ధులూ అతనికి కరతలామలకాలైనాయి. విశ్వంలో నిరాటంకంగా అతడు వాయు సమంగా సంచరించగల శక్తి కూడ అతనికి కలిగింది. ఒకానొక వేళలో అతడు వైజయంతీమాలను ధరించి సుందరాంగనల బృందాన్ని వెంటపెట్టుకుని నర్మదా నదిలో జలక్రీడ లాడుతూ తన వేయి చేతులతో ఆ నదీ ప్రవాహాన్ని ఆపుచేశాడు. దానితో దశకంఠుడైన రావణుడు కూడ అక్కడే వున్నాడు. ఎదురు తిరిగిన నదీ ప్రవాహం రావణుని శిబిరంలో ప్రవేశించడంతో — మహా బలవంతుడ నని గర్వించిన అతడది సహించలేక కార్త వీర్యుని చేరి అతణ్ణి నిందించాడు. క్రుద్ధుడైన కార్త వీర్యుడు సుందరు లందరూ సందర్శిస్తూండగా రావణుని పట్టుకుని కోతిని బంధించిన రీతిని బంధించి తన నగరంలో వుంచాడు. కాలాంతరంలో పులస్త్య బ్రహ్మ అతణ్ణి విడిచిపెట్టుమనగా అతడు విడిచిపెట్టాడు.

కాలం గడుస్తూన్నది. కార్త వీర్యార్జునుడు వేటాడ ఘోరారణ్యాలకు పోయి విధి వశాన జమదగ్ని ఆశ్రమం చేరాడు. జమదగ్ని ఆశ్రమంలో హోమ ధేనువు సంతుష్టి చెందగా దాని ప్రభావం వల్ల జమదగ్ని — చతురంగ బల సహితుడైన కార్త వీర్యునికి అఖండంగా అతిథి మర్యాదలు నిర్వర్తించాడు. కామధేనువు కారణంగా జమదగ్ని — తనకు మించిన మహైశ్వర్య సంపన్ను డయ్యాడని భావించి — కార్త వీర్యుడు కామధేనువునే వాంఛించి బల మద గర్వితుడై బలాత్కారంగా ఆ ధేనువును తన రాజధానికి తీసుకు రమ్మని, సైన్యానికి ఆదేశించాడు. వారా ధేనువు "అంబా!" అని మొరలిడుతున్నా వినక తోలుకు పోయారు. అంతట ఆశ్రమం చేరిన పరశురాముడు యావద్వృత్తాంతం విని నిశిత పరశు, ధనుర్బాణాలను, డాల్ కత్తి ధరించి మత్తేభం మీదకు లంఘించు నట్టి మృగరాజులా కార్త వీర్యునిమీద పడ్డాడు. అప్పుడే నగరం చేరిన కార్తవీర్యుడు తనపై దండెత్తి వస్తూన్న భార్గవ రాముని తిలకించాడు. నల్లని కాంతిగల జటాజూటాన్ని బంధించి అరివీర భయంకరుడై, విలక్షణ ప్రకృతిలో మధ్యాహ్న మార్తాండునిలా పరశురాముడు భాసిల్లి పోతూన్నాడు. అతణ్ణి చూసిన కార్తవీర్యుడు కూడ గద, బాణ, ఋష్టి, శతఘ్ని శక్త్యాద్యాయుధాలను ధరించి చతురంగ సైన్యాలతో పరశురాముని పైకి వచ్చాడు. వాయువేగ, మనోవేగాలను అతిక్రమించగల శక్తిసంపన్నుడైన పరశురాముడు ఆ సేనలను చీల్చి చెండాడుతూ పురోగమిస్తూన్నాడు ఆతని నిశిత పరశు ప్రహారాల మాత్రంచే వీరులు నేల కూలుతూన్నారు. వారి హస్త, పాద, మస్తకాలు ఖండిపబడి నేల పడుతూ

ఱు. ఆ మహావీరుని ధనుర్విముక్త నిశిత శరాగ్ని జ్వాలలకు తన సేన అంతా ఆహుతి
ం చూసి కార్తవీర్యుడు క్రోధోన్మత్తుడై యుద్ధ సన్నద్ధు డయ్యాడు. ఏక కాలంలో ఆతడు
వందల ధనువులను ధరించి భార్గవరామునిపై శర వర్షం కురిపిస్తూంటే కోదండ దీక్షా దక్షుడూ
హ్రా అయిన పరశురాముడు వాటిని అవలీలగా ఖండించివేశాడు. అంత కార్తవీర్యుడు తన
ువులతో తరువులనూ గిరులనూ పెకిలించి పరశురామునిపై ప్రయోగించ పురోగమిస్తూండగా
ంకర సర్ప సదృశంగా వున్నవాని సహస్ర బాహువులనూ తన నిశిత పరశుతో ఖండిచి గిరి శిఖర
గా వున్న వాని మస్తకాన్ని కూడ దేహం నుండి ఖండించి వేశాడు, దానితో కార్త వీర్యుని
ఖమంది పుత్రులూ భీతి చెంది పారిపోయారు.

వైరి వీర హంత అయిన భార్గవ రాముడు సైన్య సమేతంగా కార్త వీర్యార్జునుని అంతం
సుఖ సంతప్తయై యున్న కామధేనువును వత్సతో తీసుకు వచ్చి తండ్రికి సమర్పించాడు.
వీర్య సంహార వృత్తాంతాన్ని అతడు తండ్రికి వినిపించగా జమదగ్ని పలికాడు.

"వత్సా ! పరశురామా ! మహాపరాధం చేశావు. సర్వదేవమయుడైన చక్రవర్తిని వ్యర్థంగా
ు చేశావు. మనయందుండే క్షమా ప్రభావం వల్లనే సర్వులూ మనలను ఆరాధిస్తూన్నారు.
ారణంగానే విప్రులకు భాస్కర సమ తేజస్సు లభిస్తూన్నది. పరమాత్మ కూడ సదా క్షమా
అనుగ్రహిస్తూంటాడు. నాయనా ! సార్వభౌముని సంహరించడమంటే బ్రహ్మ హత్యా
కన్న మిన్న అయినదే. వెళ్ళి తీర్థయాత్రలు చేసి శ్రీహరిని స్మరించి పాప దూరుడవు
",

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–16

### భార్గవ రాముడు దుష్ట క్షత్రియులను సంహరించుట.

శుకమహర్షి పలుకు తున్నాడు — రాజా ! పితాదేశానుసారం పరశురాముడు సంవత్సర తీర్థయాత్రలు పూర్తి చేసుకు వచ్చాడు. ఓ నాడు రేణుకాదేవి గంగాతీరానికి వెళ్ళింది. చిత్ర మక గంధర్వుడు పద్మ మాలా ధారియై అప్సరసలతో విహరిస్తున్నాడు. జలార్థం నదికి రేణుక చిత్రరథుని దర్శిస్తూ వుండి పోయింది పతి దేవునికి హవన సమయమైనదన్న ం కూడ విస్మరించింది. ఆమె మనస్సు యీషణ్మాత్రంగా ఆ గంధర్వుని యందు లగ్న ది కూడ. హవన సమయం దాటినదని గ్రహించిన రేణుక భర్త శపిస్తాడన్న భీతితో ా పతిని చేరి జల భాండాన్ని పతి సన్నిధిలో వుంచి ముకుళిత హస్తయై నిలచింది. రేణుక కంగా వ్యభిచరించినదని గ్రహించిన జమదగ్ని క్రుద్ధుడై పుత్రులను పిలచి — తల్లిని నరక దేశించగా ఎవరూ అంగీకరించ లేక పోయారు. పితృ ప్రభావం తెలిసిన పరశురాముడు ఆజ్ఞను శిరోధార్యం చేసి తల్లినీ, అన్నలనూ కూడ నరికి వేశాడు. ప్రసన్నుడై జమ పరశురాముని అభీష్ట వరం కోరుకోమనగా—"తండ్రీ ! అన్నలనూ, అమ్మనూ పునర్జీవితు ముడనీ, తాను వారిని నరికినట్లు జ్ఞప్తి లేకుండా చేయండి" అని కోరాడు. ఉత్తర క్షణంలో సమేతంగా రేణుకా దేవి లేచి నిలచింది. పితృ ప్రభావం తెలిసిన వాడు కావడం వల్లనే ముడు అలా చేయ గలిగాడు.

తమ తండ్రిని పరశురాముడు సంహరించడం చూసిన కార్త్య వీర్యుని పుత్రులు నిరంతరం డుతూ తీవ్రంగా దుఃఖించ సాగారు. ప్రతీకార వాంఛతో వున్న వారందరూ సమయం కని రశురాముడు ఆశ్రమంలో లేని వేళ అక్కడకు వచ్చి—జమదగ్ని బాహ్య స్మృతిని విడనాడి యత్త చిత్తుడై వున్న సమయంలో వారు పాప భీతి లేక దుష్ట, క్రూరచిత్తులై ఆ మహా సంహరించి వేశారు, రేణుకాదేవి ఎంతగా ప్రతిమాలాడినా వారు ఆగ లేదు. జమదగ్ని శిర

ఏ ఖండించి తమతో తీసుకు పోయారు. రేణుకాదేవి నెత్తీ నోరూ రొమ్మూ బాదుకుంటూ _
శురామా ! రా. శీఘ్రంగా రా." అని బిగ్గరగా ఏడుస్తూ అరుస్తూ పిలవ సాగింది. భార్గవ
ుడు ఆమె ఆక్రందన ధ్వనిని దూరాన్నుండియే ఆలకిస్తూ శీఘ్రంగా పరుగెత్తికొచ్చి తండ్రి
ాన్ని మాత్రం చూశాడు, ఆ దృశ్యాన్ని చూసిన అతనికి వర్ణనాతీతమైన దుఃఖంతో పాటు
ం, అసహిష్ణుత్వం, మానసిక వ్యధలు కలిగాయి, మోహితుడై – హా తండ్రీ ! మహాత్మా!
త్మా ! నువ్వు మమ్మల్ని విడనాడి పోయావా ?" అంటూ అనేక విధాలు విలపించి పితృ
న్ని అగ్రజులకు వప్పగించి తాను గండ్రగొడ్డలి ధరించి దుష్ట క్షత్రియ సంహారం ని
్యంగా నిశ్చయించుకున్నాడు.

మాహిష్మతీ నగరం చేరిన భార్గవరాముడు కార్తవీర్యార్జున పుత్రుల మస్తకాలను, శత
న సంఖ్యతో ఖండ ఖండలు చేసి పర్వత రాశిగా పోశాడు. బ్రహ్మ హత్య కారణంగా ఆ
లవల్ల ఆ పుర శోభ నాశనమై పోయింది. వారి రుధిరంతో ఓ స్రవంతియే ప్రవహించినది.
తిలకించి భూసుర ద్రోహులు కంపించి పోయారు. అత్యాచారులైన క్షత్రియులు విప్ర
లుగా సంచరిస్తూన్నారని గ్రహించిన భార్గవరాముడు అట్టి వారి నందరినీ అంతంచేసి వారి
ంతో కురుక్షేత్రంలో శమంత పంచక స్థానంలో పంచ తటాకాలను నిర్మించాడు. పరశు
ు తండ్రి శిరస్సు తెచ్చి శరీరానికి అతికి సర్వ దేవ మయుడైన శ్రీమన్నారాయణుని
ించాడు. తద్యజ్ఞంలో ప్రాగ్దిశను హోతకు, దక్షిణ దిక్కును బ్రహ్మకు, పశ్చిమాన్ని
ర్యునకు ఉత్తర దిశను ఉద్గాతకు, యిచ్చి ఆగ్నేయాది వుపదిశలను కూడ ఋత్విజులకు
ా యిచ్చివేశాడు. కశ్యప ఋషికి మధ్యప్రదేశాన్ని, ఉపద్రష్టకు ఆర్యా వర్తాన్ని, సద
ులకు అన్య ప్రదేశాలనూ ప్రదానం చేశాడు, తద్రీతిగా యాగాన్ని పరిసమాప్తిచేసి అవ
స్నాతుడై – మేఘ రహితుడైన సూర్య భగవానునిలా సరస్వతీ నదీ తీరంలో పరశు
ప్రకాశించాడు. జమదగ్నికి స్మృతిరూప సంకల్పమయ దేహం లభించ పరశురామునిచే
పబడి – సప్తర్షి మండలంలో స్థానాన్ని సంపాదించి సప్తర్షులలో ఒకడై ఖ్యాతి గాంచాడు.
గ్ని రాబోయే మన్వంతరంలో సప్తర్షులలో ఒకడై వేద విస్తారం చేస్తాడు. ఎవ్వరినీ
పకుండ శాంతచిత్తుడై పరశురాము డిప్పుడు కూడ గంధమాదనంపై వున్నాడు. సిద్ధ
చారణాదులు నిరంతరం అతని కీర్తిని గానం చేస్తూ వుంటారు. సర్వ , శక్తి సంప

్డుడూ, విశ్వాత్ముడూ అయిన పరమాత్మాంశయే భృగు వంశంలో పరశురామ రూపంలో ాదుర్భవించి భూభార భూతులైన దుష్ట క్షత్రియులను అంతం చేసింది.

పరీక్షిన్నరపాలా ! ప్రజ్వలితాగ్ని సదృశంగా భాసించునట్టి విశ్వామిత్రుడు గాధికి కుడుగా పుట్టి తపస్సాధనద్వారా క్షత్రియత్వాన్ని త్యజించి బ్రహ్మ తేజస్సును పొందాడు. ్వమిత్రునకు గల పుత్ర శతంలో జ్యేష్ఠుడు మధు చ్ఛందుడు. ఈతని నామంతోనే శేషించిన ందరూ మధుచ్ఛంద నామ ప్రఖ్యాతు లయ్యారు. భార్గవ వంశీయుడు అజాగర్త నందనుడూ ు మేనల్లుడు అయిన శునశ్శేపుని విశ్వామిత్రుడు పుత్ర రూపంలో స్వీకరించాడు, దేవ రాతు మరో పేరు కూడ శునశ్శేపునికి వుంది. విశ్వామిత్రుడు తన పుత్రులను పిలచి శునశ్శేపుని ు పెద్దన్నగా భావించు డని ఆదేశించాడు. హరిశ్చంద్రుని యాగంలో యజ్ఞ పశువుగా ు రాబడ్డ శునశ్శేపు డీతడే. ఆ యాగంలో విశ్వామిత్రుడు వరుణాది దేవతలను స్తోత్రం చేసి శ్శేపుని పాశ బంధం నుండి విముక్తుని చేశాడు. అమరుల ద్వారా శునశ్శేపుడు విశ్వామిత్రు దత్తం చేయబడ్డాడు. "దేవైః రాతః" అనే వ్యుత్పత్తి ననుసరించియే అతనికి దేవరాత ం ఏర్పడింది, గాధి వంశంలో దేవరాత నామంతోనే అతడు ప్రఖ్యాతి గాంచాడు. విశ్వా క నందనులలో జ్యేష్ఠు లైనవారు శునశ్శేపుని అగ్రజునితో అంగీకరించకపోవడంతో ఆ ్మర్షి వారిని మ్లేచ్ఛు లయ్యెదరు గాక !" అని శపించాడు. అందులో 49 మంది మ్లేచ్ఛు ్యారు. మిగిలినవారు శునశ్శేపుని అన్నగా స్వీకరించారు. అట్టివారిని చూసి అతడు — ్ఎలారా ! మీవంటి సుపుత్రులవల్ల నేను ధన్యుడ నయ్యాను. మీరు కూడ సుపుత్రులనే పొందెదరు గాక ! శునశ్శేపుని ఆజ్ఞలను మీరు పాలించండి." అన్నాడు. విశ్వామిత్రునికి అష్టక. హారిత క్రతు మంతులనే పుత్రు లున్నారు. విశ్వామిత్రుని పుత్రులవల్ల కౌశిక గోత్రంలో భేదాలు ంగా వచ్చాయి. దేవరాతుని అగ్రజునిగా అంగీకరించడం వల్ల వారి ప్రవర్తనలో పరివర్తనం ింది.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-17

### రజి, క్షత్ర వృద్ధి ఆదిగా గల క్షత్రియ వంశ వర్ణన.

శుకమహర్షి పలికాడు - "రాజా! పురూరవ నందనులలో ఒకడైన ఆయువునకు ., క్షత్ర వృద్ధ, రజి, రంభ, అనే నామాలతో కుమారు లైదుగురు కలిగారు. వారిలో వృద్ధికి సుహోత్రుడు, అతనికి కౌశ, కుశ, గృత్సమద నామాలు కల ముగ్గురు పుత్రులూ . గృత్సమద నందనుడు శునకుడు, శునకునకే ఋగ్వేదులలో అగ్రేశ్వరుడైన శౌన ట్టాడు. కౌశ్యనకు కౌశి, కౌశికి రాష్ట్రి రాష్ట్రినకు, దీర్ఘతముడు దీర్ఘతమునకు ధన్వంతరి రు. ఈతడే ఆయుర్వేద ప్రవర్తకు డయ్యాడు. యాగ భోక్త అయిన వాసుదేవుని అంశ నే ధన్వంతరి ప్రాదుర్భవించాడు. ధన్వంతరికి కేతుమంతుడు అతనికి భీమరథుడు కలిగారు. నికి దివోదాసు, అతని ద్యుమంతుడు, అతనికే ప్రతర్దన నామం కూడ వుంది. అతనికే జిన్నామం కూడ వుంది. శత్రు జిన్నందనుడు అలర్కుడు. అతడు తప్ప-అంత సుదీర్ఘ రాజ్యం చేసినవాడు మరొకడు లేడు. అలర్క నందనుడు సంతతి - వాని కుమారుడు , వాని పుత్రుడు సుకేతనుడు, అతని పుత్రుడు ధర్మకేతువు, వాని పుత్రుడు సత్య అతని పుత్రుడు ధృష్టకేతువు, అతనికి సుకుమారుడు, వానికి వీతి హోత్రుడు, అతనికి అతనికి భార్గ భూమి పుట్టారు. క్షత్ర వృద్ధుని వంశజులైన వీరందరూ కౌశివల్ల పుట్టినవారే.

రంభుని పుత్రుడు రభసుడు వానికి గంభీరుడు, అతనికి అక్రియుడూ పుట్టారు. అక్రియ వల్ల విప్ర వంశంలో ప్రాదుర్భవించింది. అనే వంశ విస్తారం విను. అనే నందనునకు తనికి శుచి, వానికి త్రికకుత్, అతనికి ధర్మ సారథి పుట్టారు. అతనికి శాంత రయుడు, . అతడు విరాగియై పోవడం వల్ల అతనికి సంతతిలేదు.

ఆయువుకు రజి, అతనికి తేజస్సంపన్నులైన 500 మంది పుత్రులూ కలిగారు. అమరుల

ర్థనపై రజి రాక్షసులను అంతం చేసి దేవరాజ్యాన్ని మహేంద్రునికి యిచ్చాడు. ప్రహ్లాదాదు లీతిల్లి మహేంద్రుడు స్వర్గ రాజ్య రక్షణ భారాన్ని రజిపై వుంచగా సర్వ శక్తి సంపన్ను 'రజి' తన జీవిత కాలం తద్భారాన్ని భరించి దేహం చాలించాడు. తరువాత మహేంద్రుడు పుత్రులను తన రాజ్యాన్ని తన కిమ్మనగా వారు తిరస్కరించి హవిర్భాగాలు కూడ వారే ంచారు. తన రాజు దీనావస్థను చూసి — బృహస్పతి అభిచారిక క్రియల ద్వారా వారి పరివర్తితం చేయగా వారు ధర్మ మార్గాన్ని అతిక్రమించి అధర్మాచార్యు లయ్యారు. సమయంలో మహేంద్రుడు నిశ్శేషంగా రజి సంతానాన్ని అంతం చేసి అమర రాజ్యాధిపత్యం ాడు. దానితో రజి వంశం అంతరించింది. క్షత్ర వృద్ధి పౌత్రుడైన కుశునికి ప్రతీ వానికి సుడు వానికి జయుడు కలిగారు. జయునకు కృత్యుడు అతనికి హర్యవనుడు, వానికి సహ — అతనికి హీనుడు అతనికి జయసేనుడూ అతనికి సంకృతి, వానికి జయుడూ పుట్టారు. వరకే క్షత్ర వృద్ధుని వంశం కొనసాగింది.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–18

### యయాతి గాథ.

శుకమహర్షి పలికాడు — 'రాజా! నహుషునికి యతి, యయాతి, సంయాతి, అయాతి, — అన్న పేర్లు గల ఆరుగురు కుమారులు కలిగారు. జ్యేష్ఠ కుమారునికి పట్టం కట్టాలని ాడు సంకల్పించాడు. కాని అతడు తాను రాజ్య పాలనలో వుంటే ఆత్మ జ్ఞానానికి ఆటంకం సుందన్న భావంతో సర్వాన్నీ త్యజించి వేశాడు. ఇంద్రుని పత్నియైన శచీ దేవిని అనుభ ని వాంఛించిన నహుషుడు విప్ర శాపంచే అజగరమై స్వర్గాన్నుండి పతనమైన సమయా

యయాతి రాజ్యాధికారం వహించాడు. యయాతి తన సోదరులు నలుగురికీ నాలుగు దిశల ఆధిపత్యం యిచ్చాడు. యయాతి ఆచార్య శుక్రుని పుత్రియైన దేవయానినీ, వృషపర్వ రాజనందిని అయిన శర్మిష్ఠనూ పరిణయం చేసుకుని భూమండలాన్ని పాలించాడు.

అది విని పరీక్షిత్తు ప్రశ్నిస్తూన్నాడు — "యోగిపుంగవా! ఆచార్య శుక్రుడు విప్రుడు యయాతి చూడ క్షత్రియుడు. విప్రకన్య క్షత్రియుని పరిణయమాడితే విలోమ సాంకర్యం ఏర్పడుతుంది కదా? అది యిలా ఎందుకు జరిగింది?"

పరీక్షిత్తు ప్రశ్నకు శుకమహర్షి బదులు పలుకుతూన్నాడు — "రాజా! దానవ రాజైన వృషపర్వునకు శర్మిష్ఠ అనే పేరు కల ఓ కూతురుంది. ఓ నాడామె గురు పుత్రి అయిన దేవయానిని వెంటపెట్టుకుని సఖీ జనంతో వుద్యానవన విహారానికి వెళ్ళింది. అనేక సుందర తరు లతా, పుష్పములతో ఆ వుద్యానవనం మనోహరంగా వుంది. స్వాదుజల సంభరిత విశాల సరోవరాలతో కమలాలు వికసించి వున్నాయి. ఆ కమల గంధాన్ని సేవిస్తూ భ్రమరాలు ఝుం ఝుం నాదాలు చేస్తూ వుంటే ఆ ప్రదేశం కోలాహలంగా వుంది. ఆ తటాక తీరం చేరిన ఆ సుందర యువతులు వస్త్రాలు గట్టుమీద పెట్టుకుని తటాకంలో దిగి పరస్పరం నీళ్ళు చల్లుకుంటూ జలక్రీడలు సాగిస్తూ వున్నారు. తత్సమయంలో ఉమాకాంతుడైన మహాదేవ భగవానుడు వృషభ వాహనారూఢుడై అటువైపు రావడం చూసి సిగ్గుతో తలలు వంచుకుని గట్టుమీదకు వచ్చి తమ తమ వస్త్రాలు తీసుకొన్నారు. ఆ హడావిడిలో శర్మిష్ఠ తనదే అనుకుని దేవయాని వస్త్రాన్ని ధరించింది. అది గమనించిన దేవయాని కోపంగా — "ఔరా! ఈ దాసీది ఎంత సాహసం చేసింది. యాగంలో శునకం యజ్ఞభాగాన్ని తీసుకుపోయినట్లు నా వస్త్రాలను ధరించింది. నిజ తపోబలం ద్వారా విశ్వాన్నే సృష్టించగలవారూ, విశ్వ కళ్యాణ దృష్ట్యా వైదిక కర్మలను నిర్దేశించగలవారూ, బ్రహ్మేంద్రాదుల వందనా లందుకోగల సర్వ సమర్థులైన బ్రాహ్మణులమూ, భృగువంశీయులమూ అయిన మేము, భూసుర శ్రేష్ఠులకు లక్ష్మీకాంతుడైన శ్రీహరి కూడ ప్రణమిల్లుతూ వుంటాడే. ఈ శర్మిష్ఠ జనకుడు దానవుడే కాదు మా పితృదేవుల శిష్యుడు కూడ. అట్టి స్థితిలో యీ యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం లేకుండ, నా బట్టలను కట్టుకున్నది." అని నిందిస్తూంటే శర్మిష్ఠ క్రోధ దందహ్యమానయై దెబ్బతిన్న సర్పంలా బుసలు కొడుతూ— "యాచకీ! నీ కింత

ర్వం కూడదు. శునక వాయసాదులు మెతుకులకై గుమ్మాలలో పడివున్నట్లు నా గుమ్మం ముందు ందికి పడివుండేదానా?" అంటూ శర్మిష్ఠ దేవయాని వస్త్రాలను ఛిన్నాభిన్నం చేసి ఆ ప్రక్కనే న్న దిగుడుబావిలోకి ఆమెను త్రోసివేసింది.

శర్మిష్ఠ వెళ్ళిపోయిన తరువాత విధివశాన యయాతి రాజు దాహంతో ఆ నూతి దగ్గరకు ఏ వివస్త్రయై యున్న దేవయానిని తిలకించి తన వుత్తరీయాన్ని ఆమె కందించి చేయి నిచ్చి మెను ఆ బావి నుండి బయటకు తీశాడు. బయటకు వచ్చిన దేవయాని ప్రేమపూర్ణ హృద ంతో – "వీర శిరోమణీ! నేడు నువ్వు నా హస్తాన్ని గ్రహించావు. యీ పాణిని పరుడెవడూ ృశించ వీలులేదు. ఈ సంఘటన దైవ ప్రేరణగా జరిగింది. మన బంధాన్ని భగవంతుడే ర్పాటు చేశాడు. రాజా! ఆదిలో నేను బృహస్పతి పుత్రుడైన కచుని శపించినాను. ఆతడు ఓ తిరిగి శపిస్తూ – "నీకు బ్రాహ్మణు డెవడూ భర్త కాడు." అన్నాడు.

ఉపర్యుక్త రీతిని దేవయాని పలుకగా విన్న యయాతి – శాస్త్ర ప్రతికూలమే అయినా ం లేకపోయినా ప్రారబ్ధానుసారం ఏర్పడినది కావడం వల్ల – దేవయాని సౌందర్య ణ్యాకర్షితుడై ఆమె అభీష్టానికి అంగీకారం తెలియజేశాడు.

యయాతి వెళ్ళిపోయాడు. వెంటనే దేవయాని నెత్తీ నోరూ బాదుకుంటూ జనకుడైన ని సమీపించి సర్వం వినిపించింది. యావద్వృత్తాంతాన్నీ ఆలకించిన శుక్రుడు పౌరోహిత్య ని నిందించి యీ వృత్తిలో వుండడం కంటె కపోత వృత్తిని స్వీకరించి ధాన్యం ఏరుకుని డం శ్రేష్ఠమని నగరం విడిచి వెళ్ళిపోయాడు. ఆ విషయాలు తెలుసుకున్న వృషపర్వుడు చార్యులవారు తనను శపిస్తాడనీ లేదా వైరి గణంలో ప్రవేశించి ప్రమాద మేదైనా రావచ్చుననీ – ఆయన జాడ తెలిసికొని సమీపించి పాదాక్రాంతుడై ప్రార్థించాడు. ఉణిక గల శుక్రుడు – రాజా! నేను నా బిడ్డను విడనాడి వుండలేను. ఆమె ఆంతర్యం గ్రహించి ్ప గలిగితే తిరిగి నీ దగ్గరకు వస్తాను అలా చేయ గలిగిన నాడు ప్రమాదమేమీ వుండదు." ను.

అనంతరం దేవయాని తండ్రితో – జనకా! నేను పెళ్ళిచేసుకుని ఎక్కడికి వెడితే అక్క ర్మిష్ఠ తన చెలికత్తెలతో వచ్చి నన్ను సేవిస్తూ వుండాలి." అంది. ఆ పలుకుల నాలకించిన

వ్యతిరేకిస్తే తన వంశమే నాశనమై పోతుందనే భీతితో అసంఖ్యాక సఖీ జనంతో దేవయాని సంలగ్నురాలై పోయింది. తరువాత ఆచార్య శుక్రుడు దేవయానిని యయాతి కిచ్చి పరి చేసి – శర్మిష్ఠను దాసిగా వప్పగించి –"యీమె నెన్నడూ నీ శయ్య మీదకు ఆహ్వానించ అని శాసించి వెళ్ళి పోయాడు.

కాలం గడుస్తూన్నది. దేవయాని పుత్రవతి అయింది. తత్కాలంలో ఋతుస్నాతయైన యయాతిని ఏకాంతంలో చేరి సంయోగాన్ని అభిలషించింది. ఆచార్య శుక్రుని ఆదేశ వచ స్మృతిలో వున్నా ఋతు స్నాత అయిన శర్మిష్ఠ పుత్ర ప్రాప్త్యర్థం కామించడంతో ధర్మి యయాతిరాజు – ప్రారబ్ధాధీనానుసారం జరుగుతుందని నిశ్చయం చేసుకుని ధర్మానుకూల ర్మిష్ఠ అభీష్టాన్ని తీర్చాడు. యదు, తుర్వసు అన్న పేర్లు గల కుమారు లిద్దరు దేవయా గారు. శర్మిష్ఠకు ద్రుహ్యు, అను, పూరు–అన్న పేర్లు గల ముగ్గురు పుత్రులు జన్మిం తన భర్త ద్వారానే శర్మిష్ఠ పుత్రులను కన్నదని గ్రహించిన దేవయాని క్రోధ దండహ్యా తండ్రిని సమీపించింది. కామాతురుడైన యయాతి దేవయానిని వెంబడించి పాదా డై ఎంతగా బతిమలాడినా, ఆమె విన లేదు. అది చూసిన ఆచార్య శుక్రుడు భ్రుకుటి – రాజా! నువ్వు స్త్రీలంపటుడవై, కామాతురుడవై, బుద్ధిహీనుడవై, అసత్యవాది వు కనుక – నిన్ను వార్ధక్యం ఆవహించును గాక!" అని శపించాడు.

"ఆచార్యా! నీ పుత్రియందు నా కింకా కామ తృప్తి కలగ లేదు. ఈ శాపం నీ పుత్రికి అనర్థదాయకమే కదా!" అని యయాతి పలుకగా – "రాజా! నువ్వు నీ పుత్రులలో గా అంగీకరించి నీకు యౌవనాన్ని దానం చేస్తే – నీ వార్ధక్యం వానికి యిచ్చి నువ్వు అనుభవించు." అన్నాడు.

యయాతి తన మందిరం చేరి జ్యేష్ఠ పుత్రుడైన యదువును తన యౌవ్వనం యిమ్మని . దానికి యదువు పలుకుతూ – "జనకా! అకాలంలో వార్ధక్యం పొంది నేను లేను. విషయ సుఖాలు అనుభవించనిదే మానవునికి వైరాగ్యం కలుగదు. కనుక నాకు ం వద్దు." అన్నాడు.

తరువాత యయాతి ధీశాలీ, వయస్సులో చిన్నవాడూ అయిన పూరుని ఆహ్వానించి - ) ! అగ్రజు లందరిలా నువ్వు నా పలుకులను తిరస్కరించ కూడదు.'' దానికి పూరువు ానమిస్తూ - "జనకా! తండ్రి యొక్క వాత్సల్య, అనుగ్రహాల వల్లనే మానవ ుడు పరమపదం పొందగలుగుతాడు. దేహం లభించేది కూడ తండ్రి వల్లనే కదా! అట్టి జనకునకు ప్రత్యుపకారం చెయ్యని కుమారుడు డెవడుంటాడు? జనకుని మనోగతాన్ని ంచి సంచరించే పుత్రుడు ఉత్తముడు, జనకుడు చెప్పగా ఆచరించేవాడు మధ్యముడు, జనకుడు అతని మాటను వినని వాడు అధముడు, ఏ మార్గంలోనూ తండ్రిని అనుసరించని వాడు డే కాడు. అట్టివాడు కేవలం మలమూత్రాదులలోకి వస్తాడు." అన్నాడు. తరువాత అతడు ) వార్ధక్యాన్ని స్వీకరించాడు. యయాతి పుత్రుని యౌవ్వనాన్ని పొంది అదివలె విషయ ి అనుభవించ సాగాడు. యయాతి సామాన్యుడు కాడు. యావద్భూమండలాన్నీ శాసిస్తూన్న ాజ్యాధిపతి. తన ప్రజలను తన్న సంతానం వలె పాలిస్తూ ఇంద్రియ పాటవంతో సమ సారం - అవసరానికి మించి విషయా వాసనలలో మునిగి తేలుతూన్నాడు. ప్రియ పత్ని దేవయాని యయాతిని త్రికరణశుద్ధిగా సేవిస్తూ ఏకాంతంలో ఆనందాన్ని ప్రసాదిస్తూ సాగింది. యాగపురుషుడైన శ్రీహరి ఆనందార్థం యయాతి అనేక యాగాలు చేసి భూసురో కు భూరి దక్షిణలు ప్రసాదించి ఆ దేవదేవుని అనుగ్రహం పొందాడు. కరుణా సము ;, సర్వ వ్యాపకుడూ అయిన శ్రీమన్నారాయణ భగవానుని యయాతి నిజ హృదయ లో నిలుపుకుని నిష్కామ భావనయా ఆరాధించాడు. అలా దీర్ఘకాలం ఇంద్రియ సమేతంగా ్ను జోడించి విషయ సుఖా లనుభవించి కూడ తృప్తిని పొందలేక పోయాడు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-19

### యయాతి రాజు గృహాదులను పరిత్యజించుట.

శుకమహర్షి :- రాజా! నారీజన లోలుడై యయాతి చిరకాలం విషయ వాసనలు అనుభ
ఓనాడు తన అధఃపతనాన్ని గురించి యోచించి విరాగియై భార్యతో - దేవయానీ! నా
ను ఆలకించు, నావంటి విషయ వాసనా తత్పరుణ్ణి గురించి చెబుతాను. ఓ మహారణ్యంలో
స్తున్న తపోధనులయిన మహర్షులు నా వంటి విషయ వాసనా లోలురు తరించే మార్గాన్ని
చింతిస్తూ వుంటారు. ఓ అరణ్యంలో ఓ మేషం స్వేచ్ఛగా తిరుగుతూ వుండగా ఓనాడు
క ఒకటి దిగుడు బావిలో పడి వుండడం చూసింది. ఆ పోతు మేక తీవ్ర కామం కలది కావడం
బలిష్ఠమైన తన వాడి కొమ్ములతో ఆ బావి దగ్గర మట్టిని త్రవ్వి బావిలోపల వున్న ఆడ
పైకి రావడానికి దారి ఏర్పాటు చేసింది దానితో ఆడమేక సునాయాసంగా బయటకు
తో దానితో దీనికి బంధం ఏర్పడింది. ఎంతగా దానితో భోగాలనుభవిస్తూన్నా బలిష్ఠంగా
దానిని చూసి ఆ జంట పొందుతూన్న ఆనందాన్ని తిలకించి తాము కూడ ఆనందాన్ని
లన్న భ్రాంతితో ఆ మగమేకను చేరాయి. కామ పిశాచ గ్రస్థమైన ఆ మేకపోతు అనేక
ఆడమేకలతో భోగాలనుభవిస్తూ వివేకాన్ని కోలుపోయింది. నూతి నుండి బయటకు వచ్చిన
క తన పోతు యితరమైన ఆడమేకలతో సంచరించడం చూసి సహించ లేకపోయింది. కాముకు
తనవాని ప్రవర్తనను భరించలేక ఆదిలో తనను పోషించినవాని దగ్గరకు వెళ్ళిపోయింది.
డితయైన పోతుమేక 'మే మే' అంటూ దానిని వెంబడించి వెనుకకు త్రిప్పాలని ఎంతగా
్నించినా అది వెనుకకు మరల లేదు. ఆడ మేకను పెంచిన బ్రాహ్మణుడు కోపించి పోతు
ండాలు ఖండించి వేశాడు, కానీ దయతో వాటిని మరల దానికి అతికి వేశాడు. పునఃశక్తిని
పోతు - నూతి నుండి బయటకు వచ్చిన మేకతోనే చిరకాలం భోగాలు అనుభవించి కూడ

్రాప్తిని పొందలేకపోయింది. నా పరిస్థితి కూడ అలానే వుంది. నీ ప్రేమ పాశంలో బద్ధుడ
ైయాను. నీ మోహంలో చిక్కుకుని పరమార్థాన్నే విస్మరించాను.

'ప్రేయసీ! కామోపహతుడైన వానికి విశ్వంలో ధన కనక వస్తు వాహనాదులన్నీ లభిం
తృప్తి అన్నది వుండదు. ఆజ్యం పోయ అగ్ని జ్వాలలు చల్లారనట్లే భోగాలనుభవిస్తుండ-
ం వాసనలు శాంతించవు. ఆసక్తి శూన్యుడై, రాగద్వేష వివర్జితుడైనవానికి సర్వత్రా సుఖమే
ప్తిస్తుంది. విషయ దాహం దుఃఖ నిలయమై యుండ మందబుద్ధులు అత్యంత కష్టం మీద
విషయ వాసనలు విడనాడరు. అతి బలవంతాలైన యింద్రియాలు విద్వాంసులను సహితం
దానికి గురిచేస్తాయి. అందులకే తల్లి, చెల్లి, కూతురు ఆదిగా గలవారితో కూడ ఏకాంత
చేయరాదు. దీర్ఘ కాలం ఇంద్రియ సుఖాలు అనుభవించినా నాకు యింకా భోగాసక్తి
ం లేదు. అందులనే విషయ దాహాన్ని త్యజించి చిత్త వృత్తులను పరమాత్మలో లీనంచేసి
సమంగా అడవులలో సంచరిస్తాను, ఇహపర భోగాలన్నీ అసత్యాలే అని విశ్వసించి దార,
ధనాది రూప ఇహ సుఖాలను, స్వర్గ రూప ఫలాలనూ కూడ అభిలషించడం వల్ల ఆత్మ
మవుతుందని గ్రహించి సంగ సర్వస్వాన్నీ పరిత్యజించిన వాడే ఆత్మజ్ఞాని కాగలుగుతాడు."

పర్యుక్త రీతిని యయాతి-భార్య అయిన దేవయానికి ఉపదేశించి విషయ వాసనలను అన్నిం
రిత్యజించి–పూరుని యౌవనాన్ని పునః అతని కిచ్చి తన వార్ధక్యాన్ని తాను స్వీకరించాడు,
ను కోణ రాజ్యాన్ని ద్రుహ్యునకు. దక్షిణాన్ని యదువుకు పశ్చిమాన్ని తుర్వసునకు,
ాన్ని అనువునకు పంచి యిచ్చాడు. సప్త ద్వీప యుతమైన విశాల సామ్రాజ్యానికి పూరుని
ర్తిగా అభిషేకించాడు. తరువాత తాను విరాగియై నిర్జనారణ్యాలకు వెళ్ళిపోయాడు.
ో వుంటూ సర్వసంగ విముక్తుడై యయాతి ఆత్మ సాక్షాత్కారంతో త్రిగుణమయ లింగ
్న నాశనం చేసుకుని మాయామల రహితుడై నారాయణ పరబ్రహ్మయందు చిత్తాన్ని
త్తం చేసి భాగవతోత్తములు పొందే పరమగతిని పొందాడు.

భర్త బోధను గ్రహించిన దేవయాని విరాగిణి అయింది. దశ దిశలనుండి పానశాలకు
ారు – భగవత్ ప్రేరణానుసారం కర్మ సూత్ర బద్ధులై సమావేశ మవుతూంటారని
ంచి సర్వసంగాలనూ పరిత్యజించి వాసుదేవ పరమాత్మయందు మనస్సును లగ్నంచేసి

శరీరాన్ని విడనాడి పరమాత్మను పొందినది, చరాచర సృష్టికర్త, సర్వాశ్రయుడూ, సర్వ మంతుడూ అయిన వాసుదేవ పరమాత్మకు ప్రణమిల్లు తున్నాను, అనంత తత్త్వమైన ప్రశాంత స్వరూపునకు ప్రణమిల్లు తున్నాను.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-20

### దుష్యంత, భరతుల గాథలు.

శుకమహర్షి పలికాడు — "రాజా! పూరు వంశ వర్ణనను ఆలకించు. నువ్వు కూడ యీ వంశంలోనే జన్మించావు. పూరు వంశంలో రాజర్షులూ, బ్రహ్మర్షులూ అనేకమంది జన్మించారు. పూరునకు జనమేజయుడు వానికి ప్రాచిన్వంతుడూ, అతనికి ప్రవీరుడు, వానికి నమస్యుడు. వానికి చారుపదుడు కలిగారు. వానికి సుద్యుడు వానికి బహుగవుడు. అతనికి సంయాతి వానికి అహంయాతి అతనికి రౌద్రాశ్వుడు జన్మించారు. రౌద్రాశ్వునకు — ఋతేయు, కుక్షేయు, స్థండిలేయు, కృతేయు, జలేయు, సంతతేయు, ధర్మేయు, సత్యేయు, వ్రతేయు, వనేయు నామాలతో పదిమంది కుమారులు కలిగారు. అందులో జ్యేష్ఠుడైన ఋతేయునకు రంతి భారుడు, వానికి సుమతి ధ్రువ అప్రతిరథ నామాలతో కుమారులు ముగ్గురు కలిగారు. అప్రతిరథ నందనుడైన కణ్వునకు మేధా తిథి, వానికి ప్రస్కణ్వాది బ్రాహ్మణు లుదయించారు. సుమతికి రైభ్యుడు, దుష్యంతుడు కలిగారు.

దుష్యంత మహారాజు ఒకనాడు వేటకై అడవులకు వెళ్ళి అక్కడ కణ్వాశ్రమంలో దేవ కన్యా సదృశ్యమై, లక్ష్మీ సమ మనోహరమైన సుందర నవయౌవ్వనాంగియైన శకుంతలను చూసి పరమానంద భరితు డయ్యాడు. అతని మనస్సులో కామవాసన పుదయించింది,

ాంచి ఆమెతో — 'నీ వెవ్వతెవు? నీజనకు లెవరు? కమల దళాయతాక్షీ! నువ్వు క్షత్రి
గనవే నని నేను నిశ్చయంగా గ్రహించ గలుగు తున్నాను. కారణం పూరు వంశీయుల
ు అధర్మంగా లగ్నం కాదు.'' అన విని శకుంతల పలికింది.

"ఆర్యా! మీ వచనాలు పరమ సత్యాలే. నేను విశ్వామిత్ర రాజర్షి వల్ల మేనకకు
ంచిన దానను. మేనకా విశ్వామిత్రులు నన్ను అరణ్యంలో విడనాడిపోతే కరుణాసముద్రుడైన
మహర్షి నన్ను పెంచి యింత స్థితికి తెచ్చాడు. అందులకు కణ్వులవారే సాక్షి.
మీకు చేయ దగిన సేవ యేదో చెప్పండి. కమల నయనా! ఈ సుందరాసనంపై కూర్చోండి.
స్వాగత సత్కారాలు చేస్తాను. నీవారధాన్యంతో తయారైన భోజనాన్ని చెయ్యండి. అభ్యం
లేకుంటే నేటికి మా ఆశ్రమంలో విశ్రాంతి తీసుకోండి" అంది.

ఆనంద పరవశుడై దుష్యంతుడు పలికాడు — "కుశిక వంశోద్భవురాలవైన నీవీ రీతిగా
సత్కారాలు చేయడంలో ఆశ్చర్యం లేదు. క్షత్రియ కన్యలు తమ కనురూపుడైన వానిని
పతిగా నిర్ణయించుకోవడం సదాచారమే కదా!" అని పలుకుతూ ఆమె అంగీకారాన్ని అర్థం
ని దేశ కాల విషయజ్ఞుడు కావడంచే ఆమెను గాంధర్వ విధి ననుసరించి పరిణయం చేసు
డు. అమోఘ వీర్యుడైన దుష్యంతుడు ఆ రాత్రి అంతా ఆమెతో గడిపి మరునాడు నిజ
నికి వెళ్ళి పోయాడు. శకుంతల గర్భవతియై పుత్రుని కన్నది. మహర్షి కణ్వుడు సముచిత
ుంలో ఆ బాలునకు జాత కర్మాదులన్నీ నిర్వర్తించాడు. అపార బల, శక్తి సంపన్నుడైన
ుడు చిన్ననాడే సింహాలను బలాత్కారంగా యీడ్చుకు వచ్చి వాటిపై కూర్చుని ఆడుకునే
భగవదంశతో ప్రభవించిన అతడు అసామాన్య బల పరాక్రమ సంపన్నుడయ్యాడు.
నితో శకుంతల దుష్యంతుని చేరింది. నిర్దోషులైన పత్నీ పుత్రులను దుష్యంతుడు నిరాకరిం
ో ఆకాశవాణి యిలా పలికింది,

"రాజా! సంతానోత్పాదనలో స్త్రీ కేవలం తోలు తిత్తి వంటిది. యదార్థంగా కుమారుడు
సంబంధీకుడే. కారణం? తండ్రియే పుత్ర రూపంలో ప్రాదుర్భ విస్తాడు. నువ్వు శకుంత
అవమానించకు. నీ పుత్రుని భరించి పోషించు. వంశాన్ని వర్ధిల జేసే పుత్రుని వల్ల
దేవతలు మహానందం పొందుతారు. శకుంతల వచనాలు పరమ సత్యాలే."

ఆకాశవాణి పలుకులు ఆలకించి దుష్యంతుడు పత్నీ పుత్రులను ఆనందంగా రాజమందిరం
నుకు వెళ్ళాడు. దుష్యంతుని తరువాత అతని కుమారుడైన భరతుడే చక్రవర్తి అయ్యాడు.
ంశావతారుడైన దుష్యంత నందనుడగు భరతుని మహిమ నేటికీ గానం చేయ బడు
ది. భరతుని దక్షిణ హస్తంపై చక్ర చిహ్నాలూ, పాదాలలో పద్మ లాంఛనాలూ వున్నాయి.
షేక విధి ననుసరించి అతని సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవం జరిగింది. భరత చక్ర
ర్ఘతమ ఋషిని పురోహితునిగా వరించి గంగా సాగర సంగమంలో గంగా తటాన గంగో
ర్యంత్యం అశ్వమేధ యాగాలు యాభై ఐదు చేశాడు. అలాగే ప్రయాగ దగ్గర ఆరం
మునోత్తరి వరకూ డెబ్బై ఎనిమిది యాగాలు చేశాడు. ఆ యీ యాగాలలో ఆ చక్ర
పార ధన రాసులను భూసురోత్తములకు దానం చేశాడు. ఆ మహాత్ముడు ఉత్తమ స్థానా
యాగ సంబంధాగ్నిని స్థాపించాడు. అయ్యగ్ని స్థాపన ప్రదేశా లన్నింటిలోనూ ఒక్కొక్క
గో సహస్ర సంఖ్యలో గల భూసుర శ్రేష్ఠులకు గోదానాలు చేశాడు. ఆ మహారాజు ఆ
చేసిన యాగాలలో నూట ముప్పై అశ్వాలను బంధించి రాజు లందరినీ ఆశ్చర్య చకితులను
. ఆ యాగాల వల్ల అతడు అనంతమైన కీర్తిని పొందడమే గాక మాయను సయితం
ని సర్వ జగద్గురువైన శ్రీహరిని పొందాడు. యాగంలో 'మష్కార' నామ కర్మ కొన
వేళలో శ్వేత దంతాలు కలిగి కాల వర్ణం కల సువర్ణ భూషణాలంకృతాలైన అసంఖ్యాక
ు దానం చేశాడు. స్వర్గాన్ని ఎవడూ ముట్టనట్లు భరత చక్రవర్తితో సమంగా మహత్తర
ను ఆచరించిన వాడు భూమండలంలో లేడు. భవిష్యత్తులో వుంటాడని చెప్ప జాలము.
య యాత్రలో ఆ చక్రవర్తి కిరాత, హూణ, యవన, ఆంధ్ర, కంక, ఖశ, శక, మ్లేచ్ఛాది
ణ ద్రోహులైన దుష్ట క్షత్రియులను అందరినీ సంహరించి వేశాడు. ఆది కాలంలో రాక్ష
దేవతలను ఓడించి రసాతలాన వుంటూ అనేక మంది దేవతా స్త్రీలను అపహరించి తీసుకు
రు. భరత చక్రవర్తి వారిని కూడ జయించి ఆ దేవ భామినులను కూడ విడిపించాడు. భర
ైన రాజ్యంలో భూమ్యంతరిక్షాల నుండి ప్రజలకు కోరికలన్నీ నెరవేరేటట్లుగా శాసించాడు.
కాలం అతడు ఏకచ్ఛత్రాధిపతిగా పాలించాడు. లోక పాలురను సయితం చకితులను
తిలో అఖండైశ్వర్య, సార్వభౌమ సంపత్తి, అఖండ శాసనం, యీ జీవనం సయితం
' అని నిశ్చయించుకున్న భరతుడు యీ విశ్వం నుండి ఉపరతు డయ్యాడు. విదర్భ రాజ

తికలు ముగ్గురూ భరతుని ధర్మపత్నులై అనుకూలంగా సంచరిస్తూ సంతానవంతు లయ్యారు
తుడు భార్యలతో యీ పుత్రులు తన కను రూపులు కారని చెప్పగా వారు భర్త తమ్ము త్యజి
న్న భీతితో కుమారులను అంతం చేసి వేశారు. సంతానం తద్రీతిగా విచ్ఛిన్న మవడంతో
డు 'మరుత్సోమ' నామక యాగం చేయ మరుద్గణం సాక్షాత్కరించి ఆ చక్రవర్తికి 'భర
జ' నామక పుత్రుణ్ణి అనుగ్రహించాడు. ఒకానొక వేళ బృహస్పతి తన సోదరుడైన ఉత
పత్నిని అనుభవించ ప్రయత్నించాడు. తత్సమయంలో గర్భవతి అయిన ఆమె గర్భ గత
తత్కార్యాన్ని నిరోధించ బృహస్పతి వానిని అంధుడవు కమ్ము — అని శపించి ఆమెను
వించాడు. భర్త తనను పరిత్యజిస్తాడన్న భీతితో బృహస్పతి వల్ల కలిగిన కుమారుని ఆమె
ంచ సంకల్పించింది. తత్సమయంలో బృహస్పతి ఆమె గర్భస్థ బాలునకు నామ నిర్వచనం
— "మూర్ఖురాలా! యీ బిడ్డ నాకు ఔరసుడూ నా సోదరునకు క్షేత్రజుడూ అవుతాడు. వీణ్ణి
పోషించు. ఇద్దరికి పుత్రుడు కావడం వల్ల 'ద్వాజ' అనీ, భరించు మన్నాడు కనుక యీ
యం కలిసి 'భరద్వాజు' డన్నారు. అంత మమత — "బృహస్పతీ! యీ బిడ్డ నా పతికి
ధించిన వాడు కాదు కనుక మన యిరువురికీ సంబంధించిన వాడవుతాడు. కనుక వీణ్ణి నువ్వే
వాలి." అంటూ వారిద్దరూ సంఘర్షణపడి ఆ బాలుణ్ణి అక్కడే విడనాడి పోయారు. వాడే
ాజ' నామ ప్రఖ్యాతు డయ్యాడు. ఆ బాలుణ్ణి మరుద్గణం పాలించి పోషించి భరత వంశం
పోకుండ అతణ్ణి భరతునికి దత్తం చేశారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-21

## రంతి దేవోపాఖ్యానం.

శుకమహర్షి పలుకుతున్నాడు :- పరీక్షిన్నరేంద్రా! భరద్వాజునికి బృహత్క్షత్ర, జయ, ీర్య, నర గర్గ నామాలతో పుత్ర పంచకం కలిగింది. నర నందనుడు సంకృతి, అతనికి ంతి దేవ నామాలతో కుమారులు యిద్దరు కలిగారు. రంతి దేవ చక్రవర్తి ఖ్యాతి విశ్వ మయింది. ప్రాప్త వస్తువులతో సంతృప్తుడవుతూ రంతి దేవుడు ప్రయత్న రహితంగా పన చేస్తూన్నాడు. అప్రయత్నంగా లభించిన వస్తువులను కూడ అతడు అతిధి అభ్యాగ పంచి పెడుతూ తాను క్షుద్బాధతో వేదన పడుతూ వుండే వాడు. సంగ్రహ, పరిగ్రహ దూరంగా మమతా రహితంగా ధైర్యంగా భార్యా పుత్రులతో సహా అనేక సమయాలలో లేకుండ యాతనలు పడ్డాడు. ఒకానొక సమయంలో రంతి దేవుని జనులకు అన్న పానీయాలు లేకుండ 48 రోజులు ఉండవలసి వచ్చింది. రోజున ఆకలితో వున్న ఆ కుటుంబానికి ఘృత, పాయస, పానీయాదులు లభించాయి. ేవుడు పరివార సమేతంగా క్షుత్పిపాసలతో కంపిస్తూన్న సమయాన లభించిన పదార్థాలు ి సిద్ధమవుతూండగా ఓ బ్రాహ్మణుడు అతిథి రూపంలో ప్రత్యక్ష మయ్యాడు. జీవు ిని భగవద్దృష్టితో సందర్శించే రంతి దేవుడు ఆ పదార్థాలతో అతిథిని సేవించాడు. తృప్తితో అతిథి వెళ్ళి పోయాడు. తరువాత ఆ కుటుంబం తినడానికి కూర్చో బోతూం ్ద అతిథి వచ్చి 'దేహీ' అనడంతో అతణ్ణి కూడ అతడుఅన్నాదులతో పరితృప్తుని తరువాత శునకచ తుష్టయంతో మరో అతిధి రాగా వారికీ పెట్టి పరమాత్మయే యీ రూపాన తలచి ప్రసన్ను డయ్యాడు. ఇక రంతి దేవుని దగ్గర మిగిలినది స్వల్పంగా ఉదకం మే. అవి కూడ ఒక్క మనిషికి మాత్రమే సరిపోతాయి. తత్సమయంలో చండాలు డొకడు ంతి దీన భావంతో–"నాకు చాలా దాహంగా ఉంది. నీళ్ళు కావాలి," అన్నాడు. వాని దైన్య

తిలకించిన రంతిదేవుడు దయా సంతప్త హృదయుడై — నేను ఆత్మను అష్ట సిద్ధులతో కూడిన పరమ గతిని కోరడం లేదు. మోక్షం వాంఛించడం నేను అభిలషించే దల్లా సర్వ ప్రాణుల హృదయాలలో వుండి ఆ ప్రాణుల దుఃఖం నేను వించాలనీ అవన్నీ సుఖించాలనీ కోరుతున్నాను. ఈ దీన ప్రాణి జల పానం చేసి జీవించా లనుకుంటూ వున్నది. ఈ జలాలు నేను వీని కీయడం వల్ల యితడు జీవిస్తాడు. ఇక నాకు ఆకలి దప్పులూ, శరీర శైథిల్య, దైన్య, గ్లాని, శోక, మోహ, విషాదాదులేవీ లేవు. అన్నీ నాశనమై పోయాయి. నేను సుఖంగానే వుంటాను." అనుకుంటూ రంతి దేవుడు మిగిలిన జలాలు చండాలునికి పోశాడు. అవి లేకపోవడం వల్ల తన కుటుంబం మరణించే స్థితిలో వున్నా కరుణా రస పరి పూర్ణుడైన రంతిదేవుడు తదుదకాన్ని పానం చేయ జాలక దీనునికి యిచ్చి వేశాడు. మహా ధైర్య సంపన్న వాడతడు. ఆ వచ్చిన వాడు చండాల రూపంలో సాక్షాత్తూ భగవంతుడే. త్రిభువనాధీశు లైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే రంతి దేవుని సమక్షంలో సాక్షాత్కరించారు. అతడు ఆ ముగ్గురికూ సాష్టాంగ వందనం చేసి సంగరహితుడై, నిస్పృహతో నిలబడి పోయాడు. ప్రేమ భక్తి భావంతో వాసుదేవ భగవదాయత్తమైన చిత్తంతో తన్మయుడైనాడే కానీ వారి నేమీ కోరలేదు. అందులకే త్రిగుణ మయమైన మాయ నాశనమై పోయింది. అతణ్ణి అనుసరించి దారా పుత్రాదులు కూడ సత్సంగ ప్రభావం వల్ల సర్వ సంగ వర్జితులై యోగులై పరమే శ్వరుని ఆశ్రయించి మహా భక్తు లయ్యారు.

* * * *

మన్యు కుమారుడైన గర్గునికి శని ఉదయించాడు. క్షత్రియ వంశ సంజాతుడే అయినా గర్గుడు బ్రహ్మత్వం సాధించి బ్రాహ్మణ వంశాన్నే ఉద్ధరించాడు. మహా వీర్యునికి దురితక్ష యుడు. వానికి త్రయ్యారుణి, కవి, పుష్కరారుణి, అనే కుమారులు ముగ్గురు కలిగారు. వీరు ముగ్గురూ బ్రాహ్మణులే అయ్యారు. బృహత్ క్షత్రుని పుత్రుడు హస్తి — హస్తినా నగరాన్ని నిర్మించిన వాడితడే హస్తికి అజమీఢ, ద్విమీఢ, పురుమీఢ నామాలతో ముగ్గురు కుమారులు కలి గారు. అజమీఢుని సంతతిలో ప్రియ మేధాదులు బ్రాహ్మణు లయ్యారు. ఈతని సంతతిలోని బృహదిషునకు బృహద్ధనుడు పుట్టగా వానికి బృహత్కాయుడు జన్మించాడు వానికి సేనజిత్తు పుట్టాడు. రుచిరాశ్వ, దృఢహను, కాశ్య వత్స నామాలతో నలుగురు కుమారులు పుట్టారు. రుచి

)కి పౌరుడు. వానికి పృథుసేన నీప నామాలు కల కుమారు లిద్దరు జన్మించారు. నీపునికి
మంది పుత్రులు కలిగారు. నీప నందనులలోని వాడైన బ్రహ్మ దత్తుడు మహాయోగియై
మైన సరస్వతి వల్ల విష్వక్సేనుని కన్నాడు. ఈ విష్వక్సేనుడు జైగీషవ్య మహర్షి ఉపదే
'రం యోగ శాస్త్రాన్ని రచించాడు. ఇతని కుమారుడు ఉదక్స్వేనుడు, వీనికి కలిగిన వాడు
డు.

ద్విమీఢునికి పుట్టినవాడు యవీనరుడు వాని పుత్రుడు కృతిమంతుడు, వాని పుత్రుడు సత్య
వాని పుత్రుడు కృతిమంతుడు, వాని పుత్రుడు సత్యధృతి. వానికి దృఢనేమి వానికి సుపా
) కలిగారు. వానికి సుమతి, వానికి సన్నతిమంతుడు వానికి కృతి, వానికి హిరణ్యనాభుడూ
). హిరణ్య నాభుని వల్ల యోగ విద్య లభించింది. 'ప్రాచ్య' అనే పేరు గల సామాలు
యితని వల్లనే వ్యాప్తిలోకి వచ్చాయి. కృతి నందనుడైన నీపునికి ఉగ్రాయుధుడు కలిగాడు.
క్షేమ్యుడు, వానికి సువీరుడు, అతనికి రిపుంజయుడూ కలిగారు. వానికి బహురథుడూ
). దివ్యమీఢ సోదరుడైన పురుమీఢునకు పిల్లలు పుట్ట లేదు. అజమీఢుని ద్వితీయ పత్ని –
ఆమెకు కలిగిన నీలునకు శాంతి, వానికి సుశాంతి, వానికి పురుజుడు, వానికి అర్కుడు, వానికి
శ్వుడు, వానికి ముద్గలుడు, యవీనరుడు, బృహదిషుడు, కాంపిల్యుడు, సంజయుడు – అన్న
లు కలగడంతో భర్మ్యాశ్వుడు ప్రసన్నుడై – "నా పుత్రులు పంచ దేశాలు పాలించ సమ
అని పలుక వారు (పంచ + అలం) పాంచాల నామంతో ప్రసిద్ధి చెందారు. వీరిలో ముద్గ
బ్రహ్మత్వం సాధించి భూసుర శ్రేష్ఠుడై మౌద్గల్య గోత్ర ప్రవర్తకు డయ్యాడు. ముద్గలు
సోదాసు, అహల్య కవలలుగా పుట్టారు. అహల్యను గౌతముడు పరిణయ మాడాడు. ఆమెకు
ందుడు. వానికి సత్యధృతి. అతనికి శరద్వంతుడూ కలిగారు. ఓ నాడు అతడు ఊర్వశిని
) చలించిన హృదయంతో రేతస్సును విడువగా–అది రెండు భాగాలుగా దర్భ స్తంభంపై
. అందుండి ఓ పురుషుడు, ఓ కన్య ప్రభవించగా శంతన మహారాజు అడవిలో వేటాడు
గా వారిని చూశాడు. దయతో వారిద్దరినీ నగరానికి తీసుకు వెళ్ళి పెంచాడు. కృపాళుడై
అతడు పెంచడం వల్ల అతనికి కృపాచార్యుడనీ, ఆ కన్యకు కృపి అనీ నామకరణం
. కృపిని ఆచార్య ద్రోణుడు వివాహం చేసుకున్నాడు.

–0–

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం-9 అధ్యాయం-22

### కౌరవ, పాంచాల, మగధరాజుల గాథలు.

శుకమహర్షి పలికాడు – "రాజా! దివోదాస పుత్రుడైన మిత్రేయునికి చ్యవన, సుదాస, స, సోమక నామధేయులయిన కుమారులు నలుగురు కలిగారు. వీరిలో సోమకునకు నూర్గురు కలిగారు. వారిలో జ్యేష్ఠుడు జంతు – అన్న పేరు గల వాడు కాగా కనిష్ఠుడు పృషతుడు, నందనుడైన ద్రుపదునికి ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదీ కలిగారు. ధృష్టద్యుమ్న నందనుడు తువు. భర్మ్యాశ్వ వంశజులైన వీరంతా పాంచాలురనే నామంతో ఖ్యాతి గాంచారు. అజమీ ద్వితీయ పుత్రుడయిన ఋక్షునకు 'సంవరణ' నామక పుత్రుడు కలిగాడు. సంవరణుడు పుత్రి అయిన తపతిని పరిణయమాడి కురు క్షేత్రాధిపతి అయిన 'కురు' నామకుని కన్నాడు. కు పరీక్షిత్తు, సుధన్వుడు, జహ్ను, నిషధాశ్వుడు అన్న పేరుతో నలుగురు కుమారులు . సుధన్వునికి సుహోత్రుడు, అతనికి చ్యవనుడు, వానికి కృతి, అతనికి ఉపరిచర వసువు. బృహద్రథాది పుత్రులూ ప్రభవించారు. వారిలో బృహద్రథ, కుశాంబ మత్స్య, ప్రత్యగ్ర, నే వారు చేది దేశ పాలకు లయ్యారు. బృహద్రథ నందనుడు కుశాగ్రుడు, వానికి ఋష అతనికి సత్య హితుడు, వానికి పుష్పవంతుడు, అతనికి జహ్ను వు పుట్టారు. బృహద్రథుని ప పత్ని ఖండ ద్వయంగా పుట్టిన శరీర భాగాలను రెంటినీ ఆమె కందకంలోకి విసిరి. 'జర' అనే రక్కసి ఆ భాగాలను రెంటినీ సంధానం చేయగా జీవించిన ఆ బాలుడు ంధ' నామ ప్రఖ్యాతు డయ్యాడు. వానికి సహదేవుడు – అతనికి సోమాపి. వానికి శ్రుత వా కలిగారు. కురుని జ్యేష్ఠ నందనుడైన పరీక్షిత్తుకు సంతానం కలగ లేదు. జహ్ను నంద సురథుడు. అతనికి విదూరథుడు, వానికి సార్వభౌముడు అతనికి జయసేనుడు, వానికి రాధి అతనికి అయుతుడు, వానికి క్రోధనుడు, అతనికి దేవాతిథి, వానికి ఋష్యుడు, అతనికి దిలీ

అతనికి ప్రతీపుడూ కలిగారు. అతనికి దేవాపి శంతనుడు, బాహ్లీకుడు, అన్న పేర్లతో
ులు ముగ్గురు కలిగారు. అందులో పెద్ద అయిన దేవాపి రాజ్యం వదిలి అరణ్యానికి తప
ం వెళ్ళిపోయాడు. దానితో శ్రేష్ఠుడూ, కనిష్ఠుడూ అయిన శంతనుడే రాజ్యం పొందాడు.
జన్మలో మహాభిష రాజర్షియే శంతనుడై పుట్టాడు. ఆతడు తన చేతితో ఎవరిని
ంచినా వారు వార్ధక్యం పోయి యౌవ్వనవంతు లవుతారు. తద్వారా పరమ శాంతి లభిస్తుంది,
ంకే ఆతనికి శంతనుడన్న నామం సార్ధకమయింది, ఒకానొకప్పుడు శంతనుని రాజ్యంలో
ంవర్ష పర్యంతం క్షామస్థితి ఏర్పడ వేదజ్ఞులు ఆ మహారాజును చేరి — "అగ్రజునికి
కాకుండ నువ్వు పెళ్ళి చేసుకున్నావు. ఆ దోషం వల్ల వర్షాలు కురియడం లేదు. "రాష్ట్రి
మల ఔన్నత్యాన్నే నువ్వు వాంఛిస్తూ వుంటే నీ అన్నకు రాజ్యం యిచ్చి వెయ్యి." అనగా
డు అడవులకు వెళ్ళి — అన్నను రాజ్యం స్వీకరించు మని కోరాడు. అంతకుముందే
త నామక శంతనుని మంత్రి వేద విరుద్ధ ధర్మాలు బోధించుమని దేవాపి దగ్గరకు
్మణులను కొంతమందిని పంపగా వారి వాక్యాలు విన్న దేవాపి వేద మార్గానుసారం గృహ
ాన్ని స్వీకరించాడానికి బదులు వేద నింద ఆరంభించాడు. ఆ కారణం వల్ల అతనికి
ధికారం పోయింది. రాజ్యంలో వర్షం పడడం ఆరంభమయింది. దేవాపి యిప్పుడు కూడ
ంకు నివాస స్థానమైన కలాప గ్రామంలో యోగ సమాధిలో ఉన్నాడు. కలియుగాన చంద్ర
నాశనమైపోతుంది. పునః కృతయుగారంభంలో దేవాపి ద్వారా చంద్రవంశం వర్ధిల్లుతుంది.
సోదరుడైన బాహ్లీక నందనుడు సోమదత్తుడు ఆతనికి భూరి, భూరిశ్రవస, శల నామా
ుమారులు ముగ్గురు కలిగారు శంతనుని వల్ల గంగా గర్భంలో నైష్ఠిక బ్రహ్మచారి అయిన
ం పుట్టాడు. సర్వ ధర్మ మర్మజ్ఞుడైన యీతడు భగవద్భక్తుడూ, పరమ జ్ఞాని అయి
ొందాడు. విశ్వ విఖ్యాత యోధులలో భీష్ముడు అగ్రేసరుడు, సర్వ క్షత్రియ హంతకు
ంతడు పరశురామునితో కూడ యుద్ధం చేసి మెప్పు పొందిన జగజ్జెట్టి. శంతనునికి దాశ
ుతి అయిన సత్యవతి వల్ల విచిత్ర వీర్య, చిత్రాంగద నామాలతో కుమారు లిద్దరు కలి
ఆమెయందే నా జనకుడైన వేదవ్యాసుడు పరాశర వీర్యం ద్వారా ప్రాదుర్భవించాడు.
నుమై, పరమ పావనమైన యీ భాగవత మహా పురాణాన్ని నేను నా తండ్రి అనుగ్రహం
గ్రహించ గలిగాను. దీనిని నా జనకుడు పైలాది తన శ్రేష్ఠ శిష్యులకు సయితం బోధించ

కి ప్రతీపుడూ కలిగారు. అతనికి దేవాపి, శంతనుడు, బాహ్లీకుడు, అన్న పేర్లతో కుమారులు రు కలిగారు. అందులో పెద్ద అయిన దేవాపి రాజ్యం వదిలి అరణ్యానికి తపస్సార్థం వెళ్ళి ాడు. దానితో శ్రేష్ఠుడూ, కనిష్ఠుడూ అయిన శంతనుడే రాజ్యం పొందాడు. పూర్వ జన్మలో భిష రాజర్షియే శంతనుడై పుట్టాడు. అతడు తన చేతితో ఎవరిని స్పృశించినా వారు వార్ధక్యం యౌవ్వన వంతు లవుతారు. తద్వారా పరమ శాంతి లభిస్తుంది. అందువల్లే అతనికి శంతన సార్ధకమయింది. ఒకానొకప్పుడు శంతనుని రాజ్యంలో ద్వాదశ వర్ష పర్యంతం క్షామ ర్పడ వేదజ్ఞులు ఆ మహారాజును చేరి — "అగ్రజునికి పెండ్లి కాకుండ నువ్వు పెళ్ళి న్నావు. తద్దోషం వల్ల వర్షాలు కురియుడం లేదు. "రాష్ట్ర, నగరాదుల ఔన్నత్యాన్నే వాంఛిస్తూ వుంటే నీ అన్నకు రాజ్యం యిచ్చి వెయ్యి." అనగా శంతనుడు అడవులకు — అన్నను రాజ్యం స్వీకరించు మని కోరాడు. అంతకుముందే అశ్మరాత నామక శంత మంత్రి వేద విరుద్ధ ధర్మాలు బోధించుమని దేవాపి దగ్గరకు బ్రాహ్మణులను కొంతమందిని ా వారి వాక్యాలు విన్న దేవాపి వేద మార్గానుసారం గృహస్థాశ్రమాన్ని స్వీకరించడానికి వేదనింద ఆరంభించాడు. ఆ కారణం వల్ల అతనికి రాజ్యాధికారం పోయింది రాజ్యంలో పడడం ఆరంభమయింది. దేవాపి యిప్పుడు కూడ యోగులకు నివాస స్థానమైన కలాప ంలో యోగ సమాధిలో ఉన్నాడు. కలియుగాన చంద్రవంశం నాశనమై పోతుంది పునః యుగారంభంలో దేవాపి ద్వారా చంద్రవంశం వర్ధిల్లుతుంది. శంతను సోదరుడైన బాహ్లీక డు సోమదత్తుడు అతనికి భూరి, భూరిశ్రవస, శల నామాలతో కుమారులు ముగ్గురు కలి శంతనుని వల్ల గంగా గర్భంలో నైష్ఠిక బ్రహ్మచారి అయిన భీష్ముడు పుట్టాడు. సర్వ మర్మజ్ఞుడైన యీతడు భగవద్భక్తుడూ, పరమ జ్ఞానీ అయి ఖ్యాతి గాంచాడు, విశ్వ తి యోధులలో భీష్ముడు అగ్రేసరుడు, సర్వ క్షత్రియ హంతకుడైన అతడు పరశురామునితో యుద్ధంచేసి మెప్పు పొందిన జగజ్జెట్టి శంతనునికి దాశరాజ పుత్రి అయిన సత్యవతి వల్ల త వీర్య, చిత్రాంగద నామాలతో కుమారు లిద్దరు కలిగారు ఆమె యందే నా జనకుడైన ్యాసుడు పరాశర వీర్యం ద్వారా ప్రాదుర్భవించాడు. గోపనీయమై, పరమ పావనమైన భాగవత మహా పురాణాన్ని నేను నా తండ్రి అనుగ్రహం వల్ల నే గ్రహించ గలిగాను. నా జనకుడు పైలాది తన శ్రేష్ఠ శిష్యులకు సయితం బోధించలేదు. అందువలకు అధికారిని

ీవడం వల్ల నాకే వుపదేశించాడు. కారణం? శాంతాది గుణాలు నాయందే తేజరిల్లడం వల
ాగ్యం నాకే లభించింది. శంతనుని ద్వితీయ పుత్రుడైన విచిత్ర వీర్యునికి కాశీ రాజ
లయిన అంబిక, అంబాలికలను తెచ్చి భీష్ముడే వివాహం చేశాడు. స్వయంవర మహో
ో క్షత్రియ వీరు లందరినీ ఓడించి ఆ కన్య లిద్దరినీ జయించి తెచ్చినాడు. సౌందర్య,
ౌనాంగు లయిన భార్యా లోలుడైన విచిత్ర వీర్యుడు క్షయ వ్యాధితో మరణించాడు. సత్య
సనాన్ని అనుసరించి వేదవ్యాసుడే సోదర పత్ను లయిన అంబిక, అంబాలికలకు సంతానం
ించాడు. వారికి ధృతరాష్ట్ర పాండు రాజులు కలిగారు. మూడవసారి దాసివల్ల మహాజ్ఞాని
విదురుడు పుట్టాడు. ధృతరాష్ట్ర పత్ని అయిన గాంధారి వల్ల దుర్యోధనాది కుమారుల
ంది దుశ్శల అనే పుత్రి కలిగాడు. పాండు రాజు శాపగ్రస్తుడు కాగా అతని పత్ని అయిన
ివి యమ, వాయు, ఇంద్ర దేవతల కరుణ వల్ల యుధిష్ఠిర, భీమ, అర్జున నామాలు కల
రథులైన పుత్రులు కలిగారు. పాండు రాజు ద్వితీయ పత్ని అయిన మాద్రి అశ్వినీ
ుల వల్ల నకుల సహదేవులు పుట్టారు. పంచపాండవులకు ద్రౌపది వల్ల ప్రతి వింధ్య,
సేన, శ్రుతకీర్తి శతానీక శ్రుత కర్మ నామాలతో ప్రసిద్ధు లయ్యారు. వీరే కాక ధర్మజునికి
ియందు దేవకుడు, భీమునికి హిడింబి వల్ల ఘటోత్కచుడు, కాళి వల్ల సర్వగతుడు అనే
లూ కలిగారు. సహదేవునకు పర్వతనందిని విజయ వల్ల సుహోత్రుడు, నకులునకు కరేణు
వల్ల నరమిత్రుడూ పుట్టారు. అర్జునునికి నాగకన్య అయిన ఉలూపి వల్ల యందిరా
ుడూ మణిపురాధీశ పుత్రి వల్ల బభ్రువాహనుడూ పుట్టారు. బభ్రువాహనుడు మాతామహునకే
డయ్యాడు పెళ్ళి వేళలోనే వారు అలా నియమం పెట్టుకున్నారు. అర్జునునకు సుభద్ర వల్ల
వీరుడైన నీ తండ్రి అభిమన్యువు కలిగాడు. అభిమన్యునకు ఉత్తరా గర్భం వల్ల నువ్వు
ుర్భవించావు. నువ్వు నీ తల్లి గర్భంలో వుండగానే కురువంశం నాశనమై పోయింది.
త్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వల్ల నువ్వు ఆ గర్భంలో తపించిపోయావు. సాక్షాత్తూ
ీరి కృపవల్ల నువ్వు మృత్యువు నుండి రక్షింప బడ్డావు.

పరీక్షిన్న రేంద్రా! నీ పుత్రు లయిన జనమేజయ శ్రుతసేన, భీమసేన, ఉగ్రసేనలు
ుడే వున్నారు కదా! వీరందరూ పరాక్రమశాలురే. తక్షక విషాగ్ని ద్వారా నువ్వు అంత
తరువాత యీ జనమేజయుడు సర్ప జాతిపై ఏర్పడ్డ క్రోధంతో సర్పయాగం చేస్తాడు.

గో నాగులన్నీ అంతమైపోతాయి. అంత ఆతడు పృథ్వీ నంతనూ జయించి కావషేయ
నైన తురుని అధ్వర్యునిగా వరించి అశ్వమేధ యాగం చేస్తాడు. అనేకమైన యజ్ఞాల
శ్రీమన్నారాయణ భగవానుని ఆరాధిస్తాడు. జనమేజయ పుత్రుడు శతానీకుడు యాజ్ఞ
మహర్షి ద్వారా వేదత్రయాన్నీ, కర్మకాండనూ గ్రహించి కృపాచార్యుని ద్వారా అస్త్ర
గా, శౌనకుని వల్ల ఆత్మ జ్ఞానాన్నీ పొంది నిత్యానందానుభూతిని పొందుతాడు. శతానీక
నకు జన్మించిన సహస్రానీకునకు అశ్వమేధజుడు వానికి అసమీ కృష్ణుడు, వానికి నేమి
గా కలిగాడు. హస్తినాపుర నగరం గంగలో మునిగినవాడు యీతడు కౌశాంబిలో సుఖ
ఏర్పరచుకుంటాడు. నేమి చక్రునకు చిత్రరథుడు, వానికి కవి రథుడు, అతనికి వృష్టి
డు, అతనికి సుషేణుడు, ఆతనికి సునీథుడు, అతనికి నృచక్షువు, వానికి సుఖీ నలుడు అత
రిప్లవుడు వానికి సునయుడు అతనికి మేధావీ, అతనికి నృపంజయుడు, వానికి దూర్వుడు,
తిమి, వానికి బృహద్రథుడు ఆతనికి సుదాసు, ఆతనికి శతానీకుడు వానికి దుర్దమనుడు,
వహీనరుడు, అతనికి దండపాణి, వానికి నిమి, అతనికి క్షేమకుడూ కలిగారు. ఈ రీతిగా
చంద్ర వంశాన్ని గురించి వినిపించినాను. మహర్షులూ, అమరులూ కూడ యీ వంశాన్ని
గా సత్కరించారు.

జరాసంధునకు మార్జారి, వానికి శ్రుతశ్రవుడు అతనికి అయుతాయువు వానికి నిరమిత్రుడు
సునక్షత్రుడు, వానికి బృహత్సేనుడు వానికి కర్మజిత్తు, అతనికి కృతంజయుడు అతనికి
, వానికి శుచి, అతనికి క్షేముడు, అతనికి సువ్రతుడూ అతనికి ధర్మసూత్రుడూ, అతనికి
గా, వానికి ద్యుమత్సేనుడు అతనికి సుమతి, అతనికి సుబలుడు, వానికి సునీథుడు, ఆతనికి
త్తు అతనికి విశ్వజిత్తు, అతనికి రిపుంజయుడూ కలుగుతారు. వీరందరూ మగధ రాజులు
వీరి రాజ్యకాలం సహస్ర వత్సర పర్యంతం వుంటుంది.

—0—

# శ్రీమద్భాగవ మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–23

## య దు వం శ వ ర్ణ న.

శుకమహర్షి పలుకుతూన్నాడు :– "కురు వంశ తిలకా ! పరీక్షిన్నరపాలా ! యయాతి
ైన అనువుకు సభానర, చక్షు, పరోక్ష నామాలతో కుమారులు నలుగురు కలిగారు. అందు
ిడైన సభానరునికి కాలనరుడు ఆతనికి సృంజయుడు, వానికి జనమేజయుడు, ఆతనికి
ిలుడు ఆతనికి మహా మనుడు వానికి ఉశీనరుడు, తితిక్షువు–అనే కుమారు లిద్దరు కలిగారు.
నకు శిబి, వన, శమి, దక్ష నామాలు కల నలుగురు పుత్రులు కలిగారు. శిబికి వృషాదర్భ,
మద్ర. కైకేయ నామాలు కల పుత్రులు నలుగురు కలిగారు. తితిక్షునకు రుశద్రథుడు ఆత
ాముడు ఆతనికి సుతపుడు, ఆతనికి బలి అనే పుత్రుడూ కలిగారు. బలి సతికి దీర్ఘతమ
అనుగ్రహం వల్ల అంగ, వంగ, కళింగ, సుహ్మ, పుండ్ర, అంధ్ర నామాలతో కుమారులు
రు కలిగి తూర్పు దిక్కులో గల పృథ్వీ మండలాన్ని షడ్భాగాలుగా చేసి తమ పేర్లతోనే
చి ఆయా దేశాలకు ఆయా నామాలే వుంచి పాలించారు. అంగ నందనుడైన ఖనపానునకు
ఘుడు కలిగాడు. ఆతనికి ధర్మ రథుడు, వానికి చిత్రరథుడు కలిగారు. చిత్రరథుడే రోమ
ామాంతరంలో ప్రసిద్ధుడై — అయోధ్యాధిపతియైన దశరథునికి మిత్రు డయ్యాడు. రోమ
ు తన పుత్రి అయిన శాంతాదేవిని ఋశ్య శృంగున కిచ్చి వివాహం చేశాడు. విభాండక
వీర్యం వల్ల హరిణీ గర్భం నుండి ప్రాదుర్భవించిన వాడే ఋష్య శృంగుడు. ఒకానొక
ంలో అంగ దేశంలో వర్షం లేక బాధపడుతూ వుంటే అంగ దేశాన్నుండి వేశ్యాంగనలు
ుని ఆశ్రమం చేరి హావభావ ఆలింగనాదుల ద్వారా, నృత్య గీత వాద్య విశేషాలతో
శృంగుని మోహితుని చేసి అంగ దేశానికి తీసుకు వెళ్ళగా ఆ తపోధనుని పాద స్పర్శ
ంచే అంగ దేశ మంతా వర్షాలు కురిసి క్షామం దూరమై సుఖశాంతులు సిద్ధించాయి. ఋష్య

ని అధ్వర్యంపై రోమపాద, దశరథు లిద్దరూ పుత్రవంతు లయ్యారు. రోమపాద
కు చతురంగుడు, అతని కుమారుడు పృథులాక్షుడు, అతనికి బృహద్రథ, బృహత్కర్మ,
భను నామాలతో కుమారులు ముగ్గురు కలిగారు. అందులో బృహద్రథునికి బృహన్మనుడు,
జయద్రథుడు అతనికి సంభూతి, వానికి విజయుడు, అతనికి ధృతి, అతనికి ధృతవ్రతుడు
సత్కర్ముడు, వానికి అధిరథుడు, జన్మించినాడు. అధిరథునికి సంతానం లేదు. అతనికి
దిలో కొట్టుకు వచ్చిన పెట్టెలో ఓ బాలుడు లభించాడు. తేజోమయమూర్తి అయిన అతడే
ర శూరకర్ణ నామ ప్రఖ్యాతు డయ్యాడు. కర్ణ నందనుడు వృషసేనుడు. యయాతి పుత్రు
వహ్యునకు బభ్రునామక పుత్రుడు కలిగాడు. అతనికి సేతు, వానికి ఆరబ్ధుడు, వానికి
డు, అతనికి ధర్ముడు అతనికి ధృతుడు వానికి దుర్మదుడు, అతనికి ప్రచేతుడూ పుట్టారు.
నూరుగురు కుమారులు కలిగి ఉత్తర దిశలో వున్న మ్లేచ్ఛులకు అధిపతు లయ్యారు.
తి పుత్రులలో తుర్వసుకు వహ్నియు అతనికి భర్గుడు, వానికి భానుమంతుడు, అతనికి
వు, అతనికి ఉదారబుద్ధి అయిన కరంధముడూ కలిగారు. కరంధమునకు పురుత్తూ కలి
మరుత్తునకు సంతానం లేకపోవడం వల్ల పూరు వంశంలోని వాడైన దుష్యంతుని పెంచగా
కాంక్షతో అతడు పునః పూరు వంశానికే వెళ్ళిపోయాడు.

రాజా! ఇక యదువంశాన్ని గురించి చెబుతాను విను. ఈ వంశ వర్ణనను ఆలకించినంత
న మానవులు పాపదూరు లవుతారు. ఈ వంశమందే సాక్షాత్తూ శ్రీకృష్ణ పరమాత్మ
రూపంలో అవతరించాడు. యదువుకు సహస్ర జిత్తు, క్రోష్ఠ, నల, రిపు నామాలతో కుమా
లుగురు కలిగారు. సహస్ర జిత్తునకు శతజిత్తు, అతనికి మహాహయ వేణుహయ, హై
నామాలతో ముగ్గురు కలిగారు. అందులో హైహయునికి ధర్ముడు, అతనికి నేత్రుడు,
సంతి అతనికి సోహంజి, అతనికి మహిష్మంతుడు వానికి భద్రసేనుడు, అతనికి దుర్మ
నకుడు, ప్రభవించారు. ధనకునికి కృత వీర్యుడు, కృతాగ్ని కృతవర్మ, కృతతేజ నామా
లుగురు కుమారులు కలిగారు. కృతవీర్యునికి అర్జునుడు జన్మించాడు. ఈతడే కార్త
ర్జున నామ ప్రఖ్యాతుడై సప్త ద్వీపితమైన భూతలాన్ని పాలించి సమ్రాట్ అయ్యాడు.
దత్తాత్రేయ భగవానునికి శిష్యుడై యోగ విద్యను పొంది అణిమాద్యష్ట సిద్ధులూ సంపా
. తపోదానయాగ, యోగ, శాస్త్ర జ్ఞాన పరాక్రమ విజయాది గుణాలలో విశ్వంలో యీ

ర్యునికి సము డెవడూ లేడు, సహస్ర బాహువైన కార్తవీర్యుడు సుదీర్ఘ కాలం అక్షయ
నుభవిస్తూ పృథ్వీ మండలాన్ని పాలించాడు. తత్కాలంలో ఆతనిలో బలం క్షీణించడం
నం లేకపోవడం కానీ జరుగలేదు. అతణ్ణి స్మరించిన వానికే ధనం లభించేది. కార్త
నుని అసంఖ్యాక పుత్రులూ పరశురాముని క్రోధాగ్నిలో భస్మమై పోయారు కానీ
గ జయధ్వజ శూరసేన, వృషభ, మధు, ఊర్జితులనేవారు ఐదుగురు మాత్రం మిగిలారు.
ధ్వజుని పుత్రుడైన తాలజంఘునికి కలిగిన నూరుగురు పుత్రులూ తాల జంఘ క్షత్రియ
తో ఖ్యాతి గాంచారు. ఔర్వ మహర్షి ప్రభావ సహకారాలతో సగర చక్రవర్తి వీళందరినీ
చేశాడు. వీరిలో మధునామకునికి నూరుగురు పుత్రులు కలిగారు.అందులో పెద్దవాడు వృష్ణి.
వృష్ణ యదువులు కారణంగానే యీ వంశానికి మాధవ, వార్ష్ణేయ, యాదవ నామాలు ప్రసిద్ధి
యి. యదువు కుమారుడు క్రోష్టు, అతని పుత్రుడు వృజినానుడు, వాని కుమారుడు శ్వాహి,
త్రుడు రుశేకుడు, అతని కుమారుడు చిత్ర రథుడు, వాని పుత్రుడు శశిబిందుడు. శశి
యోగ సంపన్నుడు, పరాక్రమశాలీ, భోగైశ్వర్యశాలీ అయి విరాజిల్లాడు. అతడు
జ, తురగ, కోశ, మాల, వస్త్ర, వృక్ష, శక్తి, పాశ, మణి, ఛత్ర, విమానాలనే - చతు
త్నాలకూ అధిపతి ఆయాడు. శశిబిందువుకు దశ సహస్ర సంఖ్యలో పత్నులున్నారు.
లో ఒక్కొక్కరికి అసంఖ్యాకంగా పుత్రులు కలిగారు. అతని సంతతి అగణితంగా వర్ధిల్లి
పృథుశ్రవునకు ధర్ముడు, వానికి ఉశనుడు కలిగారు. అతడు శత సంఖ్యలో అశ్వమేధ
లు చేశాడు. ఉశన నందనుడైన రుచకునకు పురుజిత్తు, రుక్మ, రుక్మేషు, పృథు, జ్యామఘ
లతో కుమారులు అయిదుగురు పుట్టారు. జ్యామఘుని పత్ని అయిన శైబ్యకు భీతిల్లి -
నం లేకపోయినా అతడు పునః వివాహం చేసుకోలేదు.ఒకానొకప్పుడు శత్రు మందిరం జయించి
డనుండి భోజ్య అనే పేరు గల కన్యను తనతో రథంమీద తీసుకురాగా అతని పత్ని శైబ్య
చూసి - "కపటీ! నా స్థానంలో మరొకతెను కూర్చో బెట్టుకుని తీసుకు వచ్చావా?"
కఠోరంగా పలుకుతూండగా జ్యామఘుడు - "ఈమె నీ కోడలు." అని సమాధానం
డు. అది విన్న శైబ్య విడ్డూరంగా - "గొడ్డాలి నైన నాకు కోడలేమిటి?" అంది.
అతడు - "నీకు పుట్టబోయే పుత్రునికే యీమె భార్య అవుంది." అన్న ఆ ప్రభు

ంకు విశ్వే దేవ, పితరులు అమోదం తెలియజేశారు. తరువాత శైబ్య విదర్భ నామక
ు కనగా ఆతనికే భోజ్యని యిచ్చి పెళ్ళిచేశారు.

—0—

# శ్రీమద్భాగవత మహాపురాణము

## స్కంధం–9 అధ్యాయం–24

### విదర్భ వంశ వర్ణన.

శుకమహర్షి పలుకు తున్నాడు – పరీక్షిన్నరేంద్రా ! విదర్భ రాజుకు భోజ్య వల్ల కుశ, రోమ పాద నామాలతో కుమారులు ముగ్గురు కలిగారు. రోమ పాదునకు బభ్రు అతనికి అతనికి ఉశిక, అతనికి చేదీ పుట్టారు. చేది వంశంలోనే దమఘోష నందనుడైన శిశు పులు పుట్టారు. క్రథ కుమారుడైన కుంతికి దృష్టి, వానికి నిర్వృతి, అతనికి దశార్హ, వానికి ంను అతనికి జీమూతుడు అతనికి వికృతి, వానికి భీమరథుడు, అతనికి నవరథుడు, అతనికి ంను వానికి శకుని అతనికి కరంభి వానికి దేవరాతుడు, అతనికి దేవ క్షత్రుడు వానికి మధు, కురువంశుడు వానికి అనువు అతనికి పురుహోత్రుడు,వానికి ఆయువు అతనికి పుట్టిన సాత్వ భజమాన, భజి, దివ్య, వృష్ణి, దేవావృథ, అంధక, మహా భోజ నామాలతో ఏడుగురు పులు కలిగారు. అందులో భజమానునికి యిర్వురు భార్యలు. అందులో ప్రథమ పత్నికి ు, కంకణుడు, ధృష్టుడు అన్న పేర్లు గల కుమార్లు ముగ్గురు కలిగారు, రెండవ పత్నికి, ప్తి, అజిత జిత్తు, సహస్ర జిత్తు అన్న పేర్లతో కుమారులు ముగ్గురు కలిగారు. దేవా ంద నుడైన బభ్రు దేవా వృథుడు దూరం నుండి వెలువడే శబ్దాలను మనం ఆలకించునట్లే దూరం నుండి కనిపించే దృశ్యాలను సందర్శించ గలడని చెబుతారు. బభ్రువు మానవ ు కాగా దేవా వృథుడు దైవ సమునిగా ఖ్యాతి గాంచారు. వీరిద్దరూ మహాత్ముల ఉపదేశాలు పరమపదం పొందారు. సాత్వత నందనుడైన మహాభోజుడు పరమ ధార్మికుడు. భోజవంశ

లు వర్ధిల్లినది కూడ యీయన వల్లనే. వృష్ణికి సుమిత్రుడు, పరంతపుడు, యుధాజిత్తు — పేర్లతో కుమారులు ముగ్గురు కలిగారు. యుధాజిత్తుకు శిని, అనమిత్రులని యిరువురు కలిగారు. అనజిత్తుని పుత్రుడు నిమ్న — అతని కుమారులు సత్రాజిత్తు, ప్రసేనజిత్తు లు. శినికి సత్యకుడు, ఆతనికి యుయుధానుడూ కలిగారు. సాత్యకి నామ ప్రఖ్యాతుడైన పుత్రుడు జయుడు. ఆతని కుమారుడు కుణి వాని పుత్రుడు యుగంధరుడు. అనమిత్రుని పుత్రుడైన వృష్ణికి శ్వఫల్క, చిత్రరథ నామాలు కల కుమారు లిద్దరు కలిగారు. నికి భార్య అయిన గాందిని యందు అక్రూరుడు, అసంగుడు, సారమేయుడు, మృదు మృదు విదుడు, గిరి, ధర్మ వృద్ధుడు, సుకర్ముడు, క్షేత్రోపేక్షుడు, అరి మర్దనుడు, శత్రు . గంధమాదనుడు, ప్రతి బాహువు—అనే పేర్లతో కుమారులు పదమూడు మంది పుట్టారు. సుచీర - అనే పేరు గల కన్య పుట్టింది. అక్రూరునికి దేవవానుడు, ఉపదేవుడు—అని యిద్దరు లు కలిగారు. శ్వఫల్కు నందనుడైన చిత్రరథునికి పృథు, విదూరథ అదిగా గల వృష్ణి ప్రధానులయిన కుమారులు అనేక మంది కలిగారు. సాత్వత పుత్రుడైన అంధకునికి కుకుర, త, శుచి, కంబళ—బర్హి అన్న పేర్లు గల పుత్రులు నలుగురు కలిగారు. అందులో కుకురు న్నా అతనికి విలోముడు, ఆతనికి కపోతరోముడు, అతనికి అనువూ కలిగారు. అనువుకు— ు నామక గంధర్వునితో స్నేహం ఏర్పడింది. అనువుకు అంధకుడు, ఆతనికి దుందుభి, అరిద్యోతనుడు, వానికి పునర్వసు, ఆతనికి ఆహుకుడు అనే పుత్రుడు, ఆహుకి అనే పేరు న్యయు పుట్టారు. ఆహుకునకు దేవకుడు, ఉగ్రసేనుడు అని యిరువురు కుమారులు కలి ఆ దేవకునకే దేవవాన్, ఉపదేవ, సుదేవ, దేవ వర్ధన నామాలతో నలుగురు పుత్రులు కలి ఆతనికే ధృతదేవా, శాంతిదేవా, ఉపదేవా, శ్రీదేవా, దేవ రక్షితా, సహదేవా, దేవకీ నామా డుగురు కుమార్తెలు కలిగారు. వీరందరినీ వసుదేవుడే పరిణయ మాడాడు.

ఉగ్రసేనునికి కంస, సునామ, న్యగ్రోధ కంక, శంకు, సుహూ, రాష్ట్రపాల, విసృష్ట, ంత నామాలతో కుమారులు తొమ్మండుగురు కలిగారు. ఇంకా కంసా, కంసవతీ, కంకా, రాష్ట్రపాలికా, — అనే కుమార్తెలైదుగురు పుట్టారు. వారిని వసుదేవ సోదరులైన దేవ లు పెళ్ళి చేసుకున్నారు. చిత్రరథుని పుత్రుడైన విదూరథునకు శూరుడు, అతనికి భజమా అతనికి శిని, అతనికి స్వయంభోజుడు, అతనికి హృదీకుడు, అతనికి దేవబాహువు, శత

స, కృతవర్మ అన్న పేర్లతో ముగ్గురు కుమారులు కలిగారు. దేవమీఢుని భార్య మారిష.
వసుదేవ, దేవభాగ, దేవశ్రవ, ఆనక, సృంజయ, శ్యామక, కంక, శమిక, వత్సక,
ామాలతో కుమారులు పది మంది కలిగారు. వీరందరూ పుణ్యాత్ములే. వసుదేవుని జనన
దేవ దుందుభులు స్వయంగా మ్రోగడం వల్ల అతనికి 'ఆనక దుందుభి' అన్న పేరుకూడ
తి చెందింది. అతనికి పృథ (కుంతి) శ్రుతదేవా, శ్రుత కీర్తి, శ్రుతశ్రవా, రాజాధిదేవి
పేర్లతో ఐదుగురు సోదరీమణు లుండే వారు. శూరసేనునికి కుంతిభోజు డనే మహారాజుతో
ం వుంది. అతనికి సంతతి లేకపోవడం వల్ల తన సంతతిలో జ్యేష్ఠురాలైన పృథను దత్తత
డు. కుంతిభోజుని పోషణలో ఆమెకు కుంతి నామం సార్థకమైనది. కన్యగా వుండగా కుంతి
నుణ్ణి సేవించి మెప్పించి దేవతలను ప్రత్యక్షం చేసుకుని వరాలు పొందే మంత్రాన్ని గ్రహిం
బాల్య చాపల్య, స్త్రీ స్వభావాలు కారణంగా ఆమె మంత్ర ప్రభావాన్ని పరీక్షించాలని
క్ష దేవత అయిన భాస్కరుని ఆహ్వానించగా అతడు ప్రత్యక్ష మవడంతో కుంతి అచ్చెరు
- సూర్య దేవా ! నేను మంత్ర ప్రభావం చూడాలని పిలచాను. నన్ను క్షమించి మీరు
." అన విని ఆదిత్యుడు – 'దేవీ! నా దర్శనం వృథాపోదు. నీ కన్యాత్వం దోష
ం కాకుండ పుత్రుణ్ణి ప్రసాదిస్తాను" అంటూనే కుంతికి గర్భాన్ని ప్రసాదించాడు. తత్ఫమ
కుంతికిభాను సమ తేజశ్శాలియైన పుత్రు డుద్భవించగా ఆమె లోకాపవాద భీతిచే ఆ శిశు
పెట్టెలో పెట్టి నదిలో విడిచి వేసింది. తరువాత ఆమె పాండురాజును పరిణయం చేసుకుంది.
పరాక్రమి. అయిన వాడు పాండు రాజు.

* * * *

పృథ సోదరి అయిన శ్రుత దేవను కరూష దేశాధినాథుడైన వృద్ధ శర్మ పరిణయం చేసు
డు. సనకాదులచే శాపగ్రస్తుడైన వైకుంఠ ద్వారపాలుడే హిరణ్యాక్షుడై యీమె గర్భాన
వక్త్రి నామంతో పుట్టాడు. శ్రుత కీర్తిని కేకయ దేశపాలకుడైన ధృష్టకేతువు పరిణయ
డు. ఈమె వల్ల సంతనర్దనాది కేకయ దేశాధినాథు లయిదుగురూ జన్మించారు. రాజాధిదేవిని
వుడన్న రాజపుత్రుడు పరిణయం చేసుకున్నాడు. ఆమెకు విందుడు, అనువిందుడు అన్న

ల కుమారులు యిద్దరు పుట్టారు. వారే అవంతీ దేశాన్ని పాలించారు. శ్రుత దేవను చేది
భుడైన దమ ఘోషుడు పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పుత్రుడే శిశుపాలుడు.

వసుదేవుని భార్య అయిన దేవ భాగ యందు చిత్రకేతు, బృహద్బల నామాలతో కుమారు
పుట్టారు. దేవశ్రవుని భార్య అయిన కంసవతి వల్ల సువీర, యిష్టమంతులని యిద్దరు
కలిగారు. ఆనకుని భార్య యగు కంక వల్ల శత్రుజిత్తు పురుజిత్తు నామాలతో యిద్దరు
కలిగారు. సృంజయ రాష్ట్రి పాలిక దంపతులకు వృష దుర్మర్షణాది కుమారులు కొందరు
. శ్యామక శూరభూమి దంపతులకు హరికేశ, హిరణ్యాక్ష నామాలు కల పుత్రులు యిద్దరు
. వత్సకునకు మిశ్రకేశి అనే అప్సరస వల్ల వృకాది కుమారులు కొందరు కలుగగా
రో వృకునకు దూర్వాక్షి వల్ల తక్ష, పుష్కర జాలాది కుమారులు పుట్టారు. శమీకుని భార్య
సుదామిని సుమిత్ర, అర్జున పాలాది పుత్రులను కన్నది. కంకుని భార్య అయిన కర్ణిక
ఋతుధామ, జయుడు అన్న పేర్లతో కుమారు లిద్దరు పుట్టారు. పౌరవీ, రోహిణీ, భద్రా,
, రోచనా ఇలా, దేవకీ—ఆదిగా గల వారు వసుదేవ పత్నులే. వసుదేవునకు రోహిణీ గర్భం
బలరామ, గద, సారణ, దుర్మద, విపుల, ధృవ, కృతాది కుమారులు కలిగారు. పౌరవి
మాత, సుభద్ర భద్రవాహ, దుర్మద, భద్రాదిగా గల వారు పన్నెండు మంది పుత్రులు
. నంద, ఉపనంద, కృతక, శూరాదులు మదిర వల్ల పుట్టారు. కౌసల్య వల్ల వంశోద్ధార
కేశి పుట్టాడు. అతడు రోచన వల్ల హస్త, హేమాంగద, ఇళ, వల్ల, ఉరువల్కాదు
కన్నాడు.వసుదేవునికి ధృతదేవ వల్ల విపృష్ఠుడూ, శాంతిదేవ వల్ల శ్రమ, ప్రతి శ్రుతాదులూ
చారు. ఉపదేవ పుత్రులైన కల్ప వర్షాది కుమాళ్ళు పది మందీ రాజు లయ్యారు. శ్రీదేవికి
హంస, సువంశాది కుమారులు ఆరుగురు కలిగారు. స్వయంగా ధర్మదేవత అష్ట వసువులను
ంప జేసినట్లు దేవరక్షిత గదాది నవ పుత్రులను ప్రభవింప జేసింది. అట్లే సహదేవ వల్ల
వునికి పురు విశ్రుతాది కుమారులు ఎనిమిది మంది కలిగారు. పరమోదార గుణుడైన వసు
కి దేవకి వల్ల కూడ ఎనమండ్రుగురు పుత్రులు ప్రభవించారు. అందులో కీర్తిమంతుడు,
ణుడు, భద్రసేనుడు, ఋజువు, సంమర్దనుడు భద్రుడు, శేషావతార మూర్తి అయిన బల
డు—ఈ దేవకీ వసుదేవుల అష్టమ కుమారుడే పాజాత్పరాత్పరుడైన శ్రీకృష్ణ చంద్రుడు.

రేంద్రా! నీ పితామహి అయిన సుభద్రాదేవి కూడ వసుదేవుని పుత్రికయే. ధర్మం క్షీణించి కంలో పాపం వర్ధిల్లి నప్పుడల్లా పరమాత్మ యీ లోకంలో ప్రాదుర్భవిస్తూ వుంటాడు.

ర్వ శక్తి సంపన్నుడూ, సర్వ ద్రష్టయు, అసంగుడూ అయిన పరమాత్మకు, ఆత్మ స్వరూ న యోగ మాయ వినా అన్య కారణం లేదు. ఆ దేవాధి దేవుని మాయా విలాసమే జీవుల స్థితి, లయాలకు కారణమై వుంది. ఆ పరమాత్మ యొక్క అనుగ్రహమే మాయాతీత ఆత్మానుసంధాన రూపమైన మోక్షానికి కారణము. అసురులు రాజవేషధారులై అగణిత ణీ సేనలతో భూమండలాన్ని ఆక్రమించి సజ్జనులనూ, ప్రజలనూ వేధిస్తూ వేద విరుద్ధ ను వ్యాపింప జేయ సాగిన నాడే శేషావతారుడైన బలరామునితో సహా శ్రీమన్నారాయణ డు భూమండలంలో శ్రీ కృష్ణ స్వరూపంలో అవతరించాడు. శ్రీకృష్ణ దేవుని లీలలను లు సయితం మనసా ప్రయత్నించి అనుమానాది ప్రమాణాల వల్ల కూడ గ్రహించ మౌనం వహించారు. భూభారాన్ని పరమాత్మ—పఠన శ్రవణ, మనన, పూజా మాల మాత్రంచే పాపాలను నాశనంచేయగలనట్టి తన పావన లీలా భూయిష్టమైన దివ్య గాథను రూపంలో — కలియుగ మానవ తరణోపాయార్థం ప్రసాదించాడు.

శ్రీకృష్ణ దివ్య కథామృత పాన మాత్రంచే మానవ మాత్రులు పవిత్రు అవుతారు ఈ తం సజ్జనుల శ్రవణేంద్రియాలకు సాక్షాత్తు అమృత ప్రాయమే. జీవితంలో ఒక్క శ్రీ కృష్ణ కథామృతాన్ని కర్ణాంజలితో పానం చేస్తే మనుష్యమాత్రుని కర్మ వాసనా ం నిర్మూల మవుతుంది. భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దాశార్హ కురు సృంజయ ాదులయిన వీరు అందరూ నిరంతరం కృష్ణ లీలలను శ్లాఘించేవారు. మనోహర శ్యామ మూర్తి అయిన శ్రీకృష్ణ చంద్రుని మందస్మిత వదనార విందమూ, ఆ దేవ దేవుడు తి మధుర చిత్తవృత్తితో, అనుగ్రహ పూర్ణ వాణితో, వీర పరాక్రమ పూర్ణమైన లీలలతో మ్బ మండలానికి పరమానందాన్ని ప్రసాదించాడు. శ్యామసుందరుని వదనారవిందం మధు ధుర మయింది. మకర కుండల సుశోభిత కర్ణాభాసచే సౌందర్య శోభిత కపోల భాగంతో, స్మిత సుందర వదనార విందాన్ని — సర్వదా దర్శించే భాగ్యశాలురకు కూడ తృప్తి కలిగేది ఆ సుందర వదనారవింద మాధుర్యాన్ని పానం చేయడంలో మగ్నమైన నేత్రాలకు రెప్ప

ఏర్పడితే అందుకు కారణుడైన నిమి యందు ఆగ్రహం కలిగి వుండే వారు – ఆ జనులు పురుషోత్తముడైన భగవానుడు మధురా నగరంలో వసుదేవ మందిరంలోనే అవతరించినా ే వుండక గోకులంలో నందుని సుందర మందిరంలో వుంటూ – అక్కడుండే విశుద్ధాంత ైన గో, గోపికలను అనుగ్రహించడమే ప్రధాన లక్ష్యంగా చరించాడు. లక్ష్యం పూర్తి మధురా నగరానికి మరలి వచ్చి మధుర, ద్వారకా నగరాలలో వుంటూ—లోక కంటకులైన స్థలను అనేక మందిని అంతం చేసి – సహస్రాల సంఖ్యలో స్త్రీలను పరిణయ మాడి సంతానాన్ని ప్రభవింప జేశాడు. అంతేకాదు ఆత్మ సాక్షాత్కార యోగ్యమైన వేద స్థాపించడానికై స్వయంగా తాను యాగానీకం ద్వారా స్వాత్మారాధనతో విశ్వంలో వేద స్థాపించాడు. కురుక్షేత్రంలో కౌరవ పాండవ సంగ్రామంలో భూభారాన్ని విశేషంగా ాడు. తద్యుద్ధంలో విశేష భాగం భూభారాన్ని హరించాడు. తన దృక్ప్రసార మాత్రంచే అక్షౌహిణీ సేనలను నాశనం చేసి–విజయాన్ని అర్జునునకు ప్రసాదించి అతని కీర్తి దశ ్తం చేశాడు. పర్యవసానంలో ఉద్ధవునికి ఆత్మ తత్త్వోపదేశం చేసి స్వధామం చేరాడు.

'నవమ స్కంధం సమాప్తము.

